# నారీద్వేషి



## చక్రపాణి



**1/8**
*Rupees*

# నారీద్వేషి

రవీంద్రనాథ మైత్ర

రచితం

Chakrapani.
'చక్రపాణి'

అనువాదం.

యువ బుక్ డిపో

మద్రాసు :: తెనాలి

# త్రిలోచన కవిరాజు

నాకు మరోశబ్దమేదీ వినిపించటంలేదు. నా కాళ్లనున్న పాదుకలకూ, ఫుట్‌పాత్‌కూ ఘర్షణవల్ల పుట్టిన టకటక టకటక శబ్దంమాత్రం నానావిధ లయలతో మేళవించి నా కర్ణకుహరాల్లో ప్రవేశిస్తోంది. అదే వింటో వింటో నా మనస్సు వికలమైపోయింది. జీవితం వ్యర్థంగా తోచసాగింది. ఉదయం 'జంట్సు రెస్టారెంట్ డిలక్స్'లో కప్పు కానీచేసి తీసుకున్న టీ — మూడు రోజులనాటి మాడిపోయిన టోస్టూ-ఉండిఉండి అవే తేపుకు వస్తున్నవి. ఇవ్వాళ పగలంతా యింటికి తిరిగి రాకూడదని సంకల్పించుకొని బయలుదేరాను; కాని ఎక్కడ గడుపుదామా అనేది నిర్ణయించుకో లేకపోయాను. నాకు పరిచితులయిన ఒక రిద్దరి స్నేహితుల ఇళ్లు సమీపంలోనే వున్నాయి. అక్కడకు పోవచ్చును కూడా. ఎందుకనో అక్కడకు పోవటానికి నాకు మనస్కరించలేదు. బజారునుంచి వెచ్చం తెచ్చుకొంటున్న ఒక రిద్దరు దాసీలు నా ప్రక్కగానే వెళ్ళిపోయారు; వాళ్ళవంక నేను కన్నెత్తి కూడా చూడలేదు. అనుక్షణమూ ప్రపంచమంటే వీతరాగిని కాసాగాను. ఈ ప్రపంచమంతా వొక సంతఅయినా శ్మశానమయినా నాకు ఏమీ ఆక్షేపణ లేదు.

పోతూ పోతూ వుండగా ఒక యింట్లో అకస్మాత్తుగా పురుషుల రోదన ధ్వని వినపడింది. నేను అక్కడే ఆగిపోయి కిటికీగుండా చూచాను. ఇంట్లో చాలామంది పురుషులు వున్నారు. కొందరు ఏడుస్తున్నారు; కొందరు కళ్లు తుడుచుకొంటున్నారు. వాకిట్లో పాడె కానీ, అనంతశయనం కానీ లేదు. పైవంక చూచాను; మేడకు యీ కొసనుంచి ఆ కొసవరకు పెద్ద సైనుబోర్డు కట్టివుంది. దానిమీద గిల్టు అక్షరాలతో యిలా వ్రాసివుంది—

ప్రేమార్తి హరణ ఔషధాలయము

త్రిలోచన కవిరాజు

ఈ ఔషధాలయమూ, కవిరాజూ కొత్తగా కనిపించటంవల్ల ఏమిటో తెలుసుకుందామనే కుతూహలంతో ఆగిపోయాను. కాని మరుక్షణానే

ఈ ఔషధాలయం కానీ కవిరాజు కానీ క్రొత్తవారు కారని గ్రహించాను. ఎందుకంటే సైనుబోర్డుమీద గిల్టు అక్షరాలు బాగా నల్లబడిపోయినై. ఇంతే కాక రోగులు వేచివుండే గదికి ప్రక్క హాల్లోవున్న ఫర్నిచరు, నాకు కనపడుతున్నంతవరకు, పాతదిగానే వున్నది. క్రింద పరిచిన తివాసీకూడా సిరా మరకలతోనూ నూనెడాగులతోనూ నిండివున్నది. గల్లాముందు కూర్చున్న వృద్ధుడుకూడా క్రొత్తవాడుగా కనపడలేదు. ఇది కవిరాజుగారి డిస్పెన్సరీ అని అప్పుడు గ్రహించాను. గల్లా ముందుకూర్చున్న వృద్ధుడు నన్ను తదేక ధ్యానంలో చూస్తూ—"దయచేయండి, లోపలికి దయచేయండి." అన్నాడు

లోపలికిపోయి తివాసీమీద కూర్చున్నాను. గోడమీద మదన దహన తైల చిత్రం తగిలించి వున్నది. అదే చూస్తూవుండగా ఆ మహాశయుడు అన్నాడు. "తెలుసండీ, ఇక్కడ రోగనిదానం చేయించుకొన్నందుకు ఫీజు ఎనిమిది రూపాయలు యివ్వాలి."

"ఫీజు ఎవరికి ?" నేను అడిగాను.

"కవిరాజుగారి ఫీజు. తమ వ్యాధి తప్పకుండా మూడు రోజులలో సమూలంగా నాశన మవుతుంది. కవిరాజు సాక్షాత్తూ ధన్వంతరి."

నేను విరక్తుడనై అన్నాను—"ఇది చెప్పటానికేనా తమరు పిలిచింది నాకు రోగం రాగం ఏదీ లేదు!"

"తప్పకుండా వుంది. ఈరోగం లేని స్త్రీపురుషు లెవ్వరూలేరు. రాజా మహారాజాల దగ్గరనుంచి—" అన్నాడు వృద్ధుడు.

నేనతనిమాట పూర్తికానివ్వ లేదు. మధ్యనే వ్యంగ్యంగా అన్నాను— "తమరు అంతర్యామి లాగున్నారే!"

వృద్ధు డలాగే శాంతంగా—"చిత్తం. అలా అనుకొన్నా పొరపాటేమీ వుండదండి. చూడు, మహాశయా! ఇప్పుడు నాకు అరవైమూడో వసంతం గడుస్తూ వుంది. గత పద్దెనిమిది సంవత్సరాలనుంచీ కవిరాజుగారి దగ్గర కంపౌండరీ చేస్తున్నాను. సగటున రోజుకు మూడువందల మందికి మందు లిస్తూవుంటాను. వసంతఋతువులోనూ వర్షాకాలంలోనూ రోగులసంఖ్య రెట్టింపవుతుంది. ముప్పైమంది పిల్లకాయలకు పొట్లాలు కట్టటానికి వూపిరి ఆడదు

నా అనుభవంమీద తెలుసుకున్నది తమకు చెప్పుతున్నాను — కవిరాజుగారి ఔషధం తీసుకోంది ఎవ్వరికీ జరగదు! తమరేం—" అని చెప్పుకుపోతున్నాడు.

నేను కొంచెం ఆశ్చర్యంతో—"మీరు ఏజబ్బుసంగతి చెప్పేదీ తెలిస్తే—" అన్నాను.

"తమరు సైనుబోర్డు చూడలేదా ఏంటి? యావత్తు ప్రణయజనిత వ్యాధులను, ఔషధం ద్వారాగానీ, ముష్టియోగంవల్లగానీ చికిత్సచేస్తారు. ఫీజు ఎనిమిదిరూపాయలు—మందు ఉచితం! ఇంతకంటె మీకు మంచి సౌకర్యం ఎక్కడ దొరుకుతుంది!" అన్నాడు వృద్ధుడు.

తల తిప్పా, గుండెదడా, మొదలగు ప్రణయజనిత వ్యాధులపేర్లూ, వాటికి రకరకాల పేటెంటు ఔషధాలూ—పెద్దపెద్ద మాసపత్రికలలోనూ దినపత్రికలలోనూ ప్రకటింపబడుతూవుంటం నా చిన్నతనంనుంచి చూస్తూ వస్తున్నాను. కాని వాటి అవుసరం నాకెప్పుడూ కలగలేదు. ఇవ్వాళ యీ వృద్ధుడు—ఇలా ఆలోచిస్తున్నాను.

వృద్ధుడన్నాడు—"ఏమిటి ఆలోచిస్తున్నారు? తమకేమీ రోగంలేదని భావిస్తున్నట్టుగా వున్నదే! కవిరాజుగారి ఎదుట పడగానే తమకు రోగమున్నదీ లేనిదీ తెలిసిపోతుంది. మహాశయా! ఇప్పుడు తమ ప్రాయంకూడా ఎంత? నన్ను చూడండి, నా పేరు బలరామరసనిధి. అయిదుగురు స్త్రీల అస్తి లిదివరకే గంగలో కలిపాను. ఈ అరవైమూడో యేటకూడా అప్పుడప్పుడు కవిరాజుగారి దగ్గరనుంచి ప్రిస్క్రిప్షన్ రాయించుకోవలసి వుంటూ వుంటుంది."

నేను ఎదురు చెప్పలేకపోయాను. ఈవ్యాధి నాక్కూడా వున్నట్టు తోచ సాగింది. భార్యతో పోట్లాడి వచ్చినప్పటినుంచి నాతల చిటపటలాడుతూ వుంది. ఇదికూడా ఏదో ప్రణయసంబంధమైన వ్యాధే కావచ్చునని భావించాను. ఇది ఏజబ్బో అడిగి తెలుసుకోవాలను కొంటూవుండగా రసనిధి మహాశయుడు అదుర్దాగా—"ఇదుగో! కవిరాజుగారు వచ్చేశారు!" అన్నాడు.

మరుక్షణం హుక్కా చేతపట్టుకొని, మోహముద్గరం వల్లిస్తూ త్రిలోచన

కవిరాజుగారు గదిలో ప్రవేశించారు. వయస్సు డెబ్బదికి దాటివుంటుంది. మాడుమీద వెంట్రుకలు బొత్తిగాలేవు. వెనకవున్న నాలుగు వెంట్రుకలు జనపనార పీచులాగ తెల్లగా వున్నాయి. వాటిచివర వుమ్మెత్తపూవు కట్టి వుంది. కవిరాజుగారి లలాటంమీద, స్ఫటిక భాగవతులు శివుని వేషంలో పెట్టుకున్నట్టుగా, ఒక కన్ను—దాని మధ్యను అక్షితారకా చిత్రించి వుంది.

తివాసీ మీద కూర్చోగానే కవిరాజుగారు ముందు నావంక చూశారు. ఎందుకో తెలియదు, నాకళ్ళు వాటంతటవే మూతపడ్డవి. కవిరాజుగారు నన్ను చూచి ఓదార్పుగా "భయం లేదు. ఆరోగ్యం కలుగుతుందిలే." అన్నారు. తర్వాత హుక్కా ఒక్క పీల్పు పీల్చి కేకవేశారు—"రోగులను తీసుకురా, మాధాయి."

పిలుపు విని కొందరు బాలశిష్యులు హాజరయి కవిరాజుగారికి నమస్కారం చేసి రోగులున్న గదిలోకి వెళ్ళారు. నేను తివాసీమీదనుంచి లేచి ఒక మూలగా వున్న ముక్కాలి పీటమీద కూర్చుని రోగులున్న గదివైపు లోలుప నేత్రాలతో చూడసాచాను.

రోగులున్న గదిలో నుంచి నానావిధ గుంజనాలూ, దీర్ఘ శ్వాసలూ, స్ఫుట, అస్ఫుట రోదనాలూ వినిపిస్తున్నాయి. తర్వాత కవిరాజుగారి శిష్యుల భుజాలమీద చేతులు మోపి రోగులు హాల్లోకి రా మొదలెట్టారు.

ఇదేమిటి! దాదాపు అందరూ నేను ఎరిగినవారే! రసనిధిగారు చెప్పిన దానిలో వీసం కూడా అబద్ధంలేదు, రాజకీయ నాయకుల దగ్గరనుంచి మాస పత్రికల సంపాదకుల వరకు అన్నితరగతుల వ్యక్తులూ చికిత్సకోసం వచ్చారు. ఇందులో విశేష మేమంటే అందరూ ఏడ్చేవారే. కాని ఒకరివంక ఒకరు మాత్రం చూచుకోడం లేదు. జబ్బు చూపించుకోవడానికి వచ్చినవారిలో పండు వృద్ధుల దగ్గరనుంచి పది సంవత్సరాల పిల్లలవరకూ ఉన్నారు. నా మనస్సులో ఒక సందేహం కలిగింది. రసనిధిమహాశయుని వద్దకు వెళ్ళి చెవిలో అడిగాను — "ఆఁ, స్త్రీలుకూడా వున్నారు — కాని రెండో అంతస్తులో. వీరిని పంపిన తర్వాత వారిని చూస్తారు." అన్నారు వారు.

కవిరాజుగారు—"ముందు పిల్లలను హాజరుపెట్టు" అని కేకవేశారు.

ఒక్కమాటే అయిదారుగురు స్కూలుపిల్లలు కళ్లుతుడుచుకొంటూ తుడుచుకొంటూ వచ్చి తివాసీమీద కూర్చున్నారు. కవిరాజుగారు గంభీర స్వరంతో—"పరీక్ష తప్పారా?" అని అడిగారు.

అందరు-తాళంతప్పకుండా వెక్కి వెక్కి ఏడుస్తూ 'ఊఁ.'అని జవాబిచ్చారు.

కవిరాజుగారు ఇకేమీ అడగలేదు. రసనిధి వైపు చూచి చెప్పారు—"ఉదయం 'మోహముద్గర గుటిక' ఒక మాత్ర. పథ్యం ఉపవాసం."

ఫీజు దాఖలుచేసి మందు తీసికొని విద్యార్థులు వెళ్లిపోయారు.

తర్వాత యుక్తవయస్కులు రాసాగారు. మొదట వచ్చినవారిని నేను ఎరగను. ఆయన కవిరాజుగారి ముందు కూర్చుని భోరున ఏడ్చాడు.

కవిరాజుగారు "వృత్తి ఏమిటి?" అని ప్రశ్నించారు. వారు ఏడుస్తూనే జవాబిచ్చారు—"పత్రికా సంపాదకత్వం."

"హుఁ! కవిత్వం ప్రకటించావా?"

"చిత్తం, దానిమూలానే—"

"హుఁ! కవయిత్రికి ఉత్తరం వ్రాశావా?

"చిత్తం, ఆ జవాబు చూచినతర్వాతనే—" అంటూనే సంపాదకుడు ఆవురున ఏడ్చాడు.

కవిరాజుగారి పాలిపోవని నిదానము చూచి నేను ఆశ్చర్యపడ్డాను! కవిరాజుగారు రోగినాడిచూచి రసనిధితో—"ఉదయం, సాయంత్రం 'అశ్రుభైరవ వటి' మధ్యాహ్నం స్వల్పంగా 'ప్రణయాంతకం'" అనిచెప్పి సంపాదకునివంక చూచి అన్నారు—"పత్రికా సంపాదకత్వం వదిలేసేయి."

ఈసమయంలో సన్నని ఆర్తనాదం ఒకటి విన్నాను. మరుక్షణంలోనే మాధాయి వచ్చి, రెండో అంతస్తులో ఒకరోగిణి మూర్ఛపోయిందని చెప్పాడు. కవిరాజుగారు లేచారు. ఒకచిటికెడు నస్యం తీసి నాసికాపుటాల్లో కుక్కుకొంటూ పై అంతస్తుకు వెళ్ళారు. నేనీకాళీలో రసనిధి మహాశయునివద్దకు వెళ్లి అన్నాను—"తమరు వేరుగ భావించకపోతే—"

"అలా ఎప్పటికీ భావించను. తమకు కావలసింది ఏదో అడగండి." అన్నాడు రసనిధి.

కవిరాజుగారి వృత్తాంతం తెలుసుకోవాలని నామనస్సు తహతహలాడుతూ వుంది—"తమరు కవిరాజుగారిని చాలారోజులనుంచి ఎరుగుదురు. వారి విషయం—"

రసనిధి ఆశ్చర్యంతో "కవిరాజుగారి చరిత్ర తెలియదూ మీకు? అలా అయితే క్లుప్తంగా చెప్తాను వినండి.—యాభైసంవత్సరాల క్రితం సంగతి. అప్పుడు కవిరాజుగారు సిద్ధాంత కౌముదీ మేము ముగ్ధబోధా చదువుతున్నాము. హఠాత్తుగా ఒకరోజున గ్రామంలోవుండే రజకనందిని ధైర్యమయి, త్రిలోచనబాబు తన కొంగు లాగాడని ఆచార్యులవారి దగ్గర ఫిర్యాదు చేసింది. ఆచార్యులవారు నిందా కోపించి వీరిని పాఠశాలనుంచి వెళ్ళకొట్టారు. ఆ క్షణానే త్రిలోచనబాబు సంసారాన్ని త్యజించి, ఆ దేశమూ ఈ దేశమూ తిరిగి జగత్తులో ప్రేమ వ్యాధి అన్నిటికంటే ప్రాణాంతకమైనదని గ్రహించారు. అప్పుడు జీవహితంకోసం ఔషధం వెదుకుతూ వెదుకుతూ తిన్నగా హిమాలయం వెళ్ళారు. అక్కడ సిద్ధులైన మదన మథన స్వామిని ఆశ్రయించి, వారి దగ్గర దీక్ష పొందారు. వారే వీరి ప్రేమవ్యాధిని పోగొట్టారు. తదుపరి గురువుగారి ఆదేశానుసారం—లోకహితంకోసం—గురుప్రదత్తమైన మూలికలు తీసుకుని, మరల ప్రపంచంలోకి వచ్చి యీ డిస్పెన్సరీ తెరచారు. వీరి శిష్యులెవ్వరూ పెళ్లిచేసుకోకూడదనే నియమము మొకటున్నది; నాకుమాత్రం—నా పైత్రికవృత్తి యిదే కావడంవల్ల—ఆ నిబంధన తొలగించారు. కవిరాజుగారి కృపవల్ల కానీండి, నా అదృష్టంవల్ల కానీండి—ఇప్పటికి అయిదుగురు స్త్రీల చేతుల్లోంచి ఉద్ధరింపబడ్డాను. ఓ గురూ, మీరే తారకం!" అని రసనిధి రెండు చేతులూ ఎత్తి కవిరాజుగారి నుద్దేశించి నమస్కరించాడు.

ఈ సమయంలో కవిరాజుగారు మరల వచ్చి తివాసీమీద కూర్చున్నారు. ఈ తఫా నేనుకూడా భక్తితో కవిరాజుగారి పాదధూళి తీసుకున్నాను. కవిరాజుగారు నా తల స్పృశించి ఆశీర్వదించారు.

రోగులింకా యేడుస్తూనే ఉన్నారు. కవిరాజుగారు "ఖామోష్!" అని గద్దించారు—క్రందనధ్వని ఆగిపోయింది. ఇంకా ఎక్కిళ్లూ ముక్కుళ్లూ మాత్రం వినపడుతున్నై.

రెండవ రోగివచ్చి కూర్చున్నాడు. వయసు పాతిక సంవత్సరాలుంటుంది. వొంటిమీద గులాబిరంగు పంజాబు లాల్చీ వుంది. ఏడవటం మూలాన కళ్లు ఎర్రగా వున్నయి. క్రాపు చిక్కురు బొక్కురుగా రేగివుంది. తివాసీ మీద కూర్చోగానే నాలుగు బారల నిట్టూర్పొకటి విడిచాడు. కవిరాజుగారి తెరచివున్న పొడుము డబ్బా నుంచి కొంచెం నస్యం ఎగిరి క్రింద పడింది. కవిరాజుగారు యిది గమనించారు. తర్వాత చేయిచాచి రోగి నాడి చూచి—"రోగ వివరాలు చెప్పూ?" అని అడిగారు.

పక్కయింటి పిట్టగోడమీద ఆరవేసిన చీర చూచి మొదట ఇతనికి ఏ విధంగా రోగముత్పన్నమైందీ, తర్వాత క్రమంగా అనిద్రా, అరుచీ, దీర్ఘ శ్వాసలూ—మొదలగు యితర లక్షణాలు (symptoms) ఎలా కనపడిందీ—అతను వర్ణించాడు. ఆఖరుకు నిన్న సాయంత్రం ఆ చీర ఆవిడ మిద్దెనుంచి కూరగాయ తొక్కలు యితని నెత్తిమీద పడవేసి నందువల్ల ఇంకా చాలా లక్షణాలు పుట్టుకొచ్చినవని చెప్పి, జేబులోనుంచి అరటికాయ తోలుతీసి కవిరాజుగారికి చూపిస్తూ—"ఆమె స్మృతి చిహ్నం అట్టేపెట్టాను—ఇది తోలుకాదు—పూలు!" అన్నాడు.

కవిరాజుగారు అతని చేతినుంచి తోలు తీసికొని పరీక్షించి—"హుం! నిన్ను యీ జంఝాటంలో యిరికించి నావిడప్రాయం ఎంత?" అని అడిగారు.

రోగి చీత్కారంచేశాడు—"పదహారు!—పదహారు!—sweet six—"

కవిరాజుగారు "ఖామోష్!" అని గద్దించి "మందు, ఉదయం 'కిశోరీ కాలానలం' లోపలకు, సాయంత్రం 'దీర్ఘశ్వాసారి ఘృతం' రొమ్ముమీద పూతకు. పో, దక్షిణంవైపు కిటికీమీద మందపు పరదా వొకటి వేయి."

తర్వాత చాలామంది రోగులు వచ్చారు. కాని, ఆశ్చర్యమేమంటే—అందరూ సంకోచంలేకుండా అందరి యెదుట గూఢవిషయాలను కూడా వెల్లడిస్తున్నారు. అణుమాత్రం సిగ్గుకూడా ఎవ్వరూ పడటం లేదు. వృద్ధ అనుకూల చక్రవర్తిని నేను ఎరుగుదును. అతనికీ అతని నాలుగో సంబంధం భార్యకీ కలవక పోవటంచేత, ప్రస్తుతం పొరుగింటి విశ్వంభరబాబు ప్రౌఢ పత్నిని చూచి రోగస్తుడయ్యాడు. ఇటు విశ్వంభరబాబు కూడా అనుకూల

బాబూనాలుగో భార్యను కాస్త తీర్థాటనం చేయించుకు రావాలని సంకల్పించుకున్నాడు. ఈ సంకల్పానికి ఫలితంగా అతనికి శిరోపీడా, అరుచీ—ఆది లక్షణాలు కనపడసాగినవి. ఈ యిద్దరూ తమ తమ రోగాలనూ, కుటుంబ రహస్యాలనూ, ఒకరి ఎదుట ఒకరు చెప్పారు. లవలేశంకూడా వారు సంకోచించలేదు. త్రిలోచన కవిరాజుగారిలో వున్న ఆధ్యాత్మిక శక్తిని చూచి, నాకు వారియెడల భక్తి మరీ ఎక్కువ కాసాగింది.

ఒకరి తర్వాత ఒకరు రోగులు వస్తున్నారు; మందు తీసుకొంటున్నారు; పోతున్నారు. కాస్త కూడా విరామం లేదు. ఇటు వేళకూడా చాలా మిగిలి పోయింది.

నేను లేవాలనుకొంటూ వుండగా, తుపానువలె ఒక వ్యక్తి గదిలోకి పరుగెత్తుకొచ్చి చీత్కారం చేశాడు—"ప్రాణాలు పోతున్నాయి!!"

నేను భయంతో రోమాంచితుడ నయాను. అరే! ఇతడు వాస్తవిక సమితి ముఖ్య సభ్యుడు రాతులరాహోయే! రాహోమహాశయుడు స్వప్న రాజ్యంలోంచి వాస్తవిక ప్రపంచంలోకి ఎలా వచ్చాడు?...గదిలోవున్న వాళ్ళంతా స్తబ్ధులయారు. ఒక్క క్షణంక్రింద మక్కుతూ మూలుగుతూ దీర్ఘ శ్వాసలు విడుస్తూవున్న రోగులంతా కొత్త రోగి స్థితిని చూసి, కౌతూహలం వల్ల కావచ్చు,—శ్వాస పీల్చడమే మరిచిపోయారు. కవిరాజుగారు ఒకమాటు రాహోవంక చూచారు. తర్వాత లేచి అల్మారీనుంచి బిల్వకాష్టపు స్టెతిస్కోపు తీసుకువచ్చి రాహో హృదయంమీద పెట్టారు.

"బాధ! బాధ! హృదయం జల్లెడయిపోయింది, కవిరాజుగారూ, జల్లెడ!" అని రోగి చీత్కారంచేశాడు.

కవిరాజుగారు గద్దించారు. రోగి స్తబ్ధుడయాడు. నాడిచూచి కవిరాజు గారు "హుం—! రోగం కష్టసాధ్యం" అన్నాడు.

కవిరాజుగారు దిలాసాయిస్తూ—"ఏమీ భయంలేదు. ముందు, సంగతేమిటో చెప్పు" అన్నాడు.

రోగి—"ఇంకా ఏమి సంగతి కవిరాజుగారూ! హృదయం ఆగిపోటానికి సిద్ధంగావుంది."

కవిరాజుగారు కళ్ళు మూసుకొని—"హుం! చెప్పుకు పద" అన్నారు.

రాహో చెప్పసాగాడు—"ప్రేమ నా హృదయంలో గూడు కట్టుకుంది—చిన్నప్పటినుంచీ! ఆ గూటినుంచి, వందలకొలది ప్రేమ పక్షులు—గ్రుడ్లు పగలగొట్టుకొని బయటపడ్డై. ప్రపంచమంతా తిరిగి మళ్ళీ అవి ఇప్పుడు హృదయ పంజరంలోకి రావాలని చూస్తున్నాయి; కాని చోటులేదు! చోటులేదు!—" కనుబొమలు చిట్లించి కవిరాజుగారు—"స్పష్టంగా చెప్పు" అన్నారు!

తర్వాత రాహో చెప్పినదానికి భావార్థమిది:—ఇతను ఒకరి తర్వాత ఒకరి చొప్పున పందొమ్మిదిమంది కుమారికలకు తన ప్రేమ నివేదించాడు. ఆ నివేదితల గార్డియన్లు రాహో మహాశయుని అడ్రసు తెలుసుకొని, వాసవిక సమితి నుండి వీరిని పట్టుకువచ్చి ఆ కుమారికల ప్రేమార్ఘ్యము స్వీకరించమని వత్తిడి చేయ నారంభించారు! రాహో తలిదండ్రులకు ఈ సంగతి తెలిసి చాలా వ్యాకులపడ్డారు. రాహో ముత్తాత ఒక్క సంవత్సరంలో యిరవైయొక్క వివాహాలు చేసుకొని, ప్రచురధనంతోపాటు యధోచిత మర్యాదకూడా పొందాడని ఘటకులు చెప్పుతున్నారు. ఇది విని పురోహితులు వుబ్బి తబ్బిబ్బై దగ్గరలో సుతహిబుకయోగం ఏదన్నా వున్నదేమోనని పంచాంగాలు తిరగవేస్తున్నారు.

కవిరాజుగారు కొంచెంసేపు ధ్యానమగ్నులై అన్నారు. "రోగం జటిలమైనది. దీనికి నియమంగా చికిత్స జరగాలి." అని కళ్లుమూసుకొని ప్రిస్క్రిప్షన్ చెప్పారు—"ఉదయం 'బృహత్ ప్రేమాంకుశ లౌహం' నిండు మాత్ర; 'పురోహిత నిసూదనవటి' అరమాత్ర; మధ్యాహ్నం 'వివాహ విద్రావణ రసం' సాయంత్రం 'ఘటకాళనీ' 'శ్యట్రాంగావలేహమూ'—పథ్యం మొదటి మూడురోజులూ లంఖణం—తర్వాత జబ్బునుబట్టి"

ప్రిస్క్రిప్షన్ ప్రకారం మందు తీసుకొని రాహో బయలుదేరాడు. నేను అతని స్థితిగతులు కనుక్కుందామనే వుద్దేశంతో, పోవటానికిలేచి నిలబడ్డాను. కవిరాజుగారు వెనకనుంచి కేకవేశారు—"కొంచెం ఆగు!" తిరిగి చూశాను. కవిరాజుగారు మరల అన్నారు—"నీతో కాస్త పనివుంది."

నేను కూర్చున్నాను. రోగులంతా వెళ్లిపోయాక కవిరాజుగారు నాతో —"నిన్ను చూట్టం యిదే ప్రథమం. కాని ఎందువల్లనో నీవంటే నాకు కొంచెం మమకారం కలుగుతూవుంది. బహుశ నీలో యీజబ్బు లేనికారణం వల్లనే కావచ్చు. బుద్ధిమంతులూ, ఖ్యాతివంతులూ, విద్యావంతులూ, ధనికులూ—ఎవ్వరుకూడా యీప్రేమవ్యాధిపాశాలనుంచి తప్పించుకోలేకుండా వున్నారు. ఇది నీవిప్పుడు స్వయంగా చూచావు. ఈపట్టణంలో ఈచికిత్సాలయం పెట్టకపోతే వీరిగతి ఏమయేదో నేను వూహించలేకుండా వున్నాను. యౌవనారంభంలో నన్ను యీవ్యాధి మహాభయంకరంగా పీడించింది. గురుదీక్షపొంది తరించాను. మీకు వ్రాసేకథలూ కవిత్వాలూ చదువుతూవుంటే, ఇప్పుడుకూడా ఒకటి రెండు రోగలక్షణాలు కనిపిస్తాయి. అందువల్ల అవి చదవటం బొత్తిగా మానేశాను. నేను ఎంతగా ప్రయత్నిస్తున్నా యీ భయంకరమైన అంటువ్యాధి నలువైపులా వ్యాపిస్తోంది. ఇది విచారకరమే కాదు—విచారణీయముకూడా. పుష్టికరమైన ఆహారం దొరకనందువల్ల మీరంతా దుర్బలులై పోతున్నారు. రోగం యింత త్వరగా ఆక్రమించటానికి యిదికూడా ఒకకారణం కావచ్చు. పూర్వం కంఠాశ్లేషం మినహా యీ వ్యాధి వచ్చేదికాదు. ఇప్పుడో కటాక్షమే చాలు! ఇక స్కూలూ కాలేజీల నుంచి చీర చెరగులూ తాళపు చెవుల గుత్తులవరకు యీ రోగ కీటాణువులను వెదజల్లుతున్నాయి. భవిష్యత్తులో కేవలం పదధ్వని వింటేనే మీకు మూర్ఛ రావచ్చు."

సిగ్గుచే నాముఖం కందిపోయింది. జేబులో డబ్బు లేనప్పుడు భార్య పదధ్వనివింటే నాక్కూడా మూర్ఛవచ్చే పర్యంత మవుతుంది. కాని యీమాట కవిరాజుగారితో చెప్పలేకపోయాను.

కవిరాజుగారు అన్నారు—"సరే, నీవిక పోవచ్చును. ఇంతవరకూ నీవు రోగగ్రస్తుడవు కానందుకు నాకు చాలా సంతోషంగా వుంది. కాని యీ వ్యాధి సంకుల నగరంలో—ఆడపిల్లలను స్కూళ్ళకు తీసుకెళ్లే బస్సులు మొదలుకొని, సినిమా పోస్టరువరకు—ఈ అపాయకరమైన రోగ కీటాణువులను వెదజల్లుతూవుంటే నీవు మాత్రం రోగగ్రస్తుడవు కాకుండా ఇంకెన్నాళ్లు

వుండగలవు ? జాగ్రత్తగా వున్నందువల్ల నష్టం వుండదు. ఈ రోగానికి విరుగుడు (antidote )గా 'మదన మర్దనవటి' 'కటాక్షారి అంజనం' ఇస్తున్నాను; తీసుకుపో. వారానికి ఒకమాటు చన్నీళ్ల అనుపానంతో మదనమర్దనవటి వేసుకో. ప్రతిరోజూ వుదయం ముఖం కడుక్కోగానే కనురెప్పలకు కటాక్షారి అంజనం రాసుకో. నేను యింకా ఎక్కువసేపు వుండటానికి వీల్లేదు. పైన రోగిణులు నాకోసం ఎదురు చూస్తూ వుంటారు."

నేను నమస్కారం చేశాను. త్రిలోచన కవిరాజుగారు పునఃమోహాముద్గరం వల్లిస్తూ పైకి పోయారు.

నేను బయటికి వచ్చి పెద్దపెద్ద అంగలేసుకుంటూ తిన్నగా గంగవొడ్డుకు వెళ్ళాను. పుడిసెడు గంగాజలం తీసుకొని కవిరాజుగారిచ్చిన మాత్ర ఒక్కటి గొంతులో వేసుకున్నాను. గొంతు దిగిందో లేదో స్త్రీలద్వారా (infection) ఉత్పన్నమయ్యే రోగాలన్నీ దూరమైయాయి! భార్యను మరచిపోయాను. ఈ జగత్తులో నేను ఏకాకిగా వున్నట్టు నాకు తోచసాగింది. నాకు ఎవ్వరూ లేరు !—ఎవ్వరూలేరు !! లేరు !!!

ఎదుట భాగీరథి కిలకిల నవ్వుతూ ప్రవహిస్తోంది.

---

# ఆల్ స్టార్ ట్రాజెడీ

"అయితే మీరు చెప్పేది పోలానెగ్రీ పతివ్రత కాదనేగా ?" అంటూ చటక్ అకస్మాత్తుగా యింట్లోకి వచ్చాడు.

ఒక్కసారిగా అందరు ఉలిక్కిపడ్డారు. సర్వేశ్వరఘోషు కళ్ళజోడు ముక్కుకొనవరకు జారివచ్చింది. ఒక్కక్షణం క్రిందట గోలచేసేవారంతా నోరుమూసుకు కూర్చున్నారు....

చటక్ తనప్రశ్నను రెట్టిస్తూ నడుముపైన చేతులు వేసుకొని మేకవలె నిలబడ్డాడు.

అసలు సంగతి యిది. చాలా రోజులనుండి గోడలమీద పెద్దపెద్ద పోస్టర్లూ, పత్రికలలో ప్రకటనలూ చూస్తూ విహ్వాలులయి, పేటలోవున్న ముసలివాళ్ళు నెత్తిన ముసుకు వేసుకొనీ, పడుచువాళ్ళు సిగరెట్లు తగలేసుకుంటూ, క్రిందటి రాత్రి మాడల్ సినిమాలో దిగంబర, అరదిగంబర యువతుల నాట్యం చూచివచ్చారు. ఇవాళ్ళ ఉదయం దానినే సర్వేశ్వరబాబు యింట్లో, విమర్శిస్తూ వున్నారు. విమర్శన క్రమంగా చిత్రపటంనుంచి బయటుదేరి అభినేత్రిణుల వయసూ, రూపం, వృత్తీ, ఆతర్వాత నడత వరకూ వచ్చింది. ఆఖరుకు నడతనే కేంద్రం చేసుకొని పరిక్రమంచేయ నారంభించింది. నిన్నరాత్రి అధికంగా చప్పట్లు కొట్టినవారే యివ్వాళ అభినేత్రిణుల నిర్లజతకు మండిపోతూ, వాళ్ల సతీత్వాన్ని సందేహిస్తున్నారు. దురదృష్టవశాత్తూ, చటక్ ఆ దోవనుపోతూ, సర్వేశ్వరబాబు యింట్లో గోల విని, నిలబడ్డాడు. ఒక్కనిమిషంవరకు విని, ఇక సహించలేక, లోపలకు జొరబడ్డాడు. తర్వాత సంగతి పాఠకులకు తెలుసును.

మీటింగ్ ఆగిపోవటానికి కారణంవుంది. స్వర్గీయ చక్రపాణి చాకీ సుపుత్రుడు, మిస్టర్ చటక్‌చాకీ. పేటలో అందరికంటే గొప్ప విద్వాంసుడు; అంటే బి. ఏ. ప్యాసయ్యాడు. అందరికంటె ధనవంతుడు; అంటే యీ పేటలో నూటికి డెబ్బైరెండు యిళ్లకు యజమాని.ప్రస్తుతం అ వివాహితుడు.

మంచనాట్యం అంటే థియేటర్, ఛాయానాట్యం అంటే సినిమా విషయంలో యీయనకున్న జ్ఞానం అపారం. తండ్రి ఆస్తి అంతా ట్రస్టీలకు వప్పజెప్పి పోయాడు, అందువల్లే యింతవరకు ఫిల్ముకంపెనీ పెట్టలేదు. లేకపోతే, యిప్పటికి ప్రతి పట్టణంలోనూ ఇతని ఫిల్ములంటే గోలపుట్టి పోయేవి. కంపెనీ పెట్టకపోతేనేం, ప్రతిరోజూ సినిమా చూస్తూ హాలీవుడ్‌లో వున్న ప్రతినటికీ ఉత్తరం వ్రాస్తూవుంటాడు. మూడో అంతస్తులో, అంటే, చదివే గదిలో పెద్ద పెద్దద్దాలు పెట్టేశాడు. వాటిలో చూస్తూ, 'వేలంటినో' 'నోవేరో'ల యాక్టింగు నేర్చుకొని, ఇంటి యజమానురాలు, అంటే ఇతని పినతల్లి కోడలు యెదుట పరీక్ష యిస్తూవుంటాడు. ఒకరోజున, ఒకే ఆటను వరుసగా మూడు సార్లు చూసి యింటికివచ్చి తలుపు వేసుకొని 'రూడోల్ఫ్' మాదిరిగా కళ్ళు త్రిప్పడం, అనుకరించ మొదలెట్టాడు. ఒకఘంట తంటాలు పడేవరకు కొంత ఫలితం కనపడింది. వెంటనే వంటయింటి వాకిటి దగ్గరకు వెళ్లి "వదినె!" అని కేకేశాడు.

వదినె చేతిలో తెడ్డుతో సహా వాకిట్లోకివచ్చి నిలబడింది.

"నేడు మహా పరీక్షాదినం—వదినే! ముఖ్యంగా నీకు. నేను నీవైపు చూస్తాను. నీ మనస్సులో కలిగిన భావాలు దాచకుండా చెప్పాలి, నాతో చెప్పతావా?" చటక్ అడిగాడు.

"అఁ. చెపుతాను" అన్నది వదినె.

"అయితే సరిగ్గా నిలబడు" అని పెదవులు బిగించి మదిరసిమిత నేత్రాలతో చూచి, "చెప్పు—గుండెలు ఏమైనా పీచుపీచు మన్నాయా, లేదా?" అని అడిగాడు.

వదిన పమిటచెంగు నోటికి అడ్డం పెట్టుకొంటూ "లేక, నవ్వొస్తోంది" అన్నది.

చటక్ మొహంమీద నిరాశతాండవమాడింది. ఆ రోజునుంచే అతనికి భారతీయ స్త్రీలమీద ఉండే శ్రద్ధ ఎగిరిపోయింది. పెళ్ళి చేసుకోకూడదని ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. ఒకవేళ చేసుకొన్నా భారతీయ స్త్రీని మాత్రం చేసుకోనని గట్టిగా ఒట్టు వేసుకొన్నాడు. కాని దీంట్లోకూడా చిన్నపేచీ

వుంది. స్వర్గీయ 'చక్రపాణి చాకీ' తనవిల్లులో, కొడుకు మ్లేచ్ఛస్త్రీని పెండ్లి చేసుకొన్నా, వాళ్ళ అన్నం తిన్నా, తన ఆస్తి కుమారుడికి చెందకూడదని ఒక షరతు పెట్టిపోయాడు. అందువల్లే చటక్ హాలీవుడ్‌లో వున్న అభినేత్రీణుల నందరిని మనసులో పెళ్ళి చేసుకొన్నాడు. తన మానస భార్యల ఫొటోలు, 'చక్రపాణి నివాసం'లో క్రింద వరండానుండి, మూడో అంతస్తుకు పోయే మెట్లవరకూ తగిలించాడు.

ఇతనికొక శిష్యుడున్నాడు. పేరు సోమేంద్రుడు. చటక్‌తో చాల రోజులు స్నేహంచేసి, చటక్ మాదిరిగా తన యిల్లుకూడా, హాలీవుడ్ చేశాడు. కాని ఒక రోజున యితన్ని నట్టేట్లో ముంచేశాడు! ముఖాన బాసికం కట్టుకొని హిందూస్త్రీని పెండ్లి చేసుకోడానికి కారులో పోతూ వుండటం చటక్ చూసి మండిపోయాడు. కాని ఏంచేస్తాడు? సోమేంద్రుడు పైత్రుక భవనంలోనే వుంటున్నాడు. అద్దె పెంచటానికికూడా వీలులేదు. తన కోపాన్ని స్నేహితుల దగ్గర వెళ్ళ బోసుకొని తృప్తిపడ్డాడు. అసలు సంగతి యిదే—అద్దె పెంచుతాడనే భయంతోనే సమాధానాలన్నీ దిగమింగి, ప్రశ్నకు ఎవ్వరూ జవాబు చెప్పలేదు. కేవలం ఒకాయనమాత్రం కొంచెం వూగులాడాడు, జవాబు చెప్పటానికి. ఆయన పేరు వ్యోమకేశబాబు. గత రెండు సంవత్సరాలనుంచి, ఏదో ఒక మంచిపిల్లకోసం వెదుకుతూ వున్నాడు. సంవత్సరానికి మూడువందల అరవైరోజులు పిల్లల యిళ్లలోనే పూరీ, మిఠాయీలు సద్వినియోగం చేస్తున్నాడు. నేటికి మూడుదినాలనుండి, సర్వేశ్వర బాబుకు అతిథి. ఇతర్లను చూసి యితనికి కూడా చటక్ అంటే మొదట కొంచెం ఆదరం కలిగింది. కాని అదెక్కువసేపు నిలవలేదు. చటక్ ప్రశ్నకు జవాబు ఎవ్వరు యివ్వలేక పోయేవరకు తానే యిచ్చాడు—చటక్ దర్పంచూచి, అతనికి కోపం వచ్చింది. వ్యోమకేశబాబు మాట పూర్తికాక ముందే చటక్ టక్కున జవాబిచ్చాడు. నిమిషాలలోనే ఉత్తర ప్రత్యుత్తరాలు ఆఖరి కందాయంలో ప్రవేశించినవి. సతిని గురించీ, సతీత్వాన్ని గురించీ గొప్ప తర్కయుద్ధం ప్రారంభమయింది. నూర్జహాన్ పతివ్రతా లేక కేథరిన్—ఈ సంగతి తేలకముందే ముందు గాజులతో అలంకృతమైన

గుండ్రనిచేయీ తరువాత నొక్కుల నొక్కులవెంట్రుకలూ అటుపిమ్మట చక్కని ముఖం, తలుపు సందులోనుంచి కనుపించినై. దానితోపాటు వినపడింది: "నాన్నా, నా పెట్టు—"

చటక్, తర్కమాపేసి, యువతివైపు చూచి, తల వంచుకొన్నాడు — చూపు యెవరిమాదిరిగా చూడాలో నిశ్చయించుకోలేక పోయాడు. వ్యోమకేశబాబు తర్కసూత్రాన్ని మర్చిపోయి, ముక్కు తుడుచుకో సాగాడు. సర్వేశ్వరబాబు కొంచెం విచలితుడై "ఆఁ, అలాగే! ఇక లేస్తున్నాములే." అని చటక్ వైపు చూచి అన్నాడు. "అమ్మాయి, బి. ఏ. పరీక్షలో కూర్చుంటున్నదికాదూ ?"

చటక్ గద్గదకంఠంతో "నాతప్పును క్షమిస్తారని నమ్ముతున్నాను" అని బరున్సకీటక్ వలె కరుణదృష్టితో యువతివైపు చూశాడు. కాని, అక్కడ ఎవరూ లేరు—తలుపు మూసివుంది.

* * *

సాయంత్రం సినిమాకు వెళ్తూ చటక్ అనవసరంగా సర్వేశ్వరబాబు మేడముందు నిలబడ్డాడు. తలుపు మూసి వుంది. మేడపైకి చూపులు పరుగెత్తించాడు. వరండాలో వొకమూలను వ్యోమకేశబాబు నిలబడి వున్నాడు. ఒక్కసారి మేడకువున్న కిటికీలు, దర్వాజాలు అన్నీ చూశాడు—మూసినవి తెరచినవి కూడా. వ్యోమకేశుని విషయమై యిదివరకే కనుగొన్నాడు. వెళ్లేటప్పుడు పెదవి కొరుక్కుంటూ "లోఫర్!" అని పోయాడు.

రాత్రి భోజనం చేసేటప్పుడు యితర సంగతులతో పాటు జారి వచ్చిండి- "ఇవ్వాళ్ల ఒక అమ్మాయిని చూశాను." అని.

వదినె ఎప్పటి మాదిరిగానే "ఎవరు ? మేడం ఫ్యారరా ?" అన్నది. రోజూ వింటూ వింటూ వదినెకు చాలా సినిమాస్టార్ల పేర్లు కంఠస్థమైనవి.

"కాదు. బెంగాలీ." అన్నాడు చటక్.

మరిదిలో మార్పు చూచి వదినె సంతోషించింది.

"చూట్టానికి బాగా అందంగా వుంటుంది కాదూ" అని అడిగింది.

"కళ్లలో నలుసల్లే మెరమెరలాడే టంత చక్కంది కాదు, కాని చూట్ట

నికి బాగానే వుంటుంది, సరే" అంటూ చేయి కదుక్కొని లేచాడు.

"ఘటకుల్ని పంపేదా?" వదినె వెంటనే అడిగింది.

చటక్, మెడరెండున్నర మూడంగుళాల వారగాపెట్టి "ఉఁహూఁ! ఇంకంత దూరంరాలేదు." అన్నాడు.

వదినె యికె ముందుకు పోలేదు; మరది హిందూస్త్రీల వైపుకు దృష్టి మళ్ళించాడని గ్రహించింది.

రెండవ రోజు కూడా చటక్ అనవసరంగానే సర్వేశ్వరబాబు యింటికి వెళ్ళి నిలబడ్డాడు. లోపల యెవరో పాడుతున్నారు. హార్మోనియం శబ్దం పాడేవాళ్ళ గొంతును అణచి వేసింది. అందువల్ల లోపల యెవరు పాడేది తెలియలేదు. పాట బాగా వుంది. నోరు తెరుచుకొని వినసాగాడు.

పాట పూర్తికాగానే "సర్వేశ్వరబాబున్నాడా" అంటూ చటక్ యింట్లో ప్రవేశించాడు. కార్పెట్ మీద హార్మోనియం కెదురుగా వ్యోమకేశ బాబు కూర్చొని వున్నాడు. ప్రక్కనే వేడి వేడి వంకాయ బజ్జీ, ఒక టీ కప్పూ పెట్టివున్నాయి. చటక్ శత్రుపురిలో ప్రవేశించినట్లుగా భావించాడు. అలవాటు ప్రకారం జేబులో చెయ్యి పెట్టాడు. పిస్తోలుకు బదులు బ్లూపెన్సిలు చిక్కింది. దాన్ని గుప్పెట్లో పట్టుకొని, వ్యోమకేశబాబు వంకకొర కొర చూస్తూ "ఇంకా మీరు ఇక్కడే వున్నారా ?" అన్నాడు.

వ్యోమకేశబాబు తత్తరబిత్తర లాడుతూ వెనక్కుపోవడం, టీకప్పు దొర్లటం, బహుశా యింట్లో వినపడొచ్చు. నిన్నటి మాదిరిగానే తలుపు తెరచుకొని నిన్నటావిడే ప్రవేశించింది. చటక్ ఒకకన్ను కొద్దిగా మూసు కొని రెండోకన్ను బాగావిప్పుకొని చూశాడు.

"నాన్నగారు ఇంట్లోలేరు." అన్నది ఆమె.

చటక్ చేతిలో పెన్సిలు వణకింది. చాలా మృదువుగా "అయితే కూర్చో మంటారా ?" అని అడిగాడు.

"నాకు యజ్ఞామిసేషన్ వుంది." అన్నది ఆమె.

చటక్ కళ్లు నిప్పులు కక్కాయి. మనసులో గొణుక్కున్నాడు "వ్యోమ

రెండో రోజు వుదయమే వ్యోమకేశుడు అమలతో "నేను వెళ్లాల్సి వచ్చేట్టుంది" అన్నాడు. అమల "సరే, నాన్నగారితో చెప్పి వెళ్లండి" అన్నది.

సర్వేశ్వరబాబుతో యిదివరకే చెప్పాడు. పిల్లకూడా తనకు నచ్చిం దన్నాడు. సర్వేశ్వరబాబు సంతోషించి పిల్ల అనుమతి కోరడానికి అనుమ తించాడుకూడా.

వ్యోమకేశబాబు "నేను వెళ్లేవాణ్ణి కాదు కాని—" అన్నాడు.

అమల యింగ్లీషు హేమ్‌లెట్ తిప్పి పెడుతూ "కానీ ఏంటి?" అని అడిగింది.

"చటక్ బాబుకు నే నుండటం ఇష్టం లేదు" అని దీర్ఘ శ్వాస వొకటి విడిచాడు.

"చటక్‌తో మీకేమి సంబంధం? ఈయింటి యజమాని అత నేనా?" అని అమల అడిగింది.

"కాకపోయినా మీ మిత్రుడేగా!"

అమలకు కోపం వచ్చింది—"మాకు మిత్రుడూ గిత్రుడూ ఏమీ కాడు ఉండండి మీరు; నేను చూస్తాను" అన్నది.

వ్యోమకేశబాబు సంతోషం పట్టలేక వుబ్బిపోయి హాల్లో వున్న తలుపులు, కిటికీలు, అన్నీ బిగించేశాడు.

అరఘంట అయాక తలుపు దగ్గర చటక్ గొంతు మాదిరిగా వినిపించింది. "సర్వేశ్వర బాబున్నాడా?"

వ్యోమకేశబాబు తలుపు గడియ వంక చూస్తూ జవాబిచ్చాడు—"లేరు, అమల యగ్జామినేషన్—"

బయట కోపంతో గర్జించినట్టు అస్ఫుటంగా వినపడింది. తర్వాత ప్రశ్న- తమరు ఇవ్వాళకూడా వున్నారా?"

వ్యోమకేశబాబు వెనుక వాకిలివంక చూశాడు. అమల తలుపు కానుకొని చదువుతూ వుంది. కొంచెం దర్పంగా—"ఆఁ. వున్నాను" అని జవా బిచ్చాడు.

"బయటకు వస్తారా?"

"రాను" అని హార్మోనియంతీసి పాట ఎత్తుకున్నాడు—"మలయ పవను—"

తర్వాత హార్మోనియం ఆపేసి తలుపు దగ్గరగా చెవిపెట్టేడు, కాని బయట ఏ శబ్దమూ వినిపించలేదు.

అబ్బాయి యిష్టపడ్డాడు. ఇక అంతా అమ్మాయి యిష్టంమీదే ఆధార పడి వుంది. వ్యోమకేశబాబు అమ్మాయి వంక చూశాడు. కాని, ఆమె ముఖంలో ప్రణయ భావంగానీ, లజ్జాభావంగానీ, ఏమీ కనిపించలేదు.

* * *

మొగల్ థియేటర్‌లో ఆవాళ 'హేమ్‌లెట్' టాకీ. సర్వేశ్వరబాబుకు ఏదో పని వుండటంచేత అమల వెంట వెళ్ళలేకపోయాడు. వ్యోమకేశబాబు అమల షేక్స్‌పియర్ నోటుబుక్కు చంకబెట్టుకొని, అమలతో ట్రాం ఎక్కాడు.

ఇంటర్వల్లో అకస్మాత్తుగా వ్యోమకేశబాబు భుజంమీద ఎవరో చేయి వేశారు. వ్యోమకేశబాబు గాభరాపడి వెనక్కు చూశాడు. చటక్! చటక్ అన్నాడు— "బయటకు రండి" అమల నోటుబుక్కు చంకలో గట్టిగా అదుముకొంటూ—"ఇక్కడే చెప్పండి." అన్నాడు వ్యోమకేశబాబు.

"ఇక్కడ చెప్పేమాట కాదు." అంటూ వ్యోమకేశబాబు చెయ్యిపట్టు కొని లాగాడు.

"బయటికి వెళ్ళరాదూ?" అంది విమల.

ఏంచేస్తాడు! బయటికివెళ్ళి నిలబడ్డాడు—"యింకా కొంచెం ముందుకు, ఆ లెదర్ గోడౌన్సు వెనకకు." అన్నాడు చటక్ మంత్ర ముగ్ధునివలె వ్యోమకేశబాబు చటక్‌ను అనుసరించాడు. చటక్ ఎడమ చేతిలోవున్న ఆక్స్‌ఫర్డ్ యెడిషన్ షేక్స్‌పియర్ కుడిచేతిలోకి తీసుకొంటూ "విను, వ్యోమకేశ్! ఈ ప్రపంచంలో అమలను ప్రేమించేవా రిద్దరుండటానికి వీలు లేదు. నీవన్నా వుండాలి; నేనన్నా ఉండాలి. ఈ చీకటిరాత్రిలో ఈనిశ్శబ్ద

మైన గళ్ళీలో—పహారావాడు కూడాలేడు. నీతో డ్యూయల్ ఫైట్ (ద్వంద్వయుద్ధం) చేస్తాను. గెలిచినవారిది అమల!" అన్నాడు.

వ్యోమకేశుడు కంపిస్తూ "నేను చేయలేను." అన్నాడు.

"చేయాలి నీవు, కవర్డ్! గళ్లీ కటువైపు నిలబడు. నీ చేతిలో నోటు బుక్కుంది; నా చేతిలో షేక్స్పియర్; ఇవే పిస్తోళ్లు వదలేసెయ్ గుండు! ఒన్, టూ, త్రీ!"

బంయ్ మంటూ రెండు వైపులనుంచీ పుస్తకాలు వచ్చేస్తున్నాయి. కాని లక్ష్యముదాకా చేరకముందే, సైకిలు ముందు చక్రానికి వచ్చి కొట్టుకున్నాయి. సైకిల్ వాలా దిగాడు. వ్యోమకేశుడు ఉత్తరపువైపు పరుగెత్తాడు. చటక్ దక్షిణవైపుకు క్లయివ్ బ్రూక్స్ మాదిరి పెద్దపెద్ద అంగలు వేసికొంటూ, జారుకొన్నాడు. సైకిల్ వ్యక్తి అటు యిటూ చూశాడు. ఎక్కడా పోలీసులు లేరు.

పుస్తకాలు రెండూ భుక్తం చేసుకున్నాడు.

వాస్తవంగా యిది కథగాదు, నవల. కాబట్టి పాఠక, పాఠికలు సహజంగానే అడగవచ్చు—అమల గతి ఏమైందని?

ఏమీ కాలేదు. అమల యింటికివచ్చి టీ తయారుచేసి త్రాగింది. తర్వాత "వ్యోమకేశబాబు ఎక్కడున్నాడు?" అని అడిగింది. కాని ఎవ్వరూ జవాబు చెప్పలేదు.

రెండవరోజున చూచింది—వ్యోమకేశబాబుకై వుంచిన పూరీ కూరా అలాగే వ్యూత పెట్టివున్నది. వ్యోమకేశుని జాడలేదు. "నా నోటుబుక్కు" అని అమల తండ్రిని అడిగింది,

"నేను చూడలేదు. వ్యోమకేశబాబు యిచ్చి పోలేదా?" సర్వేశ్వరుడన్నాడు.

"నా యగ్జామినేషన్—చటక్ బాబు యింటికి వెళ్లు నాన్నా, వ్యోమకేశబాబు అక్కడ వుంటాడేమో!" అన్నది అమల.

సర్వేశ్వరబాబు వెళ్ళాడు. చటక్ మంచముమీద పడివున్నాడు. గళ్ళీలోనుంచి పారిపోయేటప్పుడు కిల్లీ కొట్టువాడు దొంగ అనుకొని వెంట

పడితే డగ్లస్ ఫైర్ బ్యాంక్సు స్టయిల్లో ఎగిరి రిక్షా ఎక్కబోయి చార్లీ చాప్లిన్ స్టయిల్ లో వెనక్కి పడ్డాడు. పెద్దదెబ్బ తగిలింది. ఈ సంగతి సర్వేశ్వర బాబుకు తెలియలేదు. వ్యోమకేశబాబు కానీ, నోటుబుక్కు గానీ లేదని మాత్రం తెలుసుకొన్నాడు.

ప్రయల పాపం ఏడ్పు మొఖం పెట్టింది. వ్యోమకేశబాబు కోసం కాదు, నోటుబుక్కు కోసం. రేపే ఆమె టెస్టు.

ఇంతలో బయట యెవరో తలుపుకొట్టారు. సర్వేశ్వరబాబు వెళ్ళి తలుపు తెరిచాడు. ఒక యువకుడు హాలులో ప్రవేశించి అడిగాడు. "మిస్ అమలాఘోష్ యిక్కడ—"

అమల లేచి నిలబడుతూ "నేనే" అన్నది.

"ఇదిగో మీ నోటుబుక్కు. నిన్న రోడ్డుమీద దొరికింది అన్నాడు యువకుడు.

అమల ముసిముసి నవ్వు నవ్వుతూ "మీరు నన్ను రక్షించారు. పుస్తకం కోసం వెదకి వెదకి ఏడ్పు వచ్చింది. మీకు ఎక్కడ దొరికింది" అన్నది.

ఆగంతకుడు వీరేశదాసు నవ్వుతూ "ఆసంగతి అడుగబోకండి. మీ నోటుబుక్కుతోపాటు యిదికూడ తీసికోండి. నానోట్సు. స్టీఫెన్ దొర గారు చెప్పింది, ఉపయోగించవచ్చు" అన్నాడు.

అమల "థాంక్సు! టీ పుచ్చుకోండి" టీ అయింది.

ప్రొఫెసర్ వీరేశదాసు ఆరోజు క్లాసుకు ఫస్టు పీరియడు అటెండు కాలేక పోయాడు.

చటక్ తిరిగి ఆరోగ్యం పొందాడు.

మళ్ళీ ఒకరోజున అవసరంగానే సర్వేశ్వరబాబు యింటి కిటికీ వద్దకు వచ్చి నిలబడ్డాడు. లోపలకుచూచి ఆంటోనియో మాగ్నో మాదిరిగా కను బొమ్మలు చిట్లించుకొన్నాడు. ప్రొఫెసర్ వీరేశదాసుకు చాలా దగ్గరగా కూర్చొని, అమల షేక్స్పియర్ చదువుతూ ఉన్నది. ధిక్!

చటక్ యింటికి తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో వ్యోమకేశబాబు కారపు శనగలు తింటూ పోవడం చూశాడు. చటక్ వాడియెదుటకు పోయి డగ్లస్

ఫైర్ బ్యాంక్సు స్టయిలులో నిలబడి "ఇప్పుడు?" అన్నాడు.

గొంతులో శెనగలపొడి అడ్డపడింది; కొంచం దగ్గి గొంతు సవరించుకొని వ్యోమకేశబాబు "అమల యింటికి మళ్ళీ నేనెప్పుడెళ్ళేనూ?" అన్నాడు.

చటక్ ఆమాట వినకుండానే మళ్ళీ రెట్టించాడు—"ఇప్పుడు?"

"గ్రేస్ట్రీటుకు పోతున్నా—అక్కడ ఒక అమ్మాయి వుంది". అంటూ వ్యోమకేశబాబు ఆగివున్న ట్రాం ఎగిరి ఎక్కాడు.

చటక్ కదలిపోయే ట్రాం వంకచూచి రోనాల్డు కోల్మను మాదిరి వ్యంగంగా నవ్వుతూ అన్నాడు—"కవర్డ్ !"

---

# నారీద్వేషి

ఇంతకుపూర్వం, చటక్ శిష్యుని ప్రసంగం కొంత వచ్చింది. అతన్నిగురి సవిస్తారంగా వ్రాయుటం అవసరం. అయినా అతి సంక్షేపంగానూ, అవలీల గానూ వ్రాస్తున్నాను. ఇది కథ కావచ్చును, నవల కావచ్చును. ఇతిహాసం అయినప్పటికి ఆశ్చర్యంలేదు.

సోమేశ్ సమద్దార్ హ్రస్వనామధేయం సోమూ.. యూనివర్సిటీలో ఫిఫ్త్ యియర్ స్టూడెంటు (మొదటి సంవత్సరం ఎం. ఏ). జీవనాంక సంఘా నికి ప్రెసిడెంటుకూడాను. ఈసంఘాన్ని సృష్టించినవారు సోమూ, చటక్ లు. చటక్ దీనికి పాట్రన్ (patron). కొద్ది ధన సహాయంకూడా చేశాడు.

ఈ సంఘముయొక్క క్రీడ్ (creed) ఏమంటే 'జీవిత మొక మహా నాటకం; ప్రతి ఒక్క రోజూ దానిలోని ఒకొక్క కొత్త దృశ్యం. ఆహారంలో, విహారంలో, ప్రతిహారంలో, వ్యతీహారంలో—అన్నిటిలో ఈ నాటకపు అనుభూతిని పొందటమే మానవజీవితానికి చరమలక్ష్యం.'

కాని హఠాత్తుగా సోమూ యీ సంఘ నియమానికి విరుద్ధమైన కార్యం ఒకటి చేశాడు. ఫలితం, జీవనాంక సంఘానికి జీవనాంత మయింది. చటక్, సోమూలకు స్నేహవిచ్ఛేద మయింది. భవిష్యత్తులో సోమూ ఈదుష్కార్యానికి ఫలం ఏమనుభవిస్తాడో ఎవరు చెప్పగలరు? జరగబోయేదేమిటో జరిగి

తీరుతుంది. దాన్ని గురించి తల పగలగొట్టుకోవటం వ్యర్థం. కాన ఇక్కడ జరిగింది మాత్రమే వ్రాస్తున్నాను.

సోమూ చటుక్కున భావదాస్యుడు. థర్డ్ క్లాసులో ఇద్దరూ కలిసినప్పటి నుంచీ వదలకుండా సినిమాలూ, థియేటర్లూ చూస్తూవస్తున్నారు. వివాహం చేసుకోమని ప్రతిజ్ఞకూడా చేసుకున్నారు. హాలీవుడ్ అందగత్తె వచ్చి తమ్ము చేపట్టమని ప్రార్థించినా చేసుకోరు!

సోమూ నాయనమ్మ, వదినా యిద్దరూ తిరుపతి వెంకన్నకు ముడుపులు కూడా కట్టారు. ఏం లాభం? సోమూమతి మాత్రం మారలేదు. అయినా ఒకసారి వదినా నాయనమ్మలు సోమూను బలవంతపెట్టి ఒక పిల్లను చూడటానికి పంపారు. దానికి ఫలితంకూడా వికటంగానే పరిణమించింది.

అది ఈ విధంగా జరిగింది.

శివరాత్రి నాటిరాత్రి అనార్కలీ నాటకం చూసి సోమూ ప్రొద్దుపోయి యింటికి తిరిగి వచ్చాడు. వరండాలో దాసీది పండుకొని ఉంది. దాని పేరు కూడా అనార్కలీ—అనార్ అనే పిలుస్తూ ఉంటారు.

నిద్రపోయే అనార్‌ను చూడగానే సోమూలో జహంగీర్ ప్రవేశించాడు. రెయిలింగ్ ఆనుకుని, కుడిచేయి పైకెత్తి, "ఈమె ఆ అనార్కలీయేనా? బాల్యకాలమున ఎవరికైతే—అనార్కలీ—అ—" అని అభినయ సహితంగా చెప్పసాగాడు.

అనార్ హఠాత్తుగా మేలుకొని చీత్కారంచేసింది. నాయనమ్మ జపమాల వదలి పరుగిడి వచ్చింది. వదినె లబలబ లాడుతూవచ్చి సోమూనెత్తిన కడివెడు చన్నీళ్ళు కుమ్మరించింది.

మరుదినం వదిన నాయనమ్మ లిద్దరూ కూడ బలుక్కొని ఉపవాసం చేయసాగారు. సోమూ విధిలేక పాల్వాడాలో ఉండే విశ్వాసరావు యింటికి వెళ్లి కుమార్తెను చూడబోయాడు. ఇదివరలో చాటుగా వెళ్ళి విషయమై ప్రస్తావన జరుగుతోనే ఉంది. ఎక్కువ ఆలస్యం చెయ్యకుండానే పిల్ల సింగారించుకొని ఎదుటికి వచ్చింది. సోమూ ఆ అమ్మాయి ఎడమచెయ్యి గట్టిగా పట్టుకొని 'కచదేవయాని' లోని కచునిమాదిరిగా చదివాడు.

"పతికి యోగ్యుడను గాను కుమారీ,
బ్రహ్మచర్య వ్రతధారిని నేను—"

పిల్ల గడగడా వణకసాగింది. భయంతో నయిందీ తెలీదు—సిగ్గుతో నయిందీ తెలీదు. ఆపిల్ల అన్న అవినాశుడు, "ఆఁ! ఆఁ!" అంటూ పరుగెత్తు కొచ్చాడు. కాని ఫస్టుక్లాసులో ఫస్టున పాసయిన స్టోమేక్ సమద్దార్ వంటి మీద చెయ్యి వెయ్యటానికి సెకండు యియర్ తప్పిన కుర్రవాడికి సాహసం చాలకపోయింది. సోమూ బంతిలా లేచి ట్రామెక్కి ఇంటికిచేరాడు.

ఇక తన వివాహ విషయమై ఆలాప విలాపా లేమైనా జరిగాయంటే కాలువ ఒడ్డున ఉన్న నిష్క్రియానంద మఠంలోకి వెళ్ళి సన్యాసం పుచ్చు కొంటానన్,—పిల్ల నచ్చిందో లేదో తెలుసుకోవాలని వచ్చిన వదినె నాయ నమ్మలను సోమూ భయపెట్టాడు.

ముఖ్యే రెండు పళ్లలో మిగిలిఉన్న ముందు రెండు పళ్లతో నాలుక కొరుక్కొని నాయనమ్మ అన్నది.—"శివ, శివ! అలా అనగూడదు నాయనా!"

సోమూ తన చదివేగది తలుపు తాళ్ళన వేసుక్కొని అన్నాడు—"అంటాను! లక్షసార్లు అంటాను! ఆకాశంలో చంద్రతారలు సాక్షి! స్వర్గంలో మందా కిని సాక్షి!" తరవాత ఇక వినపళ్లేదు. కిటికీ తలుపులుకూడా బిగించు కున్నాడు.

వంటయింట్లో కూర్చుని 'దుర్గేశనందని' చదువుకుంటున్న వదినె పుస్త కంలో మొహం పెట్టి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఇక వివాహప్రసంగం ఎవ్వరూ ఎత్తలేదు.

ఇది భూమిక.



ఇక కథారంభం.

ఆషాఢస్య ప్రథమదివసే – నవమేఘభారంతో ఆచ్ఛన్నమైవున్న నీలాకాశం ఒక తరుణి సర్వాంగాలూ చుట్టుకొన్న నీలిరంగు చీరె చెరగువలె వుంది. మెరుపులు కూడా మెరుస్తున్నాయి—ఆ చెరగున కుట్టిన బుటేదారీ పనివలె. ఆకాశంలో మేఘ గర్జన, క్రింద ట్రాం గరగర, ప్రతి గల్లీమూలనూ కారప్పు శనగలు అమ్మేవాళ్ళ విరామంలేని కేకలు.

సోమూ ఒక పొట్లం కారప్పుశనగలు కొని బస్సు యెక్కాడు. పది గంటల బస్సు కావటంవల్ల ప్రయాణీకులు నిండుగా ఉన్నారు. వెనుక సీటులో ఒక మూల కాస్తచోటుంది. సోమూ పుస్తకాలు ప్రక్కన పెట్టుకొని కూర్చున్నాడు.

బస్సు పోతూ పోతూ ఆగింది. చేతులో పుస్తకాల్లూ, నోటుబుక్కులూ పట్టుకుని ఒక అష్టాదశి వచ్చి ఎక్కింది. బస్సులో ఉన్నవాళ్ళంతా ఒక్కమాటు మెడ చాచి చూచారు. అందులో సోమూ ఒక్కడు మాత్రమే నిర్వికారభావంతో చూచాడు.

బస్సు కదిలింది. యువతి ఒక్కసారి బస్సంతా చూచి సోమూ వద్దకు వచ్చి నిలబడి లోలుపదృష్టితో సోమూ ప్రక్కన వున్న పుస్తకాలవంక చూడసాగింది. పుస్తకాలు తీస్తే ఆమె కూర్చోటానికి చోటు దొరుకుతుంది. కాని అంత దగ్గరగానా! సోమూ సర్వాంగాలూ సూదులతో పొడిచినట్లయింది. ఏవగింపుతో అతను పుస్తకాలు తీసుకొని లేచి నిలబడ్డాడు.

యువతి అవలీలగా కూర్చుని—"థాంక్స్! ఎక్కడకు పోతున్నారు?" అని అడిగింది. సోమూ చేతులోని పుస్తకాలను నిర్దయగా నలుపుతూ "ఏట్లోకి!" అన్నాడు.

"అవి దర్భంగా బిల్డింగ్స్ కావుగదా?" అన్నది యువతి.

సోమూ అదేవిధంగా నిర్వికార భావంతో—"ఆఁ!" అన్నాడు.

"పదండి నేనూ కూడా వస్తాను—"థాంక్స్!"

ఇద్దరూ ఒక క్లాసులోనే చదువుతున్నారు. ఒకరి మొహం ఒకరు ఇదివరకే ఎరుగుదురు. సంభాషణకు మాత్రం ఇదే మొదలు.

కమలకూడా ఫస్టుక్లాసులోనే పాసయింది, సోమూకు రెండు మెట్లు దిగువగా. అతనితో మాట్లాడాలని చాలారోజులనుంచీ ఆమెకోరిక— చదువులో సహాయంగా ఉంటాడని. కాని సోమూ స్వభావం సంగతి విన్నాక దగ్గరకు పోవటానికే భయపడ్డది. దైవయోగంవల్ల ఇవాళ పరిచయం అయినందుకు చాలా సంతోషించింది. అతని స్వభావాన్ని కూడా బాగా గుర్తించింది.

బస్సు దిగి టకటకా సోమూ మూడో అంతస్తుకు ఎక్కేవరకు వాకిట్లోనే కమల ప్రత్యక్షమయింది. ఆమె లిఫ్టు ద్వారా యెక్కింది. సోమూను చూడగానే కారప్పుశెనగలపొట్లం అందిస్తూ "తీసుకోండి. బస్సులో వదలెట్టి వచ్చారు." అన్నది.

ఇలా అసంగతంగా స్నేహితం చేసుకోబోవటం చూచి సోమూకు వొళ్ళు మండింది. "అక్కర్లేదు. టిఫిన్ తీసుకోండి" అన్నాడు.

"థాంక్స్!" అన్నది కమల.

అయిదు నిమిషాలు గడిచాక.

సోమూ తదేకధ్యానంతో ఏదో రాసుకుంటున్నాడు. కమల వెనగ్గావచ్చి "వెన్సలు కాస్త యిప్పిస్తారా?" అని అడిగింది.

సోమూ తలతిప్పి చూచాడు. లోలోపల పళ్ళు నూరుతూ, జేబులోనుంచి కానీ బయటకు తీసి డస్కుమీదపెట్టి—"తీసుకుపోయి కొనుక్కోండి" అన్నాడు.

కమల కానీ తీసుకొని — "థాంక్స్!" అన్నాడు.

తరువాత, నాలుగు గంటలకు.

సోమూ లైబ్రరీలో కూర్చుని 'ఎపాలోజియా (Apologia) నూతన సంస్కరణంమీద నోట్సు రాసుకుంటున్నాడు. కమల వచ్చి తెరచిఉన్న పుస్తకంమీద కానీ వేస్తూ అంది—"మీ కారప్పు శెనగలకానీ—"

పుస్తకంమీద ఒక గుద్దు గుద్ది పెదవి కొరుకుతూ సోమూ అనబోయాడు. "డా—" ఇంతలో ఎదుట ప్రొఫెసరు గోపాలబాబును చూచి "—ంక్స్!" అని పూర్తి చేశాడు.

కమల వెనుకనుంచి మృదుస్వరంతో "థాంక్స్" అని ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వెళ్లిపోయింది.

సోమూ ముందున్న ఇంగ్లీషు పుస్తకంలోని అక్షరాలు పార్సీ అక్షరాల మాదిరిగా అలుక్కుపోయినై. ఇక ఆ రోజుకు నోట్సు వ్రాయటం పడలేదు.

సాయంకాలం నాయనమ్మతో పాటు వదినె మిద్దెమీది వచ్చేటప్పటికి సోమూ కారాబద్ధ జగత్సింహునివలె అటూ యిటూ పచారుచేస్తూ గొణుక్కుంటున్నాడు — కమలా, చపలా, తబలా — హూఁ, హూఁ—"

ఈ అస్థిరతకు కారణం ప్రాస కుదరక పోవటం అని లేఖకుడు ఊహిస్తున్నాడు. మనమడి మనస్సు కమలా ఫలాల మీదికి పోయిందని నాయనమ్మ అనుకుంది. కమల అనేది ఒక పిల్ల పేరు కావచ్చుని వదినె అంచనా వేసుకుంది. వదినె, నాయనమ్మలు చప్పుడు చెయ్యకుండా వచ్చినవారు వచ్చినట్టుగానే వెళ్ళిపోయారు. నేను మాత్రం లేఖకుణ్ణి కావటంవల్ల కథ పూర్తి చెయ్యటం కోసం అదృశ్య రూపంతో సోమూతోపాటు ఉండిపోయాను.

ఒక గంట కష్టపడి 'లా' చివర గల చెడు శబ్దాలన్నీ కూర్చి ఒక కవిత్వం తయారుచేసి పగతీర్చుకున్న సంతోషంతో వాలు కుర్చీమీద జారగిలబడి నిట్టూర్చాడు.

ము ర్చా డు.

ప్రొఫెసర్లు రావటాని కింకా వ్యవధానం ఉంది. సోమూ కోపంతో కమలా, ఆమె సహాధ్యాయినులూ కూర్చునే బెంచీవేపు అప్రయత్నంగా చూస్తున్నాడు. ఇంతలో వెనుకనుంచి ప్రశ్న వినపడింది—"ఇవాళ టెంపర్ ఎలా ఉంది సమద్దార్ జీ ?"

సోమూ తిరిగి చూచాడు—కమల ! క్లాసు నిండా పిల్లలు. వచ్చిన కోపాన్నంతా దిగమింగి నిన్నసాయంత్రం రచించిన కవిత్వం అందిస్తూ — "ఇది తమదే, తీసుకు పోండి" అన్నాడు.

కమల కాగితం తీసుకొని "థాంక్స్!" అంటూ వెళ్లిపోయింది.

సోమూ లోలోపల గుర్రు పెట్టాడు.

కమల చేసిన పరిహాసానికి చక్కని జవాబు ఇచ్చానన్న ఆనందంలో సాయంత్రం సినిమా చూచి సోమూ ఇంటికి వచ్చేటప్పటికి వదినె పెద్దకవరు ఒకటి యిచ్చింది. సోమూ మూడో అంతస్తుకు వెళ్లి విప్పి చూచాడు. అందులో యిలా వ్రాసి ఉంది:

'థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్. నాకు చిత్రం గీయటం తెలుసు కాని కవిత్వం వ్రాయటం చేత కాదు. అందువల్ల నే—

ఇట్లు,

క మ ల'

దళసరిగా వున్న చదరపు ఆర్టుపేపరుమీద యీ నాలుగు పంక్తులూ వ్రాసి ఉంది. కాగితం తిప్పిచూచేవరకు అచ్చంగా సోమూ మాదిరి చిత్రం ఒకటి గీసి ఉంది. కారపు శనగల పొట్లం ఒకటి మాత్రం అధికంగా నెత్తి మీద ఉంది క్రింద "కారపుశనగల సమద్దార్!" అని పేరు.

ఎగ్గూ సిగ్గూ లేనిపిల్ల! చేతికందితే జుట్టు పట్టుకొని వీపుమీద నాలుగు వేసేవాడు! సోమూ పిడికిలి బిగపట్టి చేతులు విసర సాగాడు.

ఉత్తరం ఎక్కణ్ణించి వచ్చిందో కనుక్కోవాలని వచ్చిన వదినె కిటికీ గుండా ఇదంతా చూచి "అదేమిటి, మరిదీ! ఎవరినీ కొడుతున్నావు?" అని అడిగింది.

ఎత్తిన చేతిని కోటుజేబులో పెట్టుకుంటూ సోమూ "శోధించబోకు! ఎక్సర్‌సైజ్ చేసుకుంటున్నా" అని జవాబిచ్చాడు.

వదినె మళ్ళీ "డంబెల్స్ ఏవీ?" అన్నది.

జేబులో పెట్టిన చెయ్యి తీసి పిడికిలి విప్పుతూ సోమూ "ఇక డంబెల్సు అక్కర్లా. ముద్గరాలు కావాలి!" అన్నాడు.

సోమూ కళ్లు చూసేవరకు వదినెకు భయం వేసి తత్తరబిత్తర లాడుతూ దిగిపోయింది. సోమూ మళ్ళీ చిత్రంవంక చూచాడు. ఈ చిత్రముందు అతనికవిత్వం ఏధూపానికీరాదు. ముల్లుతీసి కొర్రుపెట్టుకొన్నట్టయింది.

ఇంతలో నాయనమ్మ వచ్చి "త్రిఫల కషాయం లాభంలేదు — వట్టివేళ్ల కషాయం కావాలి" అన్నాడు.

త్రిఫలకషాయానికి బదులు షట్ఫలకషాయం ఇవ్వవచ్చునేమో కనుక్కు రమ్మని నాయనమ్మ దాసీదాన్ని వైద్యునియింటికి పంపింది.

త్రిఫలకషాయం త్రాగినా ఆరాత్రి సోమూకు నిద్రపట్టలేదు. రాత్రంతా మేలుకొని కమల చేసిన యీ పరాభవానికి ప్రతిక్రియ యేమిటా అని ఆలోచించాడు. ఇక కవిత్వంతో కుదరదు. కమలఫొటో కనక ఒకటి దొరికితే గొప్ప చిత్రకారునివద్దకు వెళ్ళి వ్యంగ్యచిత్రం (cartoon) ఒకటి గీయించవచ్చు. ఇది బాగానే ఉంది. దొరికే దెలా? ఆమె నడిగితే గుట్టంతా బయటుబడుతుంది! అయితే—

ఉపాయం తట్టకపూర్వమే తెల్లవారింది. కాస్సేపు అట్లాంటా, కాస్సేపు కమలా, కాస్సేపు మిల్టన్—యీ విచిత్రవిషయాల తాకిడికు అతని మనస్సు అవసన్నమై పోసాగింది. ఇంతలో పదిగంటలయింది. సోమూ పుస్తకాలు చాతబట్టి ట్రాం ఎక్కాడు. ట్రాం కొంచెం దూరం పోయిందో లేదో కమల ఒక సహాధ్యాయినితో వచ్చి ఎక్కింది. సోమూ పుస్తకాలు చేత పట్టుకొని దిగటానికి ఉపక్రమించాడు.

కమల—"ఎక్కడకు వెళుతున్నారు?" అని అడిగింది.

"కారపుకనగలు కొనుక్కోటానికి."

కమల ముసిముసినవ్వు నవ్వుతూ—"నాకూ డా తెచ్చిపెట్టండి—థాంక్స్!" అన్నది వెంటఉన్న సఖి కిలకిల నవ్వింది. సోమూ గుడ్లురుముతూ దిగిపోయాడు.

ఒక గంట అయాక కమల డెస్కుమీదికి ఒక పొట్లం వచ్చింది. విప్పి చూస్తే కారపుకనగలకు బదులు అరటిపండు తొక్క లున్నవి. కమల నవ్వుకుంది.

కమలకు కోపం రాకపోవటం తను కూర్చున్న చోటినుంచి సోమూ చూస్తూనే వున్నాడు. తను ప్రయోగించిన అస్త్రం యిలా పారకపోవటం చూచి మోహం మాడ్చుకున్నాడు.

బడికరిలాక గోల్డీఘీవద్ద నిలబడి సోమూ బస్సుకోసం నిరీక్షిస్తున్నాడు.

కమల సహపాఠినులతో సహా వెనుక నిలబడి నోటిమీద జేబురుమాలు పెట్టుకొని నవ్వుతో వుండటం అతను చూడలేదు. బస్సు ఎక్కిన తరువాత కమలను చూచాడు.

"తమకు ప్రియతమమైన వస్తువు నాకు పంపారు—అందుకు థాంక్స్!" అన్నది. కమల కౌతుకంగా.

సోమూ ముఖం త్రిప్పుకున్నాడు. ఆ పిల్లను పళ్ళతో పీకి, గోళ్ళతో రక్కి——ముక్కలు ముక్కలు చెయ్యాలన్నంత కోపం వచ్చింది.

మరుదినం సోమూ కాలేజీ టైముకు ఒక గంట ముందుగా బయలుదేరి బడి వదలక పూర్వమే యింటికి తిరిగి వచ్చాడు కాలేజీలో తనకు తెలియకుండానే కమలవంక గంభీరంగా చూచాడు. కమల కూడా అతని వంక కౌతుకంగానూ, వెటకారంగ నూ చూచింది!

ఈవిధంగా దాదాపు పదిహేను దినాలు గడిచినై.

ఈమధ్య వీరిద్దరికీ ఏవిధమైన సంభాషణా జరగక పోయినప్పటికీ పగ తీర్చుకోవాలన్నే సంకల్ప సోమూ బుర్రలో గూడు కట్టుకుంది. ఒక తుచ్ఛ స్త్రీ తనను పరాజితుని చేసి తన కళ్ళముందు యిలా స్వేచ్ఛగా తిరుగుతూ ఉండటం సోమూ సహించలేక పోయాడు! వదినెకు యీ సంగతంతా చెబితే దీనికి ప్రతిక్రియ చెయ్యటానికి ఏదైనా సదుపాయం చేసేదే. కాని ఒక స్త్రీని అణచటానికి ఇంకో స్త్రీని ఆశ్రయించటం సోమూకు సుతరామూ యిష్టం లేదు.

ప్రతిక్రియ చెయ్యక తప్పేదీలేదు. రోజూ అతన్ని చూచి కమల కౌతుకంగా నవ్వుతూ ఉంది. పైగా బస్సులో ఎక్కడ కలుస్తుందో అనే భయం మూలాన క్రమంగా క్లాసులో సోమూ నాగాలు పెడుతున్నాడు. ఏవిధంగానైనా కానీ కమలను మాత్రం ఎప్పటికీ నోరెత్తకుండా చేయాలి.

ఆవాళ సమయం చిక్కింది.

కాలేజీ వొదిలారు. కమల మరిద్దరు సహాధ్యాయినులతో కలిసి కారెక్కి టాక్సీవానితో బొటానికల్ గార్డెన్సుకు పోనిమ్మని చెప్పతోంది. సోమూ విన్నాడు. అయిదారు నిమిషాలు ఆలోచించి దారినపోయే టాక్సీని ఆపి

డ్రైవరును హెచ్చరించాడు—"బొటానికల్ గార్డెన్సు."

బొటానికల్ గార్డెన్సు. సాయంకాలం స్నేహితురాండ్రు చెట్లూ చామలూ నిరీక్షిస్తూ తిరుగుతున్నారు. కమల మాత్రం ఒక బెంచీకి చేరగిల బడి కూర్చుంది. దాపున ఎవరూ లేరు. సోమూ ఒక పొదచాటున నక్కి వీలుకోసం వేచివున్నాడు. కమలసఖులు కొంచెం దూరంగా పోగానే సోమూ ఎదుటపడి—కారపు శనగలు తింటారా?" అన్నాడు.

కమల చకితురాలయింది. పూర్వం మాదిరిగా నవ్వలేకపోయింది. కాని అభ్యాసంవల్ల అనేసింది "థాంక్స్! ఇవ్వండి—"

సోమూ కళ్ళు నిప్పులు కక్కినై. కమల కుడిచేయి గుప్పెట్లో బిగించి—"నీ జుట్టుపట్టుకుని—"

అంటూనే సోమూ చకితుడయాడు. కమల జడవచ్చి అతని వక్షస్థలం దగ్గర పడింది. కమల ముఖాన నెత్తురుచుక్క లేదు.

హతాశుడై సోమూ బెంచిమీద కూలబడ్డాడు. కమల తన కళ్ళమీద చీరచెరగు పట్టుకుంది.

కమల ఏడుస్తోందని గ్రహించి తన గుప్పెట్లో ఉన్న చేతిని వదలి ఆదుర్దాగా—"చెయ్యి నొప్పి పట్టిందా?" అని అడిగాడు.

కమల చెయ్యి తీసుకోకుండానే అంది "ఉఁహుఁ!"

సోమూకు ఏమీ అర్థం కాలేదు. మళ్ళీ అడిగాడు—"మరెందుకు—"

కమల కళ్ళమీది చెరగు తియ్యకుండానే—"ఆ చిత్రం చించి పారేసి నన్ను క్షమించు—" అన్నది.

సోమూకు నోట రేవీలేదు. బెల్లంకొట్టిన రాయివలె కూర్చున్నాడు. హఠాత్తుగా దూరాన నవ్వులు విని తలయెత్తి చూచాడు. కమల సహోధ్యాయి నులు నవ్వుకుంటున్నారు.

సోమూ దడబిడిగా లేచి "చేయి ఒరుసుకుపోయింది. టించెర్ అయొడిన్ పట్టీ—" అని, చుట్టమున్నట్టు చేయి త్రిప్పుతూ మెల్లగా జారుకున్నాడు.

కొంతదూరం పోయాక సోమూ ఒకమాటు తిరిగి చూచాడు. కమల తలవంచుకొని నిలబడి ఉంది.

స్నేహితులు, సోమూ మూడో అంతస్తు ఎక్కి చూచాడు వదినె కమల గీచిన చిత్తరువు చూస్తూ నవ్వుతూంది. సోమూ—"వదినా, సర్వనాశన మయింది!" అన్నాడు.

వదినె గాభరాపడి—"ఏమయింది?" అన్నది.

సోము పక్కమీద చిత్తుగా పండుకొని—"నారీ నిర్యాతనం." అన్నాడు.

వదినె భయంతో "నీ నటన చాలించి, అర్థం అయేటట్లు చెప్పు మరిదీ!" అని అడిగింది.

సోమూ కళ్ళు మూసుకొని చెప్పసాగాడు—"అయితే వింటావా? విను! సోమూ అనే పేరుగల కుర్రవాడొక డున్నాడు—" తరువాత కథంతా వినిపించాడు. వదినె అంతా విన్నాక—"చిత్రం వచ్చిననాడే చెబితే, మరిదీ, ఆపిల్లకు చక్కని జవాబు ఇచ్చేదాన్ని. ఇప్పుడైనా ఏమీ మించిపోలేదు. నేనా పిల్ల తిక్క అణుస్తాలే" అన్నది.

మరునాడు సోమూ సరిగా పదింటికి స్కూలుకు వెళ్ళాడు. కమల కనపళ్ళేదు. కమల సఖులిద్దరు మాత్రం సోమూను చూచి నవ్వారు. చేయెత్తి నమస్కారంకూడా చేశారు. ఆ మర్నాడు కూడా కమల రాలేదు.

ఈ మధ్యలో భార్య తంతి చూచుకొని సోమూ అన్న చప్రానుండి వచ్చాడు. కమల ఉత్తరంలో ఉన్న చిరునామాను బట్టి వదినె నాయనమ్మలు ఒకసారి కమల యింటికి కూడా పోయివచ్చారు.

ఫలితం, సోమూ అన్న కమలమామా యాదృచ్ఛికంగా బజారులో కలుసుకుని గంటన్నరసేపు మాట్లాడారు.

తరువాత ఓ రోజున కాలేజీలో కమల సోమూకు కనపడి చీరచెరగు నెత్తిమీదికి లాక్కుబోయింది. బ్రోచ్ పెట్టి ఉండటంవల్ల చెరగు నెత్తిమీదికి రాలేదు. విధిలేక ముఖంమాత్రం క్రిందికి వంచుకొని అత్యంత సాధు ప్రాణివలె కూలబడింది. సోమూ చూడనట్టుగా పెన్సిలు చెక్కుకుంటున్నాడు.

ఆఖరుకు, ఒక సామాన్య స్త్రీని వశపరచుకోవటానికై ఒకనాటి సాయంకాలం టాక్సీ ఎక్కి, దుర్యోధన వేషంతో (పెళ్ళికొడుకై), బంధుమిత్రాది సైన్యాలను సమకూర్చుకొని, కమలమామ హోంగ్‌ముఖ్తారుదారు యింటిని శ్రీయుత సోమేశ్ చంద్రసమద్దార్ ముట్టడించాడు.

# వెల్లువ

క్రొంకి అరిస్తే కోయిల కూసిందన్న భ్రమపడి ప్రాయాన—అంటే ఇరవైరెండో యేట, బేచారాంబాబు లవంగమంజరిని వివాహంచేసుకున్నాడు.

అప్పుడు భవిష్యత్తును గురించి ఎవ్వరూ ఆలోచించలేదు. వరవధువులూ, వారి చుట్టపక్కాలూ, అందరిదృష్టీ వర్తమానంమీదే వున్నది. బేచారాం బాబు చూసింది—ఆలిచిప్పలవంటి రెండుకళ్ళూ, ముత్యపు ముక్కెరా, తాంబూల సేవనమువల్ల కొంచెంగా ఎర్రబడ్డ మొక్కజొన్న గింజలవంటి పలువరుసా. లవంగమంజరి చూసింది—పాలు పెరుగూ కొంచెం అధికంగా సేవించటంవల్ల బొద్దుగా పెరిగిన దేహమూ, ఊగవాలితే జారిపోయేటట్టుగా వున్న మెడా, వర్షాకాలపు కారుమేఘమువలె శ్యామలముగావున్న ఒక దేవ మూర్తిని. మంజరి తల్లిచూసింది—అడిగికూడా పెట్టించుకు తింటంచేత కాని గంగిగోవువంటి పిల్లవానిని. ఇక లవంగమంజరి తండ్రి చూచింది—బేచారాం బాబు తండ్రి కేనారాంబాబు కలకత్తాలో అద్దెకు యిచ్చిన మూడు మేడలూ, సుందరవనంలోవున్న మూడువందల యెకరాల మాగాని భూమి.

వివాహం మహావైభవంగా జరిగిపోయింది—ఆరోజు జ్ఞాపకంవస్తే ఇప్పుడు కూడా బేచారాంబాబు గ్రామఫోనుమీద పీలురాగపు సన్నాయి రికార్డు పెట్టి సబ్జుడై వింటోవుంటే—వంటయింటి వరండాలో కూర్చుని వంకాయ తరుగుతూవున్న లవంగమంజరి వేలు కోసుకొంటుంది.

నదిలో వెల్లువ తగ్గింది. నీరుకూడా ఇంకినట్టు తీసింది. రెండువైపులా సోపానపురాళ్లు, వూడిపోయి అస్తిపంజరమువలె కనపడుతూ ఒకటి తర్వాత ఒకటి మెట్లన్నీ బయటపడ్డవి. కాని ఇలా ఎందుకయింది ?

దీన్నిగురించి ఎక్కువ వివరాలు చెప్పటం ఈ కథకు సంబంధించిన విషయం కానప్పటికీ, కొంచెంగా సూచించి వదలితే—ఈ నశ్వర జగత్తులోని నశ్వర తరప్రేమ మరీచికలనుంచి పాఠక పాఠికలు ముందు సావధానులు అవుతారని చెప్పుతున్నాను.

పారి గదినుంచే ఆరంభిద్దాము!

వెన్నెల రాత్రి. ఇంటి ముంగిలిలో వున్న వేపచెట్టు కొమ్మమీద కూర్చుని, నిశాచరి గుడ్లగూబ పక్షి భాషలో తన ప్రేయసిని పిలుస్తోంది. బేచారాంబాబు మేనత్త వరండాలో నిలబడి 'ధూత్—ధూత్' అంటూ దానిని వెళ్లగొట్టటానికి ప్రయత్నిస్తోంది. మేడ మూడో అంతస్థు గదిలో పుష్పశయ్య మీద పండుకొనివున్న బేచారాంబాబు వీపు గోక్కుంటూ నవ వధువు రాకకోసం ఎదురు చూస్తున్నాడు. మెట్లమీద అణచుకొంటూన్న నవ్వూ, తేల్చి వేస్తున్నట్టుగా అడుగుల చప్పుడూ, తాళపు చెవుల ఝుంకారమూ వినపడుతూవుంది. క్రమంగా అన్ని శబ్దాలూ శాంతించినవి. రెండు నిముషాల లోపలనే మెట్ల వాకిలిదగ్గర గాజులు గలగలమన్నవి. తర్వాత చేత్తో మల్లెపూలదండ పట్టుకొని నవవధువు లవంగ మంజరి గదిలో ప్రవేశించింది; ఆ క్షణంలోనే బేచారాంబాబు నిద్రపోయి గురక పెట్టసాగాడు! భర్త నిద్రపోవటం చూచి లవంగ మంజరి చప్పున లైటు ఆర్పివేసింది.

"ఇదేమిటి! దీపం ఎందుకు తీసేశా?" అని బేచారాంబాబు ఆదుర్దాగా అడిగాడు.

"మీరు నిద్రపోతున్నారుగా?" అంది మంజరి.

బేచారాంబాబు పాపం చిక్కులో పడ్డాడు—"నిద్ర కాదు, కాస్త మత్తు వచ్చింది. దీపం వెలిగించు, కాస్త నిన్ను చూడాలి!" అన్నాడు.

మంజరికి అప్పుడు పదిహేడో యేడు. Lamb's *Tales from Shakespeare* చదివి పూర్తిచేసింది. మందహాసం చేస్తూ—"ఇప్పుడు యింకా ఏమి చూస్తారు? పగలంతా కిటికీలోంచి పొంచి పొంచి చూసింది చాలదూ!" అన్నది.

"ఇంకోసారి చూస్తాను!"

"చూడండి!" అంటూ మంజరి స్విచ్ వత్తింది.

ఆ ప్రకాశవంతమయిన గదిలో పుష్పశయ్యమీద కూర్చుని, ఇద్దరూ ఒకరి కొకరు చెప్పుకున్నారు—ఈ ప్రపంచంలో యింకేమి లేకపోయినా ఒకరి నొకరము ప్రేమించుకొని జీవిద్దాము. ఇల్లులేకపోతే అరణ్యానికిపోయీ, అన్నం లేకపోతే కందమూలాలు తినీ జీవనం గడుపుదాము. తుండుగుడ్డ

లేకపోతే లవంగమంజరి తన కేశజాలంతో బేచారాం పాదాలు తుడుస్తుంది. పారాణి లేకపోతే బేచారాం తన హృదయంనుంచి రక్తంతీసి లవంగమంజరి కాళ్ళకు రాస్తాడు. బేచారాంబాబుకు ఒకటే ఆటంకం—ఎమ్. ఏ. పాసు కావాలి. లేకపోతే తండ్రి కూకలు వేస్తాడు. బేచారాంబాబు వంటి భర్తను పొందినందువల్ల—తన నారీ జీవితం సార్థక మైందని లవంగమంజరి చెప్పింది. తను గనుక మెట్రిక్యులేషను పాసయితే, ఇక యీ జీవితంలో ఆమె కే కోరి కా వుండదట.

చెట్టునున్న పళ్ళన్నీ పక్వానికి రానట్టు, జీవితంలోని కోరికలన్నీ నెర వేరవు. లవంగమంజరీ బేచారాముల కోరికలు భగవంతుడు నెరవేరనీయ లేదు. మెట్రిక్యులేషను పరీక్ష సరిగ్గా పదిహేను రోజులున్నదనగా బేచా రాంబాబు మేనత్త, మేనల్లుని తల చేతితో స్పృశించి, ఆశీర్వదిస్తూ ఈ లోకంతోవున్న సంబంధం తెంచుకుంది. తండ్రిగారింట్లో జామెట్రీ ప్రాబ్లము సాల్వు చేస్తున్న మంజరి యీ కబురు విని భోరున ఏడ్చింది. రెండో రోజున మామ కేనారాంబాబు కోడలిని తీసుకు పోవటానికి వచ్చారు. లవంగమంజరి పుస్తకాలన్నీ పెట్టెలో సర్ది ఏడుస్తో, మేనత్త వదలిపెట్టిపోయిన స్థానాన్ని ఆక్రమించుకోటానికి అత్తగారింటికి వచ్చింది.'

దహనక్రియలూ, శ్రాద్ధమూ, బ్రాహ్మణ భోజనమూ, బీదలకు అన్నదా నమూ, చివరకు పరామర్శ చేయటానికి వచ్చిన చుట్టాలను సాగనంపటమూ జరిగిన తరువాత లవంగమంజరికి పరీక్ష సంగతి జ్ఞాపకంవచ్చింది. పరీక్ష లయిపోయి అప్పటికి వారం రోజులకు ఎక్కువైంది. మంజరి తన గదిలో కూర్చుని దుఃఖించ సాగింది. బేచారాంబాబు వెనగ్గావచ్చి అత్యధిక ప్రేమా వేశంతో కుర్చీ సమేతంగా కౌగలించుకొని "చింతించకు! నేను నిన్ను స్వయంగా చదివించి వచ్చే సంవత్సరం మెట్రిక్యులేషను పరీక్ష పాసు చేయించుతాను." అని ఓదార్చాడు.

మంజరి కళ్ళు తుడుచుకుంటూ—"ఈ సంవత్సరం నాకు స్కాలర్‌షిప్ వచ్చేది" అన్నది.

బేచారాంబాబు—"వచ్చే సంవత్సరం మెడలు వస్తుంది!" అన్నాడు.

పతి ప్రేమకు ముగ్ధురాలై లవంగమంజరి ఇక పరీక్ష సంగతే మర్చిపోయింది. అనేక రకాల ఆటంకాలవల్ల ఆ సంవత్సరం బేచారాంబాబు కూడా ఎం. ఏ. తప్పాడని వేరుగా చెప్పనక్కరలేదు.

పరీక్షా ఫలితాలు ప్రకటింపబడ్డరోజున బేచారాంబాబు తండ్రియెదుటకు పోలేదు. చల్లగా రిక్షా ఎక్కి తిన్నగా బాగ్ బజారులోవుండే అత్తగారింటికి వెళ్ళాడు, లవంగమంజరి అప్పుడు మేడమైన రేలింగ్సుమీద మోచేతులు పెట్టి ప్రక్కయింటి కిటికీవైపు చూస్తూ ఏదో మాట్లాడుతూ వుంది. భర్త పదశబ్దం విని తలతిప్పి చూచి "ఫలితాలొచ్చాయా ?" అని అడిగింది.

బేచారాంబాబు—"తప్పాను" అన్నాడు.

మంజరి ముఖం వాడిపోయింది. "ఎన్నికష్టాలు వచ్చాయి ! లేకపోతే మీ బోటి విద్యార్థి—" అన్నది.

బేచారాంబాబు—"అదికాదు కారణం. నీవు పరీక్షకు కూర్చోనప్పుడు నేనెట్లా పాసవుతాను ! మనమిద్దరం అభిన్నులం కదూ ? అందుకనే—" అన్నాడు.

భర్తగారి పత్నీప్రేమకు లవంగమంజరి ముగ్ధురాలయింది. ఆమె చకిత దృష్టితో దగ్గరలోవున్న ఇండ్ల కిటికీలూ, మిద్దెలూ ఒకమాటు తేరిపారచూచి భర్త వక్షస్థలంలో తలవాల్చింది.

తర్వాత ఇద్దరూ మిద్దెపైన కూర్చుని—వచ్చే సంవత్సరం ఇద్దరమూ ఒక్కమాటే పాసు అవుదామని ప్రతిజ్ఞ చేసుకున్నారు. ఇందుకోసం కాళికాదేవికి రెండుజోళ్లు వేటలు బలియివ్వవలసి వచ్చినా యిష్టమే. మంజరి తనసొంత ఖర్చుల్లోంచి డబ్బు మిగిల్చి వేటలు కొంటుంది.

పరీక్షాఫలితం విని కేనారాంబాబు కొడుకును ఏమీ అనలేదు. కోడలును మాత్రం పిలిచి—"నీవు కొంచెం కనిపెట్టివుండు అమ్మాయీ ! మూడో అంతస్తులో వాడు చదువుకొంటూ వుంటాడు ; నీవు రెండో అంతస్తులో కూర్చుని ఇంటిపనులు చూస్తో కాస్త పహరాకూడా యిస్తూవుండు, తెలిసిందా ?" అన్నాడు.

లవంగమంజరి మునిపళ్లతో పెదవి బిగబట్టి నవ్వును ఆపుకొంటూ తల వూపింది.

ఇందువల్లనే బేచారాంబాబు గృహస్థుడైకూడా సన్యాసిగా వుండవలసి వచ్చింది. ఆయన మూడో అంతస్తులో వానప్రస్థం అవలంబించి అధ్యయనంలో నిమగ్నుడయ్యాడు. కాని స్వభావదోషం ఎక్కడకు పోతుంది? ఒక్క పేజీ చదివాడో లేదో మెట్లవైపు చూసి—"ఇదిగో! వింటున్నావా?" అని పిలిచేవాడు.

లవంగమంజరి రెండో అంతస్తునవుండే—"ఆఁ, వింటూన్నాను!" అని జవాబిచ్చేది.

"అరికాళ్ళు కాస్త వత్తిపో, బాగా నిద్రవస్తున్నది."

"మామగారింట్లోనే వున్నారు!" అనేది మంజరి.

తండ్రి ఇంట్లోనే వున్నాడని వినేవరకు బేచారాంబాబు నిద్ర మాయమై పోతుంది. ఇక తారస్వరంలో పదినిముషాలవరకు చదివి మళ్ళీ—"ఇదిగో, వింటున్నావా? నాన్నగారు బయటికెళ్ళారా?" అని అడిగేవాడు.

భర్తగారితో మాటిమాటికీ అబద్ధం ఆడటం మహాపాపమని లవంగమంజరి "ఆఁ, ఎందుకూ?" అనేది.

"మేడమీద కాకి ఒకటి మహాగోల చేస్తున్నది. కాస్తవచ్చి తోలిపో రాణీ!"

బేచారాంబాబు రాణి రెండో అంతస్తులో వుండే కాల్పనిక కాకాన్నుద్దేశించి 'హుష్, హుష్' అంటుంది. బేచారాంబాబు కాసేపు చెవులు రిక్కించి విని మళ్ళీ కేకవేస్తాడు—"ఇదిగో, ఈకిటికీ కాస్తవేసిపో చాలాగాలి వస్తున్నది!"

"రావటానికి వీల్లేదు. హిస్టరీ చదువుకొంటున్నా!" అనేది మంజరి.

బేచారాంబాబు ఇకేమీ మాట్లాడడు. దిండుహృదయం క్రిందికి లాక్కొని పండుకొంటాడు. ఇటు లవంగమంజరి ఒక చెవిక్రింద కేనారాం కూర్చుండే గదివైపుకూ రెండో చెవి పైన బేచారాంబాబుండే మూడో అంతస్తు గదివైపుకూ పెట్టి, రెండో అంతస్తులో వుండి సిపాయి విద్రోహ కారణాలు కంఠస్థం చేయటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోవుంటుంది. ఆఖరుకు విసుకుపుట్టి మెట్రిక్యులేషన్ హిస్టరీ ఆఫ్ ఇండియా పాన్‌దానుమీద విసిరికొట్టి క్రింది

నుంచి ఎక్కివచ్చే మెట్ల తలుపుకు గొళ్ళెం పెట్టి, మూడో అంతస్తులో ప్రవేశించి బేచారాంబాబు తల నిమురుతూ—"ఏమండీ, కోపంవచ్చిందా?" అని అడిగేది.

బేచారాంబాబు తల ఎత్తకుండానే గంభీరంగా—"పో, హిస్టరీ చదువుకో—చచ్చినవాళ్ళ పేర్లు వల్లించు!" అనేవాడు.

లవంగమంజరి బేచారాంబాబు దిండుమీద తలపెట్టటానికి మాత్రం చోటు చేసుకొని—"ఇక చేయను. ఈసారికి క్షమించండి!" అనేది.

బేచారాంబాబు విధిలేక క్షమిస్తాడు. తర్వాత యిద్దరూ ఒక ఝాము వరకూ మాట్లాడుకొంటారు. ఆ సంభాషణ డాక్ట్రిన్ ఆఫ్ లాప్సుకుగానీ కోబాల్డ్ మినిస్ట్రికిగానీ ఏమాత్రమూ సంబంధించివుండదు. ఈ సంభాషణ తెగితెగకముందే రెండో అంతస్తు మెట్ల తలుపు కదిలిన చప్పుడూ, మృదు కంఠంతో 'అమ్మాయీ!' అనే పిలుపూ వినపడుతుంది.

లవంగమంజరి దడబిడలాడుతూ దిగివచ్చి, చేతికి అందికలో వున్నవల్లా—అంటే సూదీ-దారం, పాన్‌దానూ, నేతి తప్పేలా-వగైరాలు ఎడమచేతితో తీసుకొని కుడిచేతితో గొళ్ళెం తీస్తుంది. కేనారాంబాబు నవ్వుతూ—"బేమా చదువుతున్నాడా?" అనేవాడు.

లవంగమంజరి—ఊఁ" అనేది.

కేనారాం—"సరే, ఇక స్నానంచేసి భోంచేయమను! ఎక్కువ చదవటం కూడా మంచిది కాదు! పోయి కాస్త పిలువూ" అనేవాడు.

లవంగమంజరి వెళ్లి బేచారాంబాబును పిలుచుకు వస్తుంది. బేచారాం బాబు చేతితో కణతలు పట్టుకొని దిగివస్తాడు. కేనారాం "తల తప్పకుండా చిటపట లాడుతుంది. ఒక్కసారిగా ఎక్కువసేపు చదివితే తలనొప్పి పెట్టదూ? కాసేపు చదువు; కాసేపు అటూ యిటూ తిరుగు—మేడమీద" అనేవాడు.

బేచారాంబాబు 'అలాగే'నని స్నానాగారంలోకి పోయేవాడు.

* * *

మార్చిలో మెట్రిక్యులేషనుకూ, జూలైలో ఎం. ఏ. కూ పరీక్ష జరుగుతుంది. డిశంబరులో అకస్మాత్తుగా ఒక రోజున మంజరి బేచారాంబాబు వద్దకు వచ్చి అన్నది.

బేచారాంబాబు సంకుచితుడై — "ఏవిధంగా నన్ను కూర్చుంటానికి వీలుందేమో చూడూ!" అన్నాడు.

మంజరి వ్రేళ్ల కనుపులు లెఖ్ఖ వేసి "ఎట్లానూ వల్ల కాదు!" అన్నది.

బేచారాంబాబు దిక్కుతోచక "అయితే—" అని, తలగోక్కుంటూ పెన్సిలు కొనుక్కోవటం కోసం బజారుకు వెళ్లాడు.

మెట్రిక్యులేషను పరీక్ష కొద్దిరోజు లున్నవనగానే మంజరికి అడ్డువచ్చింది పరీక్షలయాక చాలారోజులకు బేచారాంబాబు కరుణాపూరిత మధుర స్వరంతో మంజరితో— "ఈసారి పరీక్షకు కూర్చున్నట్టయితే నీకు తప్పకుండా మెడలు వచ్చేది."

లవంగమంజరి పొత్తిళ్ళలో పెట్టివున్న నవజాత కన్యను బేచారాంబాబుకు అందిస్తో—కటుస్వరంతో "ఇచ్చారుగా యీ మెడల్!" అన్నది.

బేచారాంబాబు చాలా తప్పుచేసిన వానివలె తలవంచుకొని తప్పుకు పోయాడు. కొన్ని దినాల వరకు మళ్ళా పరీక్షసంగతి రానేలేదు. ఆరు మాసాలయాక ఒకరోజున బేచారాంబాబు నవ్వుతూ వచ్చి — "నేను సెకండు క్లాసులో పాసయాను!" అన్నాడు.

లవంగ మంజరి మొదట చాలా సంతోషించింది. కాని మరుక్షణానే ఆమె పతిభక్తికి దెబ్బతిన్నది. బేచారాంబాబు మోసకాడూ స్వార్థపరుడూ గా ఆమెకు కనుపించసాగాడు. లవంగమంజరిని నారీ జన్మసార్థకం చేసుకోవటానికి నియోగించి తాను స్వేచ్ఛగా పరీక్షలు పాసవుతున్నాడు!

లవంగ మంజరి హృదయం మొదటిమారు ఈర్ష్యవల్ల కొంచెం గీచుకు పోయింది. మరుసటి సంవత్సరం సరిగ్గా మార్చికి ముందు ట్రాముమీదనుంచి పడటంచేత బేచారాం బాబు ఆ టిక్కెట్టుతోటే పరలోక యాత్రచేశాడు. మంజరి హృదయంలో పడివున్న గీతను ఈ ఘటన కొద్దిగా గాయంచేసింది.

ఆ మరుసటి సంవత్సరం—సరిగ్గా మార్చికి ముందే—మొదటి సంవత్సరం వచ్చిన ఆటంకమే మళ్ళా వచ్చింది. పిల్లవాడు పుట్టిన మరునాడు బేచారాం బాబు పిల్లవాణ్ణి అత్తకు నప్పజెప్పి పూరీ వెళ్ళిపోయాడు. నాలుగో సంవత్సరం మార్చిలో అమ్మాయికి ఇన్‌ఫ్లూయెంజా వచ్చింది. అయిదో సంవత్సరం సరిగ్గా మార్చికిముందు అబ్బాయి టైఫాయిడ్ జ్వరంతో మంచం ఎక్కాడు. ఈ విధంగా లవంగ మంజరి వైవాహిక జీవితంలో పదానుగు మార్చిలు గతించిపోయినై. మంజరి హృదయంలో పడ్డ గీర పెద్దదవుతూ అవుతూ పదానుగు అంగుళాల గాయం అయింది. మంజరి మాత్రం మెట్రిక్యులేషన్ పరీక్షకు కూర్చోనేలేదు. కాని మంజరి కుమార్తె చంకను పుస్తకాలు పెట్టుకొని బ్రాహ్మోగరల్సు స్కూలుకువస్తూ పోతూవుంది.

* * *

జీవననదికి వెల్లువ తీసే సమయాన మన కథలో ఒక ఘటన జరిగింది.

కిస్‌మిస్ సెలవలు, బొంబాయి, వాల్తేరు, ఢిల్లీ, కాన్పూరు మొదలగు పట్టణాలనుంచి లవంగ మంజరి బాల్య స్నేహితురాండ్రు తమ తమ భర్తల వేతనానుసారం మోటూ—తాటా శరీరాలతో కలకత్తా చూచి పోవటానికి వచ్చారు. ఆ సంవత్సరం కలకత్తాలో అఖిలభారత శిల్ప ప్రదర్శనం జరుగుతూ వున్నది. పెద్ద పెద్ద హోటలున్నిట్లో 'చోటులేదు' అనే నోటీసులు వ్రేలగట్టి వున్నాయి. కలకత్తా మార్కెట్టులో మూర్షిదాబాదు పట్టుచీరెల ధర, రూపాయికి రెండు అణాలు పెరిగింది.!

పైశిల్ప ప్రదర్శనంలో లవంగ మంజరి తన అమ్మాయిని వెంటబెట్టుకొని తిరుగుతూ వుండగా దాదాపు మంజరి ప్రాయమేగల స్త్రీ ఎదురుపడి "దీదీ నీవు లంగమంజరివి కావూ ?"

ఆగంతుకి లంగామాదిరి ముడుతలుపడ్డ పార్సీ చీర కట్టుకొని, కాళ్ళకు స్లిప్పర్లు వేసుకొని వుంది. సామాన్యంగా వేశ్యలే ఈమాదిరి దుస్తులు ధరిస్తూ వుంటారు. మంజరి మొదట ఇలానే ఊహించింది. కాని మరుక్షణానే తన స్మృతిపటము మీదికి ఒక బాల్యకాలపు మూర్తిని తెచ్చుకొన్నది. అమ్మాయి చాల బక్కపలచగా వుండేది. ఈ యెదుటవున్న మహిళ బాగా బొద్దుగా

వుంది. అందుకని మంజరి సందిగ్ధంలో పడి ఏమనాలో నిశ్చయించుకో లేక పోయింది. అంతలోకి నవ్వుతూ—"దీదీ, నన్ను గుర్తుపట్టలా? నేను మృణాళినిని!" అన్నది.

మంజరికూడా నవ్వుతూ—"కాదు చెల్లీ! నీవు చాలా లావు—" అన్నది.

మృణాళిని—"వారుకూడా యిదే అంటున్నారు; నీవే చెప్పు దీదీ, నేనేమి చేసేది?"

తరువాత మృణాళిని పది పన్నెండు గజాల పట్టు రుమాలతీసి పచ్చిగడ్డి మీద పరిచింది. సఖులిద్దరూ దానిమీద కూర్చుని సంభాషణ ప్రారంభించారు.

కాసేపట్లోనే మృణాళిని సఖి కమలినీ, కమలిని ప్రాణం పుష్కరిణీ, పుష్కరిణికి ఆధారం నిర్ఘరిణీ, నిర్ఘరిణి చెలి పూజారిణీ ఇత్యాదులు అరడజను స్త్రీలు వచ్చి సఖీత్వ సూత్రముతో గుచ్ఛబడిన మాలవలె మంజరి చుట్టూ కూర్చున్నారు. వారి పతిదేవులు దూరంగావున్న వటవృక్షంక్రింద నిలబడి, ఊర్ధ్వనేత్రాలతో, కొమ్మలు లెక్కిస్తూ సభాభంగం కోసం ప్రతీక్షిస్తున్నారు. అర్ధఘామురాత్రి గడిచాక కిలకిల నవ్వులతో సభ ముగిసింది. అక్కడ కూడిన సఖులలో లవంగమంజరే కలకత్తావాసిని కావటంచేత మరుదినం మూడోఝామున, సఖుల నందరినీ తనయింటికి రమ్మని ఆహ్వానించి, వారిదగ్గర సెలవు తీసుకుంది.

ఇంటికివచ్చే దోవలో మంజరి తనస్థితినిగురించి ఆలోచించిన కొద్దీ తన సఖులందరిలోనూ తానే అభాగినినని ఆమెకు తోచసాగింది. ఆమె సఖులను వారి వారి భర్తలే వెంటబెట్టుకోని ప్రదర్శనానికి తీసుకువచ్చారు. మరి తన వెంట ఎవరు వచ్చారు? జగ్గూకోచ్‌వానూ, మహాదేవదర్వానూ, బుధువా సైనూ!

లవంగమంజరి మానసిక విలాపము పూర్తికాక ముందే బండి సింహద్వారము లోనికి వచ్చి ఆగింది. బేచారాంబాబు అప్పుడు చాలా ఆదుర్దాతో ఈగదికీ ఆగదికీ తిరుగుతూ, వుండుండి షేమీదాసీని కసురుతున్నాడు—అది అమ్మ గారివెంట ఎందుకు వెళ్ళ లేదని! మంజరిని చూడగానే అతను చాలా సంతో

మంతో అన్నాడు—"వచ్చేశావే! నేను చాలా—"

మంజరి తన దుర్భాగ్యం సంగతి యింకా మరచిపోలేదు. మధ్యలోనే—"రాకపోయినా బావుండేది!" అన్నది.

బేచారాంబాబుకు యికే మంటానికి ధైర్యము చాలలేదు. అమ్మాయిని చాటుకు పిల్చి మెల్లగా—"మీ అమ్మ పర్సు మర్చిపోయి వెళ్ళిందనుకుంటా, కాదూ?"

"నాకు తెలియదు"—అని అమ్మాయి తుర్రున పారిపోయింది. బేచారాం బాబు క్రిందకు దిగివచ్చి బండివాణ్ణి కనుక్కుంటే—గుర్రం దోవలో ఎక్కడా నఖరా చేయలేదని తెలిసింది. అయితే, మంజరి హఠాత్తుగా యీ రుద్రరూపం ధరించటానికి కారణం ఏమిటి?...ఎంత ఆలోచించినా అతనికి బోధపడక పోయేవరకు చప్పున భోంచేసి గుప్పున నిద్రపోయాడు.

మంజరి రుద్రరూపానికి కారణం మరుదినం దానంతటదే బేచారాంబాబు కళ్ళముందు ప్రాతఃకాలపు సూర్యునివలె ప్రత్యక్షమైంది.

బేచారాంబాబు అప్పుడు భోంచేసి నిద్రపోతున్నాడు. అకస్మాత్తుగా మెట్లమీద కాళ్ళ చప్పుడూ, గాజుల గలగలా పరపరా, మధుర హాస్యాల కలకలా విని త్రుళ్ళిపడిలేచి పక్కమీద కూర్చున్నాడు. మరుక్షణం—"రావే చెల్లీ, రావే!" "భలే! ఆ చీర నీకెంతబాగా అతికింది!" "అది ఎన్ని నవర్సులదీ?" "మజూరి ఎంత తీసుకున్నాడు?" "ఈరవ్వ ఎన్ని రతులు?" "మీవారు నిన్ను రానిచ్చారూ?"—ఈమాదిరి విచిత్ర ప్రశ్నలు విని బేచారాంబాబు లవంగమంజరి గదిలో సఖీ సమ్మేళనము జరుగుతున్న దని గ్రహించాడు.

బయటికి వెళ్లాలంటే మంజరి గదికి మూడువైపులగుండా తిరిగి వెళ్ళాలి. ఇటు బేచారాంబాబు తీరిక చిక్కనందువల్ల అయిదురోజుల నుంచీ గడ్డం చేసుకోలేదు. అందుకని బయటికి రావడానికి సిగ్గుపడి పక్కమీదే కళ్ళు మూసుకు పండుకొని పక్కగదిలో, వివాహమూ—అత్తింటి కాపురమూ—నగలూ-కోకలూ—మొదలగు వాటిమీద జరిగే విమర్శన వినసాగాడు.

వింటూ వింటూనే బేచారాంబాబు ఒక గుడ్డి కునుకు వేశాడు. మంజరి

ఉచ్ఛకంఠస్వరం విని హఠాత్తుగా వారికి మెలకువ వచ్చింది. లవంగమంజరి చెప్పుతూ వుంది—ఇంట్లో మాస్టరును పెట్టి చదువు చెప్పించి, నీ భర్త కనక నిన్ను పాసు చేయించాడు. నీ అదృష్టం. నాభర్తభోటి వారి పాలిట పడితే నీ చదువుకు పురిట్లోనే సందు కొట్టేది. నాబోటిది ఇంకా ఏమి పరీక్షలు పాసవుతుంది!

బేచారాంబాబు గౌరవానికి భంగం కలిగింది. కోపంకూడా వచ్చింది. కోపం వచ్చినప్పుడు గ్రీకు వేదాంతి చెప్పిన ప్రకారం నూరుపరకూ లెఖ్ఖ పెడతాడు. నేనుకూడా ఆపంథా అనుసరించాడు. కాని, వేయివరకు లెఖ్ఖ పెట్టినా వారి కోపం తగ్గకపోయేవరకు యిక మిద్దెమీదకుపోయి పచారు చేయసాగాడు. క్రమంగా సాయంత్రం అయింది. మంజరి అతిధినులు మోటార్లు ఎక్కి సెలవు తీసుకోవటం బేచారాంబాబు రక్తనేత్రాలతో మిద్దెమీదనుండే చూశాడు. తర్వాత నెమ్మదిగా కాళ్ళీడ్చుకొంటూ క్రిందకు దిగివచ్చాడు. లవంగమంజరి వచ్చి—"కాస్త భోంచేస్తారా ?" అని అడిగింది.

బేచారాంబాబు "అఖ్ఖర్లేదు" అన్నాడు.

తర్వాత క్రిందికిదిగిపోయి ఒక వుత్తరం వ్రాసి క్షేమీ ద్వారా లవంగ మంజరికి పంపాడు. మంజరి బొమలు చిట్లించుకొని చదివింది—

'నీవు నన్ను అవమానం చేశావు. మాస్టరును పెట్టి చదువు చెప్పించి నిన్ను పరీక్ష పాసుచేయించలేదని స్త్రీలందరియెదుటా నన్ను రట్టుచేశావు. రేపే యీ ఆసంగతి వాళ్ళభర్తలూ, వాళ్ళభర్తలవల్ల వారి బంధుమిత్రులూ వింటారు. మొదట కలకత్తాలోనూ, తర్వాత ఢిల్లీ, ఆగ్రా, డెహరాడూన్, సిమ్లా, కాన్పూరు, బొంబాయి, మద్రాసు మొదలగు మహాపట్టణాల్లో నా అపకీర్తి వ్యాపిస్తుంది. నేను భార్యను హింసిస్తున్నాననీ, ఇచ్ఛాపూర్వకంగా ఆమెను బద్ధర స్త్రీనిగా తయారు చేశాననీ ప్రజలందరూ తెలుస్తారు. ఈ లాంటి పరిస్థితులలో నేను నీకు పతిగావుంటానికి ఏమాత్రమూ తగను. కాబట్టి, నేటినుంచి నేను డ్రాయింగురూంలోనే పండుకుంటాను; క్రింది గదిలోనే భోజనాదికాలు నిర్వర్తించుకొంటాను. ఇట్లు,

శ్రీ బేచారాం.'

లవంగమంజరి కళ్ళు ఎర్రబడ్డవి. "భేష్!"—అన్నాడు

ఫోంచేసినతర్వాత బేచారాంబాబు డ్రాయింగురూంలో పండుకొని, నల్లులు కుట్టటంవల్ల నిద్రపట్టక అటూయిటూ పొర్లుతున్నాడు. ఇంతలో క్షేమి ఒక వుత్తరం తీసుకువచ్చి యిచ్చింది. బేచారాంబాబు చదివాడు—

'తమ వుత్తరం అందినది. సంగతులన్నీ తెలిసినవి. మీపిల్లల లాలన పాలనలోనే నాజీవితమంతా వ్యర్థమైంది. పైగా మీరే నన్ను కోప్పడు తున్నారు! నేను రేపటినుంచీ మీవద్ద వుండను. ఈ వుద్దండపు పిల్లలను ఎలా సంబాళించుకొంటారో చూస్తాను. దంతాలు వున్నంతవరకూ వాటి విలువ ఎవరికీ తెలియదు.

ఇట్లు,
శ్రీమతి లవంగమంజరీదేవి.'

వుత్తరం చదవగానే బేచారాంబాబు తల కొంచెం తిరిగింది. కాని వెంటనే తిప్పతెలుసుకొని క్షేమితో—"భేష్!" అన్నాడు.

* * *

రాత్రి అంతా నానావిధములైన దుశ్చింతలవల్లనూ, పాపిష్టినల్లుల కాట్ల వల్లనూ—నిద్రపట్టక తెల్లవారుఝామునకు బేచారాంబాబు కన్నంటింది. అంటి కూడా ఎక్కువసేపు కాలేదు, చిన్నబ్బాయి చీత్కారంవిని మెలకువ వచ్చింది. చిన్నబ్బాయి వచ్చి చేయిపట్టుకొని లాగుతూ—"ఆకలి అవు తోంది నాన్నా!" అని అడుగుతున్నాడు.

నిద్రచాలక మూసుకుపోయిన కళ్లను బలవంతాన కొంచెం తెరచి బేచారాం బాబు—"వేధించబోకురా నన్ను. మీ అమ్మదగ్గరకు పో!" అన్నాడు.

"అమ్మ లేదుగా" అన్నాడు. కుర్రవాడన్నాడు—తేలుకుట్టిన వానివలె ఉలికిపడి బేచారాంబాబు పక్కమీద కూర్చున్నాడు. గత దినం జరిగిన ఘటనలన్నీ అతనికి ఒక్కసారిగా జ్ఞాపకంవచ్చాయి. త్వరగాలేచి రెండో అంతస్థుకు పోయి చూచాడు—యింటి ఆవిడ లేదు. పెద్దమ్మాయి మాత్రం కూర్చుని డ్రాయింగు వేసుకొంటూవుంది. పెద్దబ్బాయీ చిన్నమ్మాయీ కలిసి నాయనగారి పాత బూట్లన్నీ పోగుచేసి—మల్లెపూవులవలె తెల్లగా

వున్న మంజరి శయ్యమీద—వాటితో గోపురం కొట్టటానికి ప్రయత్ని స్తున్నారు. బేచారాంబాబును చూడగానే పెద్దమ్మాయి—"ఇవ్వాళ స్కూలుఫీజు యివ్వనా న్నా! మాటమాటికి అడగటం బాగోలేదు. ఇవ్వాళ జీతం తీసుకొనిగాని కదలను!" అని అన్నది.

బేచారాంబాబు—"మీ అమ్మ—"

పెద్దమ్మాయి మధ్యలో—"అమ్మ యిచ్చిపోలేదు. మీ నాన్నను అడిగి తీసుకోమని చెప్పింది. ఇదిగో, మీ ఓటిపెట్టె చెవి అట్టే పెట్టిపోయింది. అని ఒక తాళపుచెవి తండ్రిగారి మీదికి విసరివేసింది.

—"ఎక్కడికి వెళ్లింది?"

పెద్దబ్బాయి జవాబిచ్చాడు—"బాగ్ బజార్! మరి చెప్పిపోయిందీ— మీరు గనుక అటు ముఖంపెట్టితే—"

పెద్దమ్మాయి వాణ్ణి బెదరిస్తూ—"నోరు మూసుకోరా వెధవా! నాన్న గారికి అటువంటి మాటలు చెప్పవచ్చా?—అది కాదు నాన్నా అమ్మ, చెప్పిపోయిందీ—మీరు గనుక బాగ్ బజారుకు వెళ్ళేటట్టయితే అమ్మకు చాలా కష్టంగా వుంటుందట. తర్వాత కలకత్తా వదలి ఎక్కడికైనా వెళు తుందట. కాశీ అయినా పోవచ్చు, రామేశ్వరం అయినా పోవచ్చు" అన్నాడు.

చిన్నమ్మాయి—"అమ్మంటే—నేను యిహ మీ అమ్మను కాను. మీకు ఇంకో కొత్త అమ్మ వస్తుంది. చెప్పు నాన్నా, ఎప్పుడొస్తుందీ?" అని అడిగింది.

బేచారాంబాబు—"హుం! అట్లాగా!"

తర్వాత కాలువా పైన వేసుకొని బజారికి పో బోతూవుండగా పెద్దబ్బాయి "మా కేదన్నా తింటానికి తెచ్చిపెట్టు నాన్నా! నాకు పూరీలూ—చిన్న మ్మాయికి బిస్కత్తులూ—" అన్నాడు.

పెద్ద అమ్మాయీ చిన్న అబ్బాయీ ఏక కంఠంతో—"మాకు వేడి వేడి బజీలు" అన్నారు.

బేచారాంబాబు కొంచెం గాభరాపడి—"క్షేమిని పిలువూ?"

"అదికూడా లేదు నాన్నా!" పెద్దమ్మాయి అంది.

"ఎక్కడికి వెళ్లింది?"

"ఉదయాన్నే అమ్మదగ్గర సెలవు తీసుకొని అమ్మ బండే ఎక్కిపోయింది."

బేచారాంబాబు ఇదంతా ఒక పెద్ద కష్టని గ్రహించాడు—"హూఁ, అందాకా వచ్చిందీ!—ఠాకూర్?" పిలిచాడు.

వంట బ్రాహ్మడు గణపతిఠాకూర్ వచ్చి వినయంగా—"కాబేజీ కూరలో మిరపకాయలు వేయమంటారా, వద్దంటారా?" అని అడిగాడు.

బేచారాం—"వద్దు—నీవు బజారుకు పోయి పిల్లలకు, ఏమైనా, తింటానికి తీసుకురా."

—"ఇప్పుడింకా ఏమి తింటారు బాబూ! పది ఘంటలేగా అయింది. ఇదివరకు ఒకసారి తిన్నారు" అన్నాడు గణపతి.

బేచారాంబాబు బుభుక్షు చతుష్టయం వైపు కోపంగా చూస్తూ—"తిన్నారూ?" అడిగాడు.

—"కొద్దిగా" అంది పెద్దమ్మాయి.

బేచారాం-"ఇప్పటికి వూరుకోండి, మధ్యాహ్నం బాగా తిందురుగాని!"

ఆరోజునుంచే బేచారాంబాబు గృహ కార్యాల్లోకి మనస్సును పోనిచ్చాడు. అన్ని వ్యవహారాలూ చక్కజేసుకొని, అబ్బాయిలూ అమ్మాయిలూ భోంచేసే సమయం, వారివారి పరిమాణం—అంతా టైమ్ టేబిలు వ్రాసి వంటయింటి తలుపుకు అంటించాడు. తర్వాత వంటవానినీ, నౌకర్లనూ పిలిచి—"పనులన్నీ సక్రమంగా జరగాలి. ఇంటి ఆవిడే లేదని కాస్త అతి తెలివి చూపించ బోతారేమో—నాదగ్గర అవేవీ సాగవు!" అని చెప్పాడు.

రాత్రి బేచారాంబాబుకు కునుకు పట్టుతూ వుండగా చిన్నబ్బాయి వచ్చి—"నాన్నా, నాకు యర్రచొక్కా తొడగవూ?" అన్నాడు.

బేచారాంబాబుకు మత్తు వదిలింది.—"రాత్రిళ్లు చొక్కా ఎందుకూ?" అన్నాడు—

చిన్నబ్బాయి—"అది లేకపోతే నాకు నిద్రపట్టదు!" అన్నాడు.

బేచారాంబాబు అమ్మాయిని పిలిచాడు.

అమ్మాయి—"నా చెవి దురదగావుంది నాన్నా !" అంది.

బేచారాం—"సరే" నన్నాడు.

ప్రొద్దున్నే లేచి డ్రాయింగురూంలో కూర్చుని వుండగా జగ్గూకోచ్ వాణ్ణి వచ్చి గుర్రందానా అంటటంలేదని చెప్పాడు.

బేచారాంబాబు—"డాక్టరుకు చూపించు."

జగ్గూ వెళ్ళిపోయాడు—సాయంత్రం మళ్ళీ వచ్చి గుర్రం గిలగిల తన్నుకొంటున్న దన్నాడు.

బేచారాంబాబు చాకలి దగ్గరనుంచి ఇస్త్రీ గుడ్డలు లెఖ్ఖపెట్టి తీసుకొంటున్నాడు. నిర్వికార భావంతో ఆజ్ఞాపించాడు—"గుర్రాన్ని పశుసంరక్షణ శాలకు తోలు."

మధ్యాహ్నం బేచారాంబాబు నిద్రపోతుండగా ఒక కాన్ స్టేబులు చిన్నబ్బాయినీ చిన్నమ్మాయినీ చెరి ఒక రెక్కా పట్టుకొని హాజరై—"ఈ పిల్లలిద్దరూ మెయిన్ రోడ్డుమీద నిలబడి, ఏకుస్తో బాగ్ బజారుకు దారి అడుగుతున్నారు" అన్నాడు.

బేచారాంబాబు కాన్ స్టేబులుకు ఒకపావులా యిచ్చి పంపాడు. అనుక్షణమూ మోటార్లూ బళ్ళూ తిరిగే కలకత్తా పట్టణంలో ఈ వుద్దండపు పిల్లలతో వుంటం చాలా అపాయకరమని భావించి, వెంటనే దర్వాన్ను పిలిచి టైమ్ టేబిల్ కొనుక్కు రమ్మని హోరాస్టేషనుకు పంపాడు.

టైంటేబిలుఅంతా తిరగవేసి, రైల్వే రూల్సులన్నీ చదివి బేచారాంబాబు ఏమి నిశ్చయించాడో ఆయనకే తెలియాలి. తక్షణం బజారుకువెళ్ళి హోమియోపథీ మందుపెట్టె, ఒకబుట్ట కమలాలూ, హోమియోపథీ చికిత్సా విజ్ఞానము (Materia Medica) పదకొండు సంపుటాలూ కొని సాయంత్రం యింటికి చేరుకునేవరకు రెండో అంతస్థుమీద గలభాగావుంది. పెద్ద మట్టి పాత్రలో రసగుల్లాలు ముందుపెట్టుకుని నలుగురుపిల్లలూ గోలచేస్తూ తింటున్నారు. బేచారాంబాబు స్తబ్ధుడై నిలబడిపోయి రసగుల్లాలు ఎక్కువగా తింటంవల్ల కడుపునొప్పివస్తే, నక్స్వామికా యివ్వాలా లేక పల్సెటిలా—అని ఆలోచించసాగాడు.

ఇంతలో అన్నయ్యతో పోటీచేయాలని చిన్నబ్బాయి ఒక్కసారే రెండు రసగుల్లాలు నోట్లో కుక్కుకొని గ్రుడ్లు తేలవేశాడు. పెద్దమ్మాయి "చస్తా వేమిరా—ఊసేయి, ఊసేయి!" అని అరిచింది.

చిన్నబ్బాయి ఊ యనన్నట్టుగా తలవూపి అయిష్టతను తెలుపుతూ వెల్లకిలా పండుకొన్నాడు. పెద్దమ్మాయి బిగ్గరగా ఏడ్చింది. వెంటనే క్షేమీ దాసి తలుపుచాటునుంచి బయటకువచ్చి, పిల్లవాణ్ణి తొడమీద పండుకో బెట్టుకొని, నెత్తిన నీళ్లుచల్లి, విసనకర్రతో విసరసాగింది.

బేచారాంబాబు—"నీ వెందుకువచ్చావ్?"వని అడిగాడు.

క్షేమీ—"దొరసానిగారు పిల్లలకు రసగుల్లాలు పంపారు. అవే—"

బేచారాం—"హుఁ! అఖ్ఖర్లా తీసుకుపో!"

రసగుల్లాలు తీసుకుపొమ్మనటం వినగానే చిన్నబ్బాయి బంతివలె లేచి కూర్చొని—"ఉహుఁ! అని మాని," అని కుండెడు రసగుల్లాలలో మిగిలిన మూడురసగుల్లాలూ గుప్పిటపట్టి మెట్లదోవ పట్టాడు. బేచారాంబాబు సందు వంక వేలుచూపిస్తూ క్షేమీతో—"ఊఁ! తీసుకుపో!" అన్నాడు.

క్షేమీ వెళ్లిపోయింది.

రాత్రి అంతా మేలుకొని బేచారాంబాబు చాలా తర్కవితర్కం చేసి—లవంగమంజరి లేకుండా ఈ కలకత్తా పట్టణంలో, ఈ తుంటరి పిల్లలను పెట్టుకొని సంసారం నడపటం అపాయకరమని తేల్చుకున్నాడు. భవిష్యత్తును వూహించుకొని అతను చాలా తొట్రుపడ్డాడు.

మర్నాడు ఒక అట్ట చించి నాలుగు ముక్కలు చేసి—వాటిమీద పిల్లల పేర్లూ, చిరునామా, పరిచయం—వివరంగా వ్రాసి నలుగురు పిల్లల మెడల్లోనూ కట్టి బేచారాంబాబు—"మహాదేవ్ టాక్సీ తీసుకురా!" అని కేక వేశాడు.

పెద్దమ్మాయి—"మెళ్ళో అట్టకట్టడం ఎందుకు నాన్నా?" అని అడిగింది.

"యాత్రచేయటానికి పోతున్నాం కదూ. అక్కడ మీలో ఎవరయినా మారిపోతే మెళ్ళో అట్టముక్క చూచి, మిమ్మల్ని ఈ యింట్లో వదలిపెడతారు. లేక రైళ్ళు డీకొట్టుకొని అందులో నేను—గ్రహించావా?..."

అప్పుడు రైల్వేవాళ్లు నీమెళ్లో ఈ టిక్కెట్టు చూచి నీ వివరయిందీ తెలుసు కుంటారు, తెలిసిందా ?''

పెద్దపిల్ల తెలివిగలది. అంతా అర్థంచేసుకుంది! యాత్రకు పోతున్నామనే ఉత్సాహంలో చేతికి అడ్డం వచ్చిన గుడ్డలన్నీ మూటకట్టేసింది. బేచారాం బాబు జగ్గూ తోడ్పాటులో ఏడు పరుపులూ పద్దానుగు కంబళ్లూ కలిపి ఒక చుట్ట చుట్టాడు. ఒక టాక్సీమీద సామానూ పరుపులూ వేసి జగ్గూను స్టేషనుకు పంపాడు. తర్వాత తన గదికి తాళంవేసి, మంజరిగదిని అలానే వుంచి మహాదేవప్రసాద్ ఇంటికి కాపలా పెట్టి, సిద్ధిదాత గణేశుని జపిస్తూ పిల్లల చేతులు పట్టుకొని రెండో టాక్సీ ఎక్కాడు.

బేచారాంబాబు టిక్కెట్టుతీసుకున్నది మధురకు కాని బండి బర్దవాన్ స్టేషనులో ఆగగానే చేతిలోవున్న న్యూస్ పేపరును గుప్పిటలో బిగించి ''పెద్దమ్మాయి! ఇకమీరంతా దిగండి!'' అన్నాడు.

చిన్నబ్బాయి—''దిగరా అన్నాయి. నాన్న సీతాభోగం కొనిపెడ తాడు!'' అన్నాడు.

పెద్దమ్మాయి—''ఇక్కడెందుకు దిగటం నాన్నా ?'' అని అడిగింది.

బేచారాంబాబు గుప్పిట్లోవున్న పత్రిక పిల్లమీద వేస్తూ—''చూడరాదూ చదివి. మధుర దగ్గిర ఎలుకలు పడుతున్నాయి—అంతాపోయి ప్లేగులోపడి చస్తారా ఏం ? దిగండి, దిగండి—'' అన్నాడు.

చిన్నబ్బాయి అదివరకే ప్లాటుఫారంమీద దూకి సీతాభోగం వాడిని పిలుస్తున్నాడు. బేచారాంబాబు మిగిలిన ముగ్గురనూ దించి తాను దిగాడు. ప్లాటుఫారంమీద కాసేపు నిలబడి దాపులో ఆరోగ్యకరమైన ప్రదేశం ఏదైనా వున్నదా అని ఆలోచించాడు. ఉత్తరపాడా జ్ఞాపకం వచ్చింది. అక్కడే గంగవడ్డున తీరినాన్నగారు కట్టించిపోయిన బంగాళా, చుట్టూ ఆరామవాటికావుంది. ఇంతలో డౌన్ పాసింజరు వచ్చి ఆగింది తత్తరబిత్తరగా ఒకవీసె సీతాభోగంతోని డౌన్ పాసింజరు ఎక్కాడు. తర్వాత యథా సమయానికి ఉత్తరపాడాలో దిగి కేనారాం ఆరామవాటికలో తిష్టవేశాడు.

  

జగ్గూకోచ్‌వాన్ స్వామిభక్తుడు. యజమానిని కొనిపోయినబండి డిస్టెంట్ సిగ్నల్ దాటగానే టాక్సీ ఎక్కి బాగ్ బజారువెళ్ళి బాబుగారు పిల్లా జల్లాతో మధురయాత్రకు పోయారని యజమానురాలితో చెప్పాడు.

లవంగమంజరి చేతిలోంచి జిలేబిపొట్లం క్రింద పడి పోయింది. తెరచుకున్న నోరు అలానే వుండిపోయింది. అనేక దుశ్చింతలు ఆమెను ఆవరించినవి. మధురలోని పండాలు గుండాలని ఆమె నాయనమ్మ చిన్నప్పటినుంచీ చెప్తూవుండేది.

మంజరి వూహించసాగింది—పండావచ్చాడు...చిన్నమ్మాయికి మిఠాయి యిచ్చాడు...గొంతు పిసికాడు...మెడలోని గజ్జెలూ మెడలోని హారమూ పలాయనమూ...

మంజరి ఇక ఆలోచించ లేకపోయింది. కెవ్వున కేకవేసి, ఏడుస్తూ— ''నీవు ఎందుకు వెళ్లలేదూ వెంట ?'' అన్నది.

జగ్గూ—''బాబుగారు తీసుకెళ్ళలేదు, ఏంచేసేదీ ? లేకపోతే యీ ముసలితనంలో మధుర దర్శించటం—''

లవంగమంజరి తల్లి వచ్చి సమస్తమూ విని కుమారుని పిలిచి—"నీవు పోరా హరీ ! ఉద్దండపు పిల్లలను పెట్టుకొని పరదేశంలో వొంటరి కాదు—" అన్నది.

హరికి దేశాటనం చేయాలనే కోరిక మహావుంది. ధనాభావంచేత ఎక్కడకూ పోనిమాట మాత్రం యధార్థం—అయితే ఏం? భారతదేశంలో వుండే రైల్వేకంపెనీల టైంటేబిల్లన్నీ భట్టీపెట్టివుంచాడు. తల్లి ప్రస్తావన వినగానే వుత్సాహంతో "ఆఁ! వెళ్ళటం చాలా అవుసరం—" అన్నాడు.

"వారిని చూడగానే మాకు తంతి యివ్వు—జ్ఞాపకం వుంటుందా?" అని లవంగమంజరి వందరూపాయల మూట తీసుకువచ్చి హరికి యిచ్చింది.

హరి సూట్‌కేస్ చేతపట్టుకొని బజారుకు వచ్చి బస్ ఎక్కాడు.

వాకిట్లో బిచ్చగా డొకడు గీతం పాడుతున్నాడు.

'ఏల దుఃఖించెదే బేలరాధమ్మ
వెగటు జేసిందేమొ వ్రేపల్లె విడిచి
ముద్దుల కృష్ణుండు మధురకు తరలె

తిరిగి రాడమ్మరో తిరిగి రాడమ్మ!'

విని లవంగమంజరి కంపించిపోయి "ఎంతకు లక్షణ గీతం! జగ్గూ దూరంగా కొట్టు దరిద్రుణ్ణి!" అన్నది.

బిచ్చగాడు గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు. కాని గీతంలోని ఆఖరు చరణం లవంగమంజరి హృదయంలో—సమ్మెట పెట్టువలె ప్రతిధ్వనించ సాగింది. చివరకు అధీరయై క్షేమిని వెంటపెట్టుకొని, కళ్ళ నీళ్ళు తుడుచు కొంటూ టాక్సీ ఎక్కి పతి గృహానికి బయలుదేరింది.

ఇంటికి వచ్చి చూచుకునే వరకు లవంగమంజరి దుశ్చింత త్రిగుణమైంది. బేచారాంబాబు ఈ లెక్క వోవరు కోటు తీసుకువెళ్ళనేలేదు. పిల్లల నలభై జోళ్ళ పట్టు మేజోళ్లూ వరండానిండా పడివున్నాయి. లవంగమంజరి ఏడుస్తో క్షేమితో—"ఎంత శాస్తి జరిగింది నాకు క్షేమీ ? ఈ చలి కాలంలో ఉన్న గుడ్డలన్నీ యిక్కడే వదిలెట్టి పోయారు" అన్నది క్షేమీ.

"అదేమి కలకత్తా పట్టణమా క్షేమీ—డబ్బు పారవేయగానే వస్తువు దొరకటానికి ? కోపించినందుకు నే నెంత తాపపడుతున్నాను!"

లవంగమంజరి ఇక నిలబడలేక శయ్యమీద పోయి వాలింది — క్షేమీ ఆమె పాదాలు వత్త సాగింది.

* * *

బంగళాకు ఎదురుగా గంగ వొడ్డున కూర్చుని బేచారాంబాబు తన జీవితం సింహావలోకనం చేసుకొంటున్నాడు—ఎంత నియమహీన దుఃఖమయ జీవనము! ప్రాణాధికురాలైన పత్ని నేడు విముఖురాలైంది. పది సంవత్సరాల క్రితం వెన్నెల రాత్రిలో—ఈ గంగానదిలో—ఇక్కడే వాలలాడాము ; స్వరంలో స్వరం కలిపి ప్రేమ గీతాలు పాడాము. ఇవ్వాళో—! పెద్దమ్మాయి వంట చేయటానికి పోతే పొయ్యిదగ్గరే నిద్రపోతుంది. పెద్దబ్బాయి వీలుచిక్కిం దంటే చాలు—ఓఢ్రితోటమాలి సహదేవుని పారా పలుగూ తీసుకు వెళ్ళి గంగలో కలుపుతాడు. రోజూ ఉదయం రెండణాల నాన్‌రొట్టె, శేరు మిఠాయి లేకపోతే చిన్నబ్బాయి చిరుతిండి అంటడు. చిన్నమ్మాయి మిణుగురు పురుగును చూడగానే కీచుమంటుంది. రాత్రంతా దోమల సంగీతం,

కప్పల బెకబెకలకూ తెంపు వుండదు. సహదేవ తోటమాలి తన దేశంలో వున్న ప్రేయసిని తలచుకొని ఓఢ్రిభాషలో బిగ్గరగా కలవరిస్తే బేచాబాబు ఉలిక్కిపడి లేస్తాడు. ఇలాంటి విచిత్ర ఉత్పాతాలవల్ల బేచారాం బాబు విసుకెత్తి పోయాడు. ఏకాకిజీవనం అతనికి ఎంతమాత్రమూ సహించటంలేదు. స్టీమరు ఎక్కి ఒకమాటు సుందర వనంలోవున్న జమీందారీని చూచిరావాలనుకున్నాడు. అక్కడి ప్రజలలో కొన్నాళ్ళు వుంటే కాస్త మనశ్శాంతి అయినా కలుగుతుందేమోనని అతని నమ్మకం. బాగా యోచించి ఈ సంకల్పాన్ని చాలాభాగం స్థిరపరచుకొంటూ వుండగా వెనుకనుంచి ఎవరో— "ఎవరు ? బేచారాంబాబుగారా ? నమస్కారం!" అన్నారు.

బేచారాంబాబు తిరిగి చూశాడు. తాల్‌తల్లాలో వుండే విపిన్ చాదరి. వీరు పూర్వం సియాల్‌దహలో టిక్కెటుకలెక్టరుగా వుండేవారు. పాతం. రిటర్న్ టిక్కెట్టు ఒక్కటి అమ్మినందుకు వీరి నౌకరి వూడింది. ఇప్పుడు వుత్తరపాడాలో గొడ్లకు నస్యా తవుడూ కమీషను బేరంచేస్తున్నాడు. వీరిద్దరికీ ఇదివరకే పరిచయం వుంది. బేచారాంబాబు అన్నాడు— "ఆఁ!"

విపినబాబు— "భలే, చాలాకాలానికి కనపడ్డారు. ఉద్యానవాటికకు వచ్చారా ! పరివారంతోటే ?"

బేచారాంబాబు ఉదాసీన ముఖంతో "పరివారంలేదు" అన్నాడు.

విపినబాబు "ఇంటివారు లేరూ? ఇది నాకు తెలియనే తెలియదు ! ఎంత దుఃఖవార్త" అని సానుభూతి తెలిపాడు.

బేచారాంబాబు వేదాంతివలె గంభీరంగా "దుఃఖమెందుకు? ప్రపంచంలో సంయోగ వియోగాలూ దినరాత్రులూ అన్నీ వున్నాయి. అన్నీ మనం సహించవలసిందే" అన్నాడు.

విపినబాబు కాస్త గుటకవేసి "మీరు వేరుగా భావించకపోతే ఒక మనవి చేస్తాను. నాకొక మరదలువుంది. ఇరవై ఒకటో సంవత్సరం. రంగు మా ఆవిడమాదిరిగానే ఎరుపు. కాని కళ్ళు అంతపెద్దవికావు. ఇక తతిమా విషయాల్లో—గ్రహించారు కదండీ—దేవకన్యక ! బీదబ్రాహ్మణ్ణి. మీరుగనుక ఆజ్ఞాపిస్తే—" అన్నాడు.

బేచారాంబాబు గంగ వైపు చూస్తూ, ఈ దేటప్పటి, లవంగమంజరి శరీరచాంచల్యం స్మృతికి తెచ్చుకొని పులకరిస్తూవున్నాడు. విపినుని మాటలు అతని చెవికెక్కలేదు. అన్యమనస్కంగా "చూద్దాము." అన్నాడు.

విపినుడు యింటికి తిరిగివచ్చి ముందు భార్యకూ, తర్వాత అత్తకూ, పిమ్మట అతని మామ జలధరబాబుకూ తానొక పెద్దజంతువును వలలో వేసుకొచ్చానని చెప్పాడు. దీనితోపాటు తన మరదలు బృందరాణిని బుగ్గ గిల్లి కాస్త సరసం ఆడటంకూడా మరచిపోలేదు. బేచారాంబాబునకు రెండో సంబంధానికి యిస్తే పిల్ల ఎంత సుఖపడేదీ మహా రసవంతంగా వర్ణించి కన్యాభారంచే కాతరులై యున్న వృద్ధ దంపతుల అంతరాత్మలను పూరించాడు. వృద్ధ దంపతులు ఆరాత్రి నిద్రపోలేదు. ప్రొద్దు పొడవకముందే జలధరబాబు భార్య, బేచారాంబాబు ఆస్తి పాస్తులు నమ్మకంగా కనుక్కురమ్మని, భర్తను కలకత్తా పంపించింది.

*　　　*　　　*

అనేక దినాలు హరి తంతియిస్తాడని, తంతిప్యూన్ కోసం ఎదురుచూస్తూ వుండటంవల్ల లవంగమంజరి కళ్ళలోని జ్యోతి తగ్గిపోయింది. బేచారాంబాబు మధుర వెళ్ళిన నాటినుంచే నిద్ర మాయమయింది. హరి తంతిరానందుచేత ఆకలికూడా అడుగంటింది.

మంజరి ఎల్లప్పుడూ ఏడుస్తూ వుంటుంది. ఆరోజుకూడా మధ్యాహ్నం ఏడుసూ వుండగా బయట ఎవరో—"ఇది బేచారాంబాబుగారి యిల్లేనా?" అని కేకవేశారు.

మంజరి నిద్రపోయే క్షేమీదాసీని, జుట్టుపట్టుకొని లాగి, మేల్కొలిపి—"క్షేమీ! చూడు, టెలిగ్రాం వచ్చినట్టుగా—"అన్నది.

క్షేమీ క్రిందికిపోయి వచ్చి—"ఎవరో పెద్దమనిషి. వృద్ధుడు. తంతీగింతీ ఏమీలేదు." అన్నది.

భర్తగారి కబురు ఏమైనా తెలుస్తుందేమోనని క్షేమీని వెంటపెట్టుకొని లవంగమంజరి క్రిందికి దిగి వచ్చింది. వృద్ధుని కూర్చోబెట్టి—"తమరు ఎక్కడ నుంచి దయచేశారు?" అని అడిగింది.

"ఉత్తర పాడానుంచి. ఇది బేచారాంబాబుగారి యిల్లేనా? పిత్రార్జితం?" అని అడిగాడు.

"అఁ." అన్నది మంజరి.

"దోవతప్పి కాలిఘాటు వెళ్లాను. ఇల్లు బాగానేవుంది!" అని జలధర బాబు అటూ ఇటూ మెలికలుగా అనేక ప్రశ్నలు వేసి—బేచారాంబాబు చేతిలో పిల్లను పెడితే—బృందరాణి నిజంగా రాణీ అవుతుందని గ్రహించాడు. తర్వాత వెళ్ళిపోయేముందు—"ఇక ముడిపడటమే మిగిలింది." అని గొణుగుకున్నాడు.

ఈమాట లవంగమంజరి విని "ఏమిటి మీరు అన్నది?" అని అడిగింది. జలధరబాబు—"అంటానికేముంది తల్లీ! పెళ్ళియీడుకు వచ్చిన పిల్ల ఒకటి నెత్తిమీద వుంది. మా అల్లుడు విపినుడు బేచారాంబాబు రెండో పెళ్ళి చేసుకొంటాడని చెప్పాడు." అని అన్నాడు.

క్షేమీ దాసినోరు అలానే తెరుచుకుపోయింది. లవంగమంజరి జ్యోతి హీననేత్రాలలో తిరిగి జ్యోతి వచ్చింది. "వారెక్కడ వున్నారు?" అని అడిగింది.

ఉత్తరపాడాలో"—అని పెళ్ళి అయినట్టుగానే భావించుకొని కన్య రాణీకాబోతున్న దన్న సంతోషంతో జలధరబాబు చేతికర్ర టకటక నేల మీద కొట్టుకొంటూ వెళ్ళిపోయాడు.

బేచారాంబాబు మధుర వెళ్ళాలనే మిషతో ఉత్తరపాడా వెళ్ళి చాటుగా పెళ్ళి చేసుకోవటానికి కుట్రపన్నుతున్నాడు! మంజరి బుర్ర కుత కుత ఉడకసాగింది. బేచారాంబాబు ఆదినుంచీ కుట్రదారుడుగానే కనుపించసాగాడు. అనేక విధాల యీ మెను మెట్రిక్యులేషన్ పరీక్ష పాసు కానీయకుండా చేశాడు. నేటివరకు బేచారాంబాబు మంజరీలమధ్య జరిగిన వ్యవహారాల్లో కాస్తో కూస్తో వంచనా, కుట్రా, కపటమూ ఉన్నది. కర్తవ్యమేమిటో మంజరి ఏమాత్రమూ నిశ్చయించుకోలేకపోయింది.

క్షేమీ అన్నది—"ఆలోచించి ఇంకా ఏంచేస్తారు? ఇంకేమీ మించి పోలేదు. మిమ్మల్ని చూడగానే—"

"వారు నాకక్కరలేదు! నా పిల్లలు నాకు చాలు!—మహాదేవ్!"

ఆజ్ఞానుసారము మహాదేవదర్వాను టాక్సీ పిలుచుకు వచ్చాడు.

* * *

చలికాలము. ప్రొద్దు కుంకుతూ వుంది. బంగాళాలో, బేచారాంబాబు శాలువా కప్పుకొని ఈజీచైరుమీద పండుకొని వున్నాడు. ఎదురుగా ఒక కుర్చీమీద విపిన్ చౌదరి కూర్చుని అంటున్నాడు—"అదెట్లాగండి, సార్! వృథాగా ముసలివాడిచేత పద్ధాను గణాలు రైలు ఖర్చు పెట్టించి యిప్పుడు-"

బేచారాంబాబు—"పొరపాటున విని వుంటావు. నేను అలా చెప్పలేదు."

విపిన—"నేనండీ పొరపాటున వినేది? ఇన్నాళ్ళనుంచీ కమీషను బేరం చేస్తూ బ్రతుకుతున్నాను—డోకరాలదగ్గరనుంచి జ్ఞాపకం వుంటుంది. పొరపాటున వింటానూ! స్పష్టంగా చెప్పేసేయండి, వివాహం చేసుకుంటారా లేదా?"

బేచారాంబాబు కణతలు వత్తుకొంటూ—"నన్ను వేధించబోకు బాబూ! ఇలాంటి సంగతులు నాకు బాగావుండవు. నా భార్య జీవించేవుంది—కన్న వారింటివద్ద వుండటంవల్ల ఇంటివారు లేరని చెప్పాను. అసలు ఆవిడే లేక పోయినా రెండోపెళ్లి చేసుకోను, తెలుసునా? ఆవిడతో పద్ధానుగు సంవత్సరాల పరిచయం—ఆమెను వదలి ఇంకో అపరిచితను ఎట్లా పెళ్లాడ తాను!" అన్నాడు.

విపినుడు—"స్త్రీలతో పరిచయం ఏమిటండీ? ఒక్కసారి పరిచయం అయితే అంతా గ్రహించవచ్చు! ఇదంతా మీరు చేసే మోసంలావుంది. ఒక భార్య వుంటే ఏమయినట్టు? ఇంకో వివాహం చేసుకొని యిక్కడే వుంచి పొండి. తిండీ తిప్పలకూ డబ్బు పంపిస్తూ వుంటే చాలు."

బేచారాంబాబు కోపంతో "మీకే చెప్పేది. నా తల పగిలిపోతోంది. నే నిక మీతో మాట్లాడలేను." అన్నాడు.

ఇంతవరకూ తలుపు చాటున నిలబడి లవంగమంజరి భర్తమాటలు వింటూ పశ్చాత్తాపముచే తపించిపోతోంది. ఇక తనను ఆపుకోలేక విపినుని ఎదుటకు వచ్చి నిలబడింది.

బేచారాంబాబు "అరే నీవా!" అని లేవటానికి ప్రయత్నించాడు. కాని మరల ఈజీ చెయిర్లోనే పండుకొని కళ్లుమూశాడు. విపినుడు సంగతంతా గ్రహించి చప్పున దోవపుచ్చుకున్నాడు. పాపం, పదునాలుగణాలు వసూలు చేయలేక పోయాడు. క్షేమీ దాసివల్ల, తల్లి వచ్చిందని విని, పిల్లలు వడ్డించిన పళ్లేలను అవతలపారేసి పరుగెత్తుకొచ్చి ఏడుపు మొహంతో వున్న తల్లిని చుట్టు ముట్టారు. మంజరి ఏడుస్తో అందరిని ఒక్కసారిగా కౌగిలించుకొని పడక కుర్చీలో పండుకొనివున్న బేచారాంబాబుగారి వెలవెల బోయిన పెదవులవంక సతృష్ణ నేత్రాలతో చూడసాగింది.

* * *

ఇద్దరి దృష్టులూ అనేకసారులు కలిసినై. కాని ముందు ఎవరు మాట్లాడేదీ సిద్ధం చేసుకోలేకపోయారు. పూరీలు వడ్డించే నెపంతో—ఇంకా రెండు వేస్తాను—అని సంభాషణ ప్రారంభిస్తే, కార్యం సానుకూలం అవుతుంది—మానహాని కూడా వుండదని ఎంచి లవంగమంజరి పాకశాలలో ప్రవేశించింది...కొంచెం సేపట్లో పూరీలపళ్లెం చేతపట్టుకునివచ్చి చూచింది—ఈజీ చెయిర్లో బేచారాంబాబు లేడు! ఆశంకతో మంజరి హృదయం దడదడా కొట్టుకొంది.

* * *

గంగ వొడ్డున బేచారాంబాబు నిశ్చింతంగా కూర్చుని వున్నాడు—ఇక ఏవిధమైన ఉత్సాహంలేదు—ఈ ప్రపంచం ఇక రసాతలానికి పోయినా వీరికి సంతోషమే. ఇలా ఆలోచించుకొంటూ వుండగా మృదుపదక్షేపంతో ఎవ్వరోవచ్చి వారి ప్రక్కనే చప్పుడు లేకుండా కూర్చున్నారు. ఓరకంటితో చూశాడు—లవంగమంజరి. వారి దేహంలో విద్యుచ్ఛక్తి ప్రవహించింది. అయినా బేచారాంబాబు నోరెత్తలేదు! మంజరి వొంటిమీద షెమీజ్ గానీ బ్లౌజ్ గానీ లేదు, అలానే నిశ్శబ్దంగా కూర్చుని పుష్యమాసపు చలిలో గడ గడ వణకసాగింది. బేచారాంబాబు కనుగొలకులతో అర్ధాంగి అవస్థ చూచి తన శాలువా కొంచెం ఎత్తాడు. కంపిస్తూ వున్న లవంగమంజరి శరీరం అందులోకి వచ్చింది. తర్వాత వారి ఎడమ భుజం మీద మంజరి తలా కుడి భుజం మీద మంజరి చేయీ, ఆటంకాలేమీ లేకుండానే చోటు చేసుకున్నవి.

అప్పుడు గంగలో వెల్లువ బాగా వచ్చివుంది. ప్రవాహానికి వాలుగా నావను వదలి చాలామంది నావికులు బిగ్గరగా కోరస్ పాడుతున్నారు.

జాగ్రత నావికా జాగ్రతరో!
ప్రణయవాహినిలోన వెల్లువా తన్నింది,
ఎటు చూచినా సుళ్ళు దూరంబు పోవాలి,
పడవ ఘట్టిది కాదు భద్రంబురా అబ్బి,
ఎటుల చేరుస్తావో ఎరుగలేకున్నాము,
జాగ్రత నావికా జాగ్రతరో!

విని వొడ్డున వున్న మౌన ప్రాణు లిద్దరు మందహాసం చేశారు. నోటి వెంట శబ్దంకూడా వచ్చింది. ఒకరు అశ్రుగద్గద కంఠంతో పిలిచారు—"లవంగ్!"

రెండోవారు వెక్కిళ్ళతో జవా బిచ్చారు—"బేచారా!"

---

# సంస్కారి.

నేటినుండి—

(క) నిమ్న జాతులసేవ చేయడమే నాజీవనోద్దేశము.

(ఖ) వారల సామాజిక ఉన్నతి కొరకై పాటుపడటమే నాజీవిత లక్ష్యము.

(గ) వితంతువుల దుఃఖవిమోచనమే నా జీవనవ్రతము

భగవంతుడు నాకు సహాయము చేయుగాక!

ఈ నాలుగు ముక్కలూ బిగ్గరగా చదివి శ్రీయుత అనాదిచరణ చక్రవర్తి బి. ఏ. నిర్లక్ష్యముగా సంతకం చేసాడు. తండ్రి స్వర్గీయ శ్యామచరణ చక్రవర్తి. సాకిన్ పగమియా—జిల్లా జసోర్.

కళ్ళజోడు ముక్కుకొనదాకా లాగి సమాజ సంస్కార సమితి వృద్ధ అధ్యక్షుడు—"నేడు గ్రహించిన వ్రతాన్ని ఉద్యాపన చేయగలిగితే, మీ

జీవితము సార్థక మవుతుంది. మీరు ఎప్పుడు బయలుదేరబోతున్నారు?" అని అడిగాడు.

"ఇవ్వాళే. ఇక ఆలస్యం చేయను. మన జాతి దుర్దశ చూస్తూ, యింకా ఓర్పు వహించివుంటం నాబోటివారిపట్ల అసంభవం!"

"ప్రాప్తమ్మ. నీజీవితము వీరందరికీ ఆదర్శముగా ఉండుగాక!" అని అధ్యక్షమహాశయుడు అక్కడ కూర్చొని వున్న ఇతర యువకులవంక చూశాడు.

అనాది నమస్కారం చేసి బయటకు వచ్చాడు.

ఆరోజులలో సమాజ సంస్కారంకోసం పట్టణమంతటా పుట్టగొడుగుల వలె సంఘాలు పుట్టుతున్నాయి. ఇలాటి ఒక సంఘానికి చెందిన కార్యకర్త ప్రచారక పదవులు చిరంజీవి అనాదిచరణ చక్రవర్తి స్వీకరించాడు. క్రిందటి రోజున కాలేజీ స్క్వాయర్‌లో అధ్యక్షమహాశయుని గంభీరోపన్యాసము విని అనాది మనస్సులో జాతిసేవ చేయాలనే భావం ఎగతన్నింది. అదే నేడు ఈపదవీగ్రహణరూపంగా బయటపడింది!

మెస్‌కు తిరిగివచ్చాక అనాదిమిత్రులను పిలిచి—"నాజీవిత స్వప్నాలను సఫలం చేసుకోటానికి వీలు చిక్కించుకొన్నాను; నేను కర్మపథంలో నడవబోతున్నాను. మీరుకూడా నన్ను అనుసరించండి."

తర్వాత యివ్వాళ సాయంత్రం సంఘటిల్లిన ఘటనలన్నీ వివరంగా మిత్రులకు వినిపించాడు.

మిత్రులందరు ఏకగ్రీవంగా—"భలే, నీవు చాలా మంచిపని చేశావోయి! నీవు తప్పకుండా ఆమార్గాన్నే నడువు!" అన్నాడు.

ఒకరిద్దరు మిత్రులు లాపరీక్ష పూర్తిచేశాక వారి మార్గమే అనుసరిస్తామని వాగ్దానంకూడా చేశారు.

అనాది నౌకరు హరిచరణుని పిలిచి టీ తీసుకు రమ్మని ఆజ్ఞాపించాడు. నౌకరు సగం మెట్లు దిగాక అనాది కేక వేసి—"మూలకొట్లోనుంచి తీసుకురా హరీ!" అని చెప్పాడు.

హరిచరణుడు—"అదేమిటి బాబూ! చాకలి మల్లాయి దుకాణంనుంచా?" అన్నాడు.

అనాది గాంభీరస్వరంతో—"ఈవిశాల ప్రపంచంలో చాకలీ మంగలీ అనేవారు ఎవ్వరూ లేరు! అంతా సమానులు. ఒకే స్థలంలో పుట్టి—ఒకే జలము..."

హరి ఉపన్యాసం అంతా వినలేదు. 'అచ్ఛా' అని క్రిందకు దిగివచ్చి సణిగాడు—"బాబుగారి" మూలాన రాత్రి స్నానంచేయాల్సి వచ్చింది."

టీ వచ్చేసరికి అదివరకువున్న పదకొండుమంది మిత్రులలో కేవలం ముగ్గురుమాత్రం మిగిలారు. మిగతావారందరూ తలావొక అవుసరకార్యం వుండటంవల్ల టీ రాకపూర్వమే వెళ్లిపోయారు. ఫలితంగా చాకిలి మల్లాయి దుకాణంనుంచి తెచ్చిన టీ నాలుగు కప్పులు మినహా మిగతాదంతా పైకు కాలవలోకి పోయింది. భావావిష్టుడైన అనాది యిది మాకాడుకూడా.

మూడు ఘంటలవేళప్పుడు రైలుదిగి సూటుకేసు చేతపట్టుకొని అనాది చార్ ఖండీఘాటువద్దకు చేరాడు. రాత్రంతా నావమీద గడపవలసివస్తుందని నావ మొత్తం గుత్తకు తీసుకున్నాడు. నావ చార్ ఖండీ ఘాటుకు చేరేవరకు ప్రొద్దుకుంకుతూవుంది. పల్లెకారిహరీ వచ్చి అనాదిని—"బాబుగారూ! రాత్రికి ఫలహారం చేస్తారా, భోంచేస్తారా?" అడిగాడు.

అనాది ప్రక్కమీద పండుకొని "అన్నమే తింటాను" అని జవాబిచ్చాడు.

"అయితే నాలుగణాలు యిలా పారవెయ్యండి. బజారుకు వెళ్లివస్తాను."

డబ్బు తీసుకొని హరీ వెళ్ళిపోయాడు. హరీ వెళ్ళిపోయాక మన్నాయి పల్లెకారికి తంబాకు జ్ఞాపకం వచ్చింది. వాడు అనాదిని కేకవేస్తున్నట్టుగా "బాబుగారికి పుగాకు అలవాటుందా?" అని అడిగాడు.

"సిగరెట్టు తాగుతాను."

మన్నాయి చటున చేయిచాపి "బాబుగారూ! ఒక సిగరెట్టు దయ చేస్తారూ?" అని అడిగాడు.

అనాది సిగరెట్టు విసిరివేశాడు. సిగరెట్టు ముట్టించి, ఒక దమ్ముపేసి దగ్గుతూ దగ్గుతూ మన్నాయి "పొయ్యి యిసుకమీద పెట్టమంటారా బాబూ?" అని అడిగాడు.

"ఇసుకమీద ఎందుకూ! మీ పొయ్యిలేదూ?" అన్నాడు.

"చిత్తం, వుదికాని మేము పల్లెకారులం కాదూ!" అన్నాడు మన్నాయి.

జాతిభేదాన్ని గురించి తన అభిప్రాయాలు వెల్లడించటానికి చిక్కిన ఈ మొదటి అవకాశాన్ని వదలిపెట్టలేక అనాది ఉపన్యాసం ప్రారంభించాడు:—"పల్లెకారి అయినందువల్ల నష్టమేమిటి? జాతినిబట్టి ఎవ్వరూ నీచులు కారు భాయీ! మిమ్మల్ని మీరే హీనంగా చూచుకుంటారు. అందువల్లనే మీరు హీనులయారు. మీ భ్రమ పోగొట్టటానికే నేను వచ్చాను. నేను బ్రాహ్మణ్ణి! అయితేయేం? ఇవ్వాళ మీపాత్రలో భోంచేసి చూపిస్తాను—పల్లెకారుల చేతి అన్నంతింటే బ్రాహ్మల జాతి పోదని!"

మన్నాయి కళ్ళు పెద్దవిచేశాడు. వాడి నోటివెంట యింక మాటే రాలేదు!

తన ఉపన్యాసం మన్నాయికి బాగా నచ్చినదని వూహించి అనాది ఇకేమీ మాట్లాడకుండా ఉపన్యాసం జీర్ణం చేసుకోవటానికి కాబోలు—మన్నాయికి—అవకాశం యిచ్చాడు.

కాసేపటికి హారూవచ్చి "మట్టిపిడత ఇలా యివ్వరా?" అని అడిగాడు.

"ఎందుకూ?" మన్నాయి అడిగాడు. హారూ—"ఈ రాత్రిపూట ఎవడు తిప్పలు పడతాడు?—అటుకులు ఒక సవాశేరు తెచ్చాను. అవే నాన వేసుకు తిందాము."

మన్నాయి తొంగిచూచాడు. అనాది వెల్లకిలగా పండుకొని నిద్రపోతున్నాడు. మెల్లగా హారూతో "నావ అంటుకోకు — పిడత యిస్తున్నాను. ఎడంగా తీసుకువెళ్ళి యిసుకమీద పెట్టు" అన్నాడు.

హారూ ఆశ్చర్యంతో "ఎందుకనీ?" అని అడిగాడు.

మన్నాయి హారూవైపు మెడకొంచెం చాచి — "బాబు కిరస్తానీ!" అన్నాడు.

హారూ కళ్ళు విప్పుకొంటూ "ఎట్లా కనుక్కున్నా? మెడలో జందెం ఉన్నదిగా!" అన్నాడు.

"అది ఇతర్లకు చూపించటానికే బాబుగారు మన పొయ్యిమీద వంట చేసుకు తినాలంటున్నారు!"

ఈ మాట విన్న తర్వాత హరీ అనాది కిరస్తానీ అని రూఢిచేసుకున్నాడు—"ఇట్లా పడవేయి—ఆ పిడత ఎత్తి నా చేతిమీద" అన్నాడు.

మన్నాయి పిడతయిచ్చి అనాదిని పిలిచాడు. అనాదికి కాస్త కునుకు పట్టుతూవుంది. కేక విని లేచి కూర్చుని—"పొయ్యి వెలిగించావా?" అని అడిగాడు.

హరీ చాలా చిక్కులో పడిపోయాడు. కిరస్తానీ గనుక పొయ్యిని తాకితే పొయ్యికి జాతి పోతుంది. ఇటు బ్రాహ్మణ్ణి గనుక పొయ్యిమీద వంట చేసుకోనిచ్చామా పాపం చుట్టుకొంటుంది! హరీ తన బుద్ధి అంతా ఖర్చుచేసి "ఈ రాత్రికి మేము వంట చేసుకో దలచుకోలేదు బాబుగారూ! ఈ పూటకు అటుకులే తెచ్చాము" అన్నాడు.

అనాదికి వంటచేసుకు తినే అలవాటు ఎప్పుడూ లేదు. అటుకులమాట వినగానే—"సరే, నేను కూడా అటుకులే తింటాను. ఈ రాత్రిపూట చేతులు కాల్చుకునే పని అన్నా తప్పుతుంది!" అన్నాడు.

ఈవిధంగా పొయ్యి జాతిని రక్షించి, హరీ అనాదికోసం తెచ్చిన బియ్యం యిచ్చి అటుకులు తీసుకురావటానికి మళ్ళీ బజారు వెళ్ళాడు.

* * *

మరునాడు ఝాము ప్రొద్దు ఎక్కేవరకు నావ పదమీఘాటుకు వచ్చి అనింది. అనాది చాలా చిన్నతనంలోనే గ్రామం వదలిపెట్టాడు. తర్వాత ఈ మధ్య కాలం—ఇరవై సంవత్సరాలూ — పట్టణాల్లోనే గడపటంచేత గ్రామంలో అతనికి పరిచితు లెవ్వరూ లేరు.

అనాది తండ్రి శ్యామచరణ చక్రవర్తి ముంగేరులో వకాలతు చేస్తూ వున్నప్పుడు, గ్రామస్థులు కొందరు ఆరోగ్యలాభంకోసం వచ్చి నాలుగయిదు మాసాల పాటు తండ్రిగారికి అతిథులుగా ఉంటూ వుండేవారు. కాని అనాదికి వారి పేర్లు బొత్తిగా జ్ఞాపకం లేవు.

చాలాభాగం అడుగుతూ, కొద్దిగా ఊహిస్తూ—ఎలాగయితేనేం అనాది ఇంటికి చేరుకొన్నాడు. దోవను పోయేవారొకరిద్దరు కౌతూహల దృష్టితో యితని వంక చూచి చెవులలో ఏదో గుజగుజ చెప్పుకొన్నారు. అంతేకాని, అనాదిని ఎవరూ ఏవిధమైన ప్రశ్న వేయలేదు. అనాది వంటిమీద ఖద్దరు దుస్తులు వున్నవి. ఈ వేషం చూస్తే పల్లెటూరివారు చాలా భయపడతారు. దీనికి కారణం కూడా వుంది. కొద్దిరోజుల క్రితం గ్రామపంచాయితీ బోర్డు ప్రెసిడెంటు ఒక నోటీసు జారీచేసి—గాంధిగారి శిష్యులతో మాటా మంతీ జరిపేటట్లయితే సర్కారు బహదూరు వారికి కోపం వస్తుందని నిషేధించాడు. గాంధిగారి శిష్యులను కనిపెట్టటానికి కొన్ని కొండ గుర్తులు కూడా యిచ్చాడు.

(అ) వారు నెత్తిమీద తెల్లని ఖద్దరు టోపీ పెట్టుకుంటారు.

(ఆ) వారు ముతక గుడ్డలు ధరిస్తారు. శరీరంమీద ముతక చొక్కాగానీ ముతక దుప్పటిగానీ వుంటుంది.

(ఇ) వారు హిందువులయితే "వందేమాతరమ్"అనీ. మహమ్మదీయులైతే "అల్లాహోఅక్బర్" అనీ కేకలు వేస్తారు.

(ఈ) వారు సభలుచేసి ఉపన్యాసా లిస్తారు. అందరిదగ్గరనుంచీ నాలుగు నాలుగణాల చందాకూడ వసూలు చేస్తారు.

పై లక్షణాలన్నీ కలవకపోయినా అనాదిశరీరంమీద ఒక్క లక్షణం మాత్రం స్పష్టంగా కనపడుతూ వుంది. ఇంతేకాక ఈమధ్య భిక్ష (చందా) కోసం వచ్చిన గాంధీగారి శిష్యుల నడకకూడా ఇదేరకంగా వుంది.

ఎలాగయితేనేం, అనాది వారినీ వీరినీ అడుగుతూ ఇంటికి చేరుకొన్నాడు. ఇంటి చుట్టూవున్న ఖాళీస్థలంలో చెట్లూ చేమలూ అరణ్యం మాదిరిగా పెనవేసుకపోయినవి. ముందువా ఇంటికి రెండువైపుల గోడలుకూడా పడిపోయినవి. ఊడిపోయిన ఇటుకరాళ్లు ఎదురింటివారు మెట్లు కట్టుకోవటానికీ, ప్రక్కయింటివారు గోడ కట్టుకోవటానికీ వినియోగ పడ్డాయి. వంటయింటి పాకావు వేసిన టిన్నురేకు ఒకవైపుది మాత్రం వందలకొలది చిల్లులతో ఇంకా మిగిలివున్నది. రెండవప్రక్కది వృథాగా పాడయిపోతూ వుంటం

చూచి అనాది జ్ఞాతులలోనే ఒకడు తన గోశాలకు ఉపయోగించుకొన్నాడు. ఇంటిచుట్టూ అలవకు మధ్యమధ్యనా వున్న టేకు స్తంభాలలో ఒకటి రెండు స్తంభాలు మాత్రం యింకా జీర్ణావస్థలో మిగిలి వున్నాయి. అలవకు వేసిన వెదురు పుల్లలు గొడ్లకాడ పిల్లలు కర్రలుగానూ, పొరుగింటివారు వర్షాకాలంలో వంటచెరకుగానూ ఉపయోగించుకోవడంవల్ల ఇంతకు చాలా పూర్వమే వాటి స్వరూపంలేకుండా పోయింది.

కొన్నిదినాలు ఇక్కడే వుండి ఇంటిని సంస్కరించాలని సంకల్పించుకొని, అనాది తుప్పుపట్టిన తాళము తెరచి ఇంటిలో ప్రవేశించి చాల శంటాలుపడి బల్ల ఒకటి బయటకులాగి, అర్ధగంటసేపు విశ్రాంతి తీసుకొన్నాడు. తర్వాత స్నానాదికాలు నిర్వర్తించుకోవడం కోసం ఇంటికి దక్షణవైపునున్న చెరువు వద్దకు వెళ్లి పళ్లుతోముతూ కూర్చున్నాడు. ఈ సమయంలోనే వెనుక నుంచి ఎవరో "ఎక్కడనుంచి వచ్చారు బాబూ ?" అని ప్రశ్నించారు.

అనాది తలతిప్పి ప్రశ్నకర్తను చూసి సమాధానం యిచ్చాడు— "కలకత్తానుంచి."

"పేరు ?"

"అనాదిచరణ చక్రవర్తి తండ్రి శ్యామచరణ చక్రవర్తి."

ప్రశ్నకర్త నమలుతూవున్న వేపపుల్ల అవల పారవేసి—"అరే! మీరు మా శ్యామచరణ అన్నాయిగారి పుత్రులా ? స్వగ్రామం వచ్చారా ? భలేభలే !" అన్నాడు.

ఆ గంతకుని అనాది ఎరగడు. ఎవరో ఆత్మీయులే కావచ్చునని భావించి వినయంగా—"చిత్తం. ఇక్కడ కొన్నిదినాలు వుంటాను" అన్నాడు.

"ఇంకేం! మేమున్నాముగా. మమ్మలను పరాయివాళ్ళుగా ఎంచుకోబోకు...కాని అబ్బాయి! అప్పటి కాలమంతా మారిపోయింది. గ్రామంలో వున్న పెద్ద తలకాయలు ఒక్కొక్కటీ అన్నీ వెళ్ళిపోయినై. ఇక ఇప్పుడు వున్నది నేనూ, నటూ నక్కాయీ...మేంకూడా ఇంకా ఎన్నాళ్లు!... మీరింకా నన్ను గుర్తించలా! నాపేరే రసిక ఘోషాల్. మీరు ముంగేరులో వుండేటప్పుడు ఒకటిరెండు మాసాలపాటు మీఇంట్లో వుండి వచ్చాను.

అప్పుడు మీరంతా ? ఇంకా లాగులుకూడా తొడగటంలేదు !" తర్వాత ఘోషాలు మహాశయుడు అనాది తండ్రి అతిథి సత్కారాలను గురించి మహాఘనంగా వర్ణించాడు.

అనాది స్నానంచేసి ఒడ్డుకువచ్చిన మీదట ఘోషాల్ మళ్ళీ—"మధ్యాహ్నం ఇంట్లోనే వుంటా బాబూ! నేనువచ్చి గ్రామస్థితి గతులన్నీ చెప్తాను. ఇక్కడ వుండ దలచుకొంటే చాలా జాగ్రత్తగా మెలగవలసి వుంటుంది" అన్నాడు.

'సరే'నని అనాది ఇంటికి బయలుదేరాడు.

ఫోంచేసిన తర్వాత కూలీలను పెట్టి అనాది ఇంటి ముంగిలి శుభ్రంచేయించాడు. గ్రామంలో నిమ్న జాతుల ఇళ్లు ఎన్ని వున్నవీ, విధవలసంఖ్య ఎంత వున్నదీ, కూలీలనుంచి ఆరా తీసుకున్నాడు. ఇక తర్వాత కార్యం ప్రారంభించాల్సినవంతు. సంస్కారం ఎటునుంచి మొదలుపెట్టాలా, అని ఆలోచిస్తూ వుండగా ఘోషాలు మహాశయుడు వచ్చి—"ఇదేమిటి బాబూ, ఒక్కరోజులోనే అంతా బాగుచేయించారే!" అన్నాడు.

అనాది వారిని కూర్చోబెట్టి—"కొన్నాళ్లు ఇక్కడే ఉండాలనికదూ ప్రయత్నం" అన్నాడు.

"ఆఁ, తప్పకుండా ఉండాలి. కొన్నాళ్ళు ఉండకపోతే అంతా చక్కజేసికోవటం ఎలా ? ఇదే చూడరాదూ, ఘోరము! ఆ గంగరావిచెట్టు పూర్వం మీ హద్దులో వుండేది. ఇప్పుడు నందూ చక్రవర్తి దానిని కలుపుకున్నాడు. ఎక్కువ తకరారుకూడా అక్కర్లా, ఒక్క పిటీషను పారవేస్తే చాలు! వెధవాయి దండాలు దస్కాలుపెట్టి అలవ తీసివేస్తాడు."

అనాది ఏమీ జవాబు యివ్వలేదు.

రసికఘోషాలు మళ్ళీ ప్రారంభించాడు: "ఇదేకాదు. చెరువుకు అవతల ఒడ్డునవున్న వెదురు గుమ్మెలుకూడా అందరు యజమానులే. గ్రామంలో ఎవరికి కాస్త వాసంపుల్ల కావలసివచ్చినా—వాళ్ల తాతసొమ్ము దాచి పెట్టినట్టు—అక్కడికే వెళ్తారు. అటుకూడా ఒక కన్ను వుంచాలి."

"అలాగే" అన్నాడు అనాది.

ఘోషాలు—"వ్యాజ్యం వేయటానికూడా ఎక్కువ శ్రమ పడక్కర్లేదు. మా చెల్లెల్లుడు సోమనాథుడు పెద్ద వకీలు దగ్గర గుమాస్తా. రెండు రూపాయలు పారవేస్తే అంతా వాడే సరిచేస్తాడు—మీ కేమీ శ్రమలేదు. వకాలతునామా మీద సంతకం చేస్తేచాలు. తతిమా తిప్పలు నేనేపడతాను."

అనాది—"సరే!" అన్నాడు.

రసికఘోషాలు చెప్పవలసింది ఇంకా చాలావుంది; ఇంతలో గ్రామస్థులు చాలామంది రావటం మూలాన కట్టివేయవలసి వచ్చింది.

శ్యామచరణ చక్రవర్తి చాలా ధనం సంపాదించి పోయాడని ప్రతీతి. అతని కుమారుడు అనాది చరణచక్రవర్తి బి. ఏ., పాసయి స్వగ్రామం వచ్చాడు. అతనికి గార్డియనులు కూడా ఎవరూ లేరు. అందువల్ల ప్రతివారూ ఆ పదవిని పొందాలనే ప్రయత్నంలో వున్నారు. ఒకరిద్దరు యువకులు మాత్రం ఇతర ఉద్దేశంతో వచ్చారు. వారు కొన్నాళ్ళ క్రిందట ఈ గ్రామంలో 'పదమా నేషనల్ బ్రిటిష్ డ్రామెటిక్ క్లబ్' అనే పేరుతో ఒక నాట్యమండలి పెట్టారు. దానికి హంగులూ అలంకారాలలో కాస్త లోటు వున్నది. ఆ లోటు భర్తీ చేసుకోవటానికి చందా వేయించుకు పోవాలని ఈ యువకుల ఉద్దేశము. అనాది అందరకూ అభివాదంచేసి ఉచిత ఆసనాలు యిచ్చి—"మీ దర్శనభాగ్యం లభించినందుకు చాలా సంతోషం. కాని, నేను ఈ గ్రామం వదలి చాలా దినాలు కావటంచేత అందరి పరిచయమూ—" అన్నాడు.

తరువాత అందరూ తమతమ పరిచయం అనాదికి కలుగజేశారు. శ్యామచరణునితో అందరికీ చాలా గాఢ మైత్రి వుండేదని అనాది తెలుసుకున్నాడు. ఈ గ్రామంలో చుట్టపక్కాలకు తరుగు ఏమీ లేదనికూడా అనాది గ్రహించాడు. వచ్చినవారందరితోనూ అనాదికి సంబంధం వున్నది. ఒకాయన మామయ్యా, ఇంకొకాయన అన్నయ్యా, మరొకాయన కక్కయ్యా, ఇలానే అందరూ...

ఇంతమంది చుట్టాలు వున్నందుకు అనాది చాలా సంతోషించాడు. కాస్త పరిచయం కాగానే ఒకాయన—అబ్బాయీ, నీవు గాంధిగారి శిష్యుడవు కావుగదా?" అని అడిగాడు.

ప్రశ్నించిన పద్ధతి, ప్రశ్నకర్తదృష్టి, కూర్చున్న సభ్యుల కుతూహలం చూచి నిజం సంగతి చెప్పటం బుద్ధిమంతుని లక్షణం కాదని అనాది గ్రహించాడు. ఇంతే కాక ఈమధ్య ఒక కాంగ్రెసు కార్యకర్త, ఏదో పల్లెటూరిలో ఎన్ని చిక్కులుపడి వచ్చినదీ కొన్నాళ్లక్రిందట ఒక పత్రికలో చదివాడు. ఈ సంగతికూడా జ్ఞాపకం రావడంచేత అనాది—"కాదండి. నా పని అంతా వేరు. నే నొక గొప్ప ఉద్దేశంతోటే వచ్చాను" అన్నాడు.

ఆ గొప్ప ఉద్దేశం ఏమిటో తెలుసుకోవాలని అందరికీ కుతూహలం కలిగింది.

"ఆ ఉద్దేశం ఏమిటో చెప్పు బాబూ?" అని ఒక ముసలాయన ప్రశ్నించాడు.

అనాది చిన్న ఉపన్యాసం ప్రారంభించాడు.—"నిమ్నజాతుల ఉద్ధరణ చూడండి. ఈ గ్రామంలో ఎంతమంది మాల మాదిగలూ, ఎరికెల ఏనాదులూ, బెస్తలూ, బండ్లవాళ్ళూ వున్నారో? వారల సామాజిక స్థితి ఎంత హీనంగా వుంది? వారి నందరినీ ఉద్ధరించటమే నా ఉద్దేశము. వారు తాకిన నీరు బ్రాహ్మణులు ఉపయోగించి వారుకూడా మనుష్యులేనని రుజువు చేయాలి."

చివరి మాట వినేసరికి అక్కడ కూర్చున్నవారందరు ఉలిక్కిపడ్డారు. కొంతమంది భ్రష్ట హిందూ యువకులు వర్ణాశ్రమ ధర్మాలను ధ్వంసం చేయటానికై ఉపన్యాసా లిస్తూ తిరుగుతున్నారని ఈమధ్యనే ఏదో పత్రికలో చదివి వున్నారు. ఆ చదివినదానికీ ఈ చెప్పినదానికీ బాగా అతికిపోయింది. కాని అప్పుడు మాత్రం తమ ఉద్దేశాలు, అనాది యెదుట ఎవ్వరూ వెల్లడించలేదు.

దీని తర్వాత అనాది అనేక విషయాలు చెప్పాడు. సాయంకాలం కావటంవల్ల ఒకొక్కరుగా అందరూ వెళ్ళిపోయారు. ఇక మిగిలింది చందాకోసం వచ్చిన నాట్యమండలి యువకులు. వారందరూ—అనాదికి పూర్తిగా సహాయం చేస్తామని నమ్మచెప్పి, అనాదిచేత తమ మండలికి ఒక తొలుదు హార్మోనియం వాగ్దానం చేయించుకొని—వెళ్ళిపోయారు.

అనాది మరుదినంనుంచీ సమాజసంస్కార ప్రయత్నాలు ఆరంభించాడు. ఉదయాన్నే బెస్తలగూడేనికి వెళ్లి అందులో ముఖ్యులందరినీ పిలిచి వారికి తన ఉద్దేశాలు తెలియ జెప్పాడు. బి. ఏ. డిగ్రీ సంపాదించిన మహావిద్వాంసుని మాట లందరూ ఆమోదించారు. తర్వాత వుప్పరపాలెం, చివరకు మాదిగ పల్లెలోనూ ప్రచారం పూర్తిచేసుకొని, అనాది నిమ్నజాతి హిందువులందరినీ కలిపి బ్రహ్మాండమైన సభ ఒకటి ఏర్పాటుచేశాడు.

స్కూల్లో ఎనిమిదో క్లాసు వరకూ చదివి, సరస్వతీదేవి దగ్గర సెలవు తీసుకొని ప్రస్తుతం ఇంట్లో కూర్చొని ఈగలు తోలుతూవున్న యువకులు, ఒకరిద్దరు బెస్తల గూడెంలోనూ వుప్పర పాలెంలోనూ వున్నారు. కులవృత్తి చేయాలంటే వారికి కష్టమే కాకుండా సిగ్గుచేటుకూడా. అందువల్ల సమాజాన్ని ఎలాగయినా ఉన్నతికి తీసుకురావాలనే ఉత్సాహం వారిలో వెల్లివిరుస్తూంది. వారు నియమం తప్పకుండా వారివారి కులపత్రికలు చదువుతూ వుండేవారు. తమతమ జాతివారు పంచాయితీ కూడినప్పుడు—సమయాసమయాలు గుర్తించకుండా—తమ జాతులను అగ్రవర్ణాల వారు ఎంత నీచంగా చూస్తున్నదీ వెల్లడిస్తూ వుండేవారు. కాని ఈ ఉపాయాలద్వారా వారు తమ జాతీయులను ఇంతవరకూ మేల్కొలుప లేకపోయారు. ఇక వీరందరూ అనాది ఉద్దేశము తెలుసుకొని అతనికి భక్తులయారు. సభకు యితర గ్రామాలనుంచి ప్రతినిధులను తీసుకువచ్చే భారమంతా వీరే వహించారు.

సభ కూడటానికి ఇంకా కొన్నాళ్ళు ఆలస్యంవుంది. ఈ మధ్యలో రెండవ కార్యముకూడా సానుకూలము చేసుకోవాలనే ఉద్దేశముతో అనాది నాట్యమండలి మిత్రులను పిలిపించాడు. వారు వచ్చినమీదట అందరూ దీర్ఘంగా చర్చించి వచ్చే ఆదివారము కీచకవధ ఆడవలెనని నిశ్చయించుకున్నారు. పౌరాణిక నాటకం కాబట్టి చాలామంది వితంతువులు నాటకం చూడటానికి వస్తారు. ఈ అదను వృథాపోనీయకుండా నాటకం ప్రారంభించక పూర్వమే విధవా వివాహాన్ని గురించి ఉపన్యాసం ఇవ్వాలని అనాది నిశ్చయించుకొన్నాడు.

కీచకవధ నాటకానికి రిహార్సలు ప్రారంభించారు. ఈ నాటకానికి కావలసిన సామగ్రి తెరలూ నాట్యమండలివారు ఇదివరకే తయారుచేసుకొని వుంచుకొన్నారు. కీచకుడు కూర్చొని, ద్రౌపదితో ప్రేమసంభాషణ జరప టానికి తగిన సోఫామాత్రం యింకా సమకూడలేదు. అనాది ఇంట్లో చాలా సోఫాలూ తివాసీలూ వున్నాయి. వాస్తవానికి అవి చూచినవద్దనుంచే నాట్య మండలివారికి ఈ నాటకం ఆడాలనే కోరిక కలిగింది.

చాలారోజులు పరిశ్రమచేసి అనాది జనన మరణాల రిపోర్టుల సారం తీశాడు. కుమారికలుగానీ విధవలుగానీ దొరకనందువల్ల ఎంతమంది యువకులు అవివాహితులై యున్నదీ వార్తాపత్రికలనుంచి ఎత్తి వ్రాసుకున్నాడు. 'నిరామిష భోజనంవల్ల బుద్ధికీ శరీరానికీ ఎంత ముప్పు వాటిల్లుతున్నది' అనే విషయంమీద విదేశ డాక్టర్ల అభిప్రాయాలూ, సమాజ తత్వజ్ఞుల ఉద్దేశాలూ సంగ్రహించాడు. తర్వాత యీ అన్ని తథ్యాల సహాయంతో పెద్ద ఉప న్యాసం ఒకటి తయారుచేశాడు.

* * *

నాటకం ప్రోగ్రాము ప్రకారం సాయంత్రమే ప్రారంభం కావలసింది. ఊళ్లో సంత ప్రొద్దు కుంకేవరకూ లేపనందువల్ల ప్రేక్షకులు రావటంలో ఆలస్యమైంది. రాత్రి పదకొండు ఘంటలకుగాని స్త్రీలకు ప్రత్యేకించిన స్థలం నిండలేదు. పురుషులుమాత్రం అంతకుముందే వచ్చేశారు. సైడ్ కర్టెనులకు వెనక రాగంతో కలియటానికోసం కాబోలు ఫిడేలు 'టింగ్ టింగ్' అని గొంతు సవరించు కొంటూ వున్నది. ఇంతలో 'ఫటఫట' చప్పట్లధ్వని విని ప్రేక్షకులు చకి తులై చూశారు—అనాది స్టేజీమీదకు వచ్చి నిలబడ్డాడు.

ఉపన్యాసం చదివేటప్పుడు శ్రోతలలో మెల్లగా జరిగే సమాలోచన అనాది బొత్తుగా వినిపించుకోలేదు. కాని, మధ్యమధ్యా ఒకరిద్దరు పోకిరి పిల్లలు 'ఆర్డర్, ఆర్డర్' అని వేసిన కేకలు మాత్రం అనాది చెవివరకూ చేరి నవి. అరవై నిముషాల గంభీరోపన్యాసము పూర్తిచేసి, అనాది కొంచెం తెప్పరిల్లుకునేవరకు గ్రీనురూంలో గోల జరుగుతూ వుంటం విన్నాడు. నాట్య మండలి యువకుల్ని — "ఇక్కడ పోగయిన విధవలంతా పోకిరీలూ బద్మా

షులా! ఘరానా స్త్రీలను పిలిపించి ఈ విధంగా అవమానం చేయడమా ?" అని ఎవరో తిడుతున్నారు.

యువకులుకూడా దీనికి ప్రత్యుత్తరం అశిష్టమైన భాషలోనే యిచ్చారు. క్రమంగా ఇంకొక రిద్దరు శ్రోతలు సీట్లను వదలిపెట్టి ఇందులోవచ్చి కలిశారు. ఇరువైపులనుండీ వాడుకలో లేని భాషలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినై. ఈ సమయంలోనే ఉపన్యాస కాగితాలు చంకనుపెట్టుకొని అనాది హాజరయాడు. ఇతనిని చూడగానే నాలుగువైపులనుంచీ వచ్చిన వాక్యబాణాల ధోరణికి— సహజంగా ఏ వ్యక్తి అయినా ధైర్యం కోల్పోవలసిందే! అనాది ఏమాత్రమూ విచలితుడు కాలేను. కాని అతనికి విస్మయంమాత్రం కలిగింది. అతని సారవంతమైన ఉపన్యాసానికి ఫలితం ఇలా పరిణమిస్తుందని అతను కలలోకూడా ఊహించలేదు! క్రమంగా ఏకపక్షపు తిట్లు సమాప్తమైనవి. పాపం, అనాదికి ఇందులో ఒకమాటకు కూడా జవాబివ్వటానికి శబ్దం దొరకలేదు.

ఈ సమయంలోనే బొగ్గురంగు పిల్లవాడొకడువచ్చి అనాదిని చేయి పట్టుకొని లాగుతూ—" మిమ్మల్ని పిలుస్తున్నారు." అన్నాడు.

ఎవరు పిలుస్తున్నదీ తెలుసుకోకుండానే అనాది బయటకు వచ్చాడు. నాట్యశాలకు వెనకాల పెద్ద చింతచెట్టు ఒకటి వున్నది. దాని క్రీనీడను నిలబడి అనాదికోసం ఎదురు చూస్తున్న స్త్రీ మూర్తి, అనాదిరాగానే సాష్టాంగ ప్రణామంచేసి "దండాలు బాబూ! మమ్మల్ని ఉద్ధరించాలి!" అని మొర పెట్టుకున్నది.

ఏమి ఉద్ధరించాలో తెలుసుకోకుండానే అనాది—" నేను చేయగలిగే టట్లయితే తప్పకుండా చేస్తాను." అని మాట ఇచ్చాడు.

స్త్రీ అన్నది—" ఈ పని తమవల్ల తప్పకుండా అవుతుంది బాబూ! మా పుట్టుకంకను ఒకింటిదాన్ని చేయాలి. ఎనిమిదోయేట ముండామోసి ఇప్పుడు పందొమ్మిదోయేట్లో పాదం పెట్టింది. నేనిక దాన్ని పోషించలేకుండా వున్నాను. ఎవరయినా ఆధారం—"

అనాది అంతా అర్థం చేసుకున్నాడు. అతని ఉపన్యాసం బొత్తుగా వృథా

కాకపోవటం చూసి అతనికి సంతోషంకూడా కలిగింది. "ఆ పని తప్పకుండా చేయవచ్చు. రేపు తీరికగా వున్నప్పుడు మా ఇంటికి రా—అంతా సరిచేసి వేస్తాను. కాని ఈ వ్యవహారం ఈ వూళ్లో జరుగుతుందా అని నాకు సందేహంగా వుంది. మీ ఎరిగిన మంచి పిల్లవా డెవడన్నా ఉన్నాడా—విధవా వివాహం చేసుకోటానికి ఇష్టపడేవాడు ?" అని అడిగాడు.

"ఇక్కడ ఎవరు చేసుకుంటారు బాబూ ? యిదవా వివాహం సాయిబులూ కిరస్తానీలే చేసుకుంటారని భట్టాచారులవారు చెల విస్తున్నారు. హిందవులు చేసుకుంటే పాపమంటగా !" అన్నది ఆమె.

అనాది వ్యంగ్యంగా నవ్వి—"నీవు పో, నేను చూస్తానులే !" అన్నాడు. స్త్రీ నమస్కారంచేసి వెళ్లిపోయింది. అనాదిఇంటికి తిరిగి వచ్చాడు.

సమాజరక్షకుల కోపమంతా నటకులమీద విరుచుకు పడింది. ఉత్తరవేసే పిల్లవాణ్ణి బక్షీ చెవులు మెలిపెట్టి తీసుకువెళ్లాడు. అభిమన్యుడువేసే యువకుకు మేనమామ ఉగ్రనేత్రాలు చూచి ఎప్పుడో తోక ముడిచాడు. ఇంకా యిట్లాంటి అనేక అవాంతరాలవల్ల నాటకం రాత్రి రెండు ఘంటలకు ప్రారంభించబడి మూడు ఘంటలకు భంగమయింది.

మరుదినం సంధ్యాంధకారంలో అనాది చరణుని సంస్కార ప్రయత్నానికి ప్రథమ ఫలితం క్షేమంకరిని తీసుకొని నిన్నటిరాత్రి స్త్రీ హాజరయింది. సంభాషణలో అనాదివాళ్లస్థితి అంతా అవగాహన చేసుకున్నాడు— ఈ అమ్మాయి చిన్నతనంలోనే విధవ అయి ఇప్పటివరకూ ఎలాగో కాలం గడుపుతూ వచ్చింది. ఇక ఆబిడను సంసారిని చెయ్యాలని తల్లి కోర్కె. అనాది అంతా విని—"నేను తిరిగి వెళ్లేటప్పుడు నిన్నూ మీ అమ్మనూ నా వెంట తీసుకుపోతాను. అందాకా మీరు మెదలకుండా వుండండి. ఇంత ముదనష్టపు గ్రామం నే నెక్కడా చూడలేదు. కాస్త బయటికి పోక్కింది అంటే నేను ఇక ఏమీ చేయలేను." అన్నాడు.

తల్లి కుమార్తెలు వెళ్ళిపోయారు.

ఈ మధ్యలో అనాది అనుచరులు సంస్కారసభకు శ్రోతలను సమకూర్చటం కోసం తిరుగుతున్నారు. అనాది ఈ తథా సంహితసాగరాన్ని

మథించి శ్లోకాలు బయటికి తీయటంలో వ్యస్తుడై ఉన్నాడు. పందొమ్మిదో సంహిత కారునితో పరిచయం పూర్తి కాకపూర్వమే—హఠాత్తుగా, ఒక రోజున ఉదయం కోర్టు అమీనా వచ్చి అనాదిచేతికి సమను యిచ్చాడు. సాక్ష్యం సమను తనకు తెలియకుండానే తాను సాక్షి ఎలాగయిందీ అనాదికి అర్థం కాలేదు. సమను తీసికొని తిన్నగా ఘోషాలు మహాశయుని ఇంటికి వెళ్లాడు. ఘోషాలు మహాశయుడు సమను పైనుంచి క్రిందివరకు చూచి—"ఇందులో కష్టమేముంది? చెప్పేసెయి, అది నందూ పోద్దారు హద్దులో లేదని." అన్నాడు.

"అదేల్లా?" అని అనాది అడిగాడు.

"దీనూపోద్దారు వాళ్ళింటి దగ్గరగా వున్న పనసచెట్టున కాయ కోయ బోతే బక్షీగారు అడ్డువచ్చారు. ఇదే ఈ వ్యాజ్యానికి కారణం. బక్షీగారు నిన్ను సాక్ష్యం వేసుకొన్నారు."

అనాది విసుకుడైనాడు:—"నాకివన్నీ ఏమి తెలుసు! అనవసరంగా నన్ను హైరాను చేస్తున్నారు. నేను మీ అందరికీ మేలుచేయాలని వచ్చాను. ఇక్కడవుంటే—"

ఘోషాలు—"హైరాను ఎందుకు? తాలూకా ఇక్కడకు ఆరుక్రోసుల కంటే ఎక్కువ లేదు! ఆరంభంలోనే నీ మంచి మాటలు ఎవరు వింటాడు? రెండుమూడు వ్యవహారాల్లో సాక్ష్యం చెప్పి ఒకటిరెండు దావాలు వేస్తే—అప్పుడూ గ్రామస్థులు నిన్ను గ్రామస్థునిగా ఎంచేది! అప్పుడే వారు నీ మాట వింటారు."

అనాది జవాబు యివ్వకుండానే తిరిగి వచ్చాడు. నాట్యమండలి మిత్రులు సమను చూచి అసలు రహస్యం బయట పెట్టారు. అనాదిని, సాక్ష్యం ఇచ్చే టప్పుడు చాలా అడ్డుప్రశ్నలు వేసి, హైరాను చేయాలని—చండీ మంటపములో ఆలోచన జరుగుతూ వున్నదట. ఈ సభ్యులలోనే ఒకాయన స్వయంగా విని వచ్చాడట. ఇది వినంగానే అనాదికి వళ్లు మండిపోయింది.—"ముందు బెస్తలనూ వడ్డివారిని ఒక కట్టడిచేసిగాని, మీరిపని చెప్పను" అని ప్రతిజ్ఞ చేశాడు.

మహా ఉత్సాహంతో అనాది తాను సంకల్పించిన పనిలో ప్రవేశించాడు. అగ్రవర్ణులు తప్ప మిగతా వారందరూ ఇతని నాయకత్వంక్రింద పనిచేయు టానికి సిద్ధమయారు. సభ రేపేనూస తుంది. సభాస్థలముకూడా యించు మించు అంతా బాగుచేశారు. చాలా గ్రామాలనుంచి, నావమీదా, కాలినడ కనూ, చద్దిమూటలు కట్టుకొని ప్రజలు రాసాగారు. అనుచరుల కార్యకౌశలం చూచి అనాదికి ఆశ్చర్యం కలిగింది. ఇంతమంది ప్రజలు వస్తారని అనాది ఎప్పుడూ ఊహించలేదు. అనుచరులలో ముఖ్యుడైన వడ్డె యువకుని పిలిచి అనాది—"నీవు మాకు చాలా ఉపయోగిస్తావు. నీవు ఇక్కడే ప్రచారం చేస్తూవుండు. నేను కలకత్తానుంచి ప్రతిమాసమూ ఖర్చులు పంపుతూ వుంటాను" అన్నాడు.

యువకుడు నవ్వి—"వీరందరినీ ఇక్కడకు ఎలా లాక్కొచ్చానో ఆ బ్రహ్మదేవునికే తెలియాలి! సభసంగతి చెప్పితే, రావటానికి ఎవ్వరూ ఇష్ట పడలేదు. ఇందువల్ల లాభమేమిటని ప్రతివాడూ అడిగేవాడు. తర్వాత నేనిక అసలు సంగతి చెప్పకుండా, కలకత్తానుంచి గొప్ప పండితుడు వచ్చాడు; పురాణం చెప్తాడు; అని చెప్పితే అందరూ బయలుదేరారు! ఇక మీచేత నైంది మీరు చేసుకోండి" అని అన్నాడు.

సామాజిక ఉన్నతికోసం ఎవ్వరూ రాలేదు. పురాణం వింటానికి అందరూ వచ్చారు; అని తెలిసేవరకు అనాదికి ఆశ్చర్యం కలిగింది. సామాజిక ఉన్నతి ఎంత అవసరమో ఈ మూర్ఖులకూ అజ్ఞానులకూ అసహాయులకూ ఒక పర్యాయం బాగా నచ్చచెప్పాలని అనాది మనస్సులో భద్రపరచు కొన్నాడు.

మరుదినం నిమ్నజాతుల బ్రహ్మాండమైన సభ కూడింది. గ్రామంలోవుండే అగ్రవర్ణస్థులంద సభ చూట్టానికి తమాషాగా వచ్చారు. అనాది సభదగ్గర అంతా చక్కపెట్టుకొని దుస్తులు మార్చటానికి ఇంటికి వెళ్ళాడు. ఈ సమ యాన గ్రామంలోవుండే మహా పండితుడు మాధవ భట్టాచార్యులవారు సభకు దయచేశారు. వారిని చూడగానే బెస్తల కులపెద్ద నితాయిచాంద్ గాభరా పడుతూ లేచి వినయంగా నమస్కారం చేశాడు. పండిత మహాశయుడు

వెటకారంగా నవ్వుతూ—"ఏమోయి పెత్తనగాడా? బ్రాహ్మడివి కాబో తున్నట్టుగా వుందే?" అన్నాడు.

నితాయిచాంద్ నాలుక కొరుక్కొని—"అదేమిటి స్వామీ, మీరు కూడా అలా పరాచిక మాడతారు!" అన్నాడు.

"అయితే బ్రహ్మ సమాజికులలో ఎందుకు కలిశా?" వని పండితు డడిగాడు. బ్రహ్మ సమాజంపేరు వినేసరికి నితాయిచాంద్ ముఖం వాడిపోయింది. ప్రార్థించాడు—"క్షమించండి బాబూ! నాకేమీ తెలవదు. ఇదంతా మా కుర్ర వెధవలు చేసినపని."

తర్వాత చేసిన అపరాధానికి క్షమాభిక్ష యాచించి నితాయిచాంద్ మళ్ళీ వెళ్ళి కూర్చున్నాడు. అరఘంట గడిచాక అనాది వచ్చాడు. అతని తలమీద కావిరంగు సిల్కు తలపాగా, వొంటిమీద కావిరంగు సిల్కు అంగరఖా వుంది. అతని వక్షస్థలాన వున్న యెర్రరంగు పువ్వుమీద తెల్లని దారంతో 'యతో ధర్మస్తతో జయః' అని కుట్టివుంది. వీరిని చూడగానే ఇతని అనుచరులు బిగ్గరగా జయధ్వని చేశారు—"వందే మాతరం" అని. శ్రోతలకు ఈశబ్దం ఉచ్చరించేఅభ్యాసంలేదు. అందుచేత అందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. అనుచరులలో ముఖ్యయువకుడు వీరిచేతకూడా అనిపించాలనే ఉద్దేశంతో—"అందరూ అనండి భాయీ" అన్నాడు.

ఈమాట పూర్తికాయిందో లేదో జనమంతా ఏక కంఠంతో చీత్కారం చేశారు—"శ్రీమద్ రమారమణ గోవింపోహారి, శ్రీ ఆంజనేయవరద గోవిందోహారి!"

తర్వాత అనాది వేదికఎక్కి, మూడుదస్తాల కాగితాలు బయటకుతీసి శ్రోతలకు బాగా నచ్చచెప్ప సాగాడు. ఉత్తేజితుడు కావటంవల్ల ఏమేమో చెప్పేశాడు: నిమ్నజాతులను ఉన్నతికి తీసుకురావటం ముఖ్య అవసరం—బ్రాహ్మల మూలానే మనజాతి ఇంత అధోగతిపాలయింది—శాస్త్రకారులు చాల అన్యాయం చేశారు—ఇత్యాదులు—

పురాణం వింటానికి వచ్చినవారు చకితులయారు. ఒకరిద్దరు లేచికూడా పోయారు. మిగతా వారంతా హుక్కా వేసుకున్నారు.

రెండుఘంటల దీర్ఘోపన్యాసం పూర్తిచేసి అనాది కుర్చీలో కూర్చుని—"నేను చెప్పాలిసిందేమో చెప్పేశాను. ఇక ఉన్నతి పొందటం మీ చేతిలో వుంది. మనం ఉన్నతి పొందిన మీదట చిన్నా పెద్దా భేదాలు వాటంతటవే పోతవి. ముందు అన్నపానీయాలలో అస్పృశ్యత తీసివేయాలి. ఇది తొలగించటమే ముఖ్యం" అన్నాడు.

సభ మధ్యలోనుంచి ఒకడు—"ముందు బ్రాహ్మలూ, బాబులూ ఆ పని చేస్తే మేముకూడా చేస్తాము" అని అన్నాడు.

అనాది లేచి కుర్చీమీద నిలబడి—"సోదరులారా! వినండి. నేను బ్రాహ్మణ్ణి, నేను చేసేది మీరుకూడా చేస్తారా?" అని అడిగాడు.

అనాది అనుచరులు ఏకగ్రీవంగా—"ఆఁ" అన్నారు.

ఏర్పాట్లు అన్నీ ఇదివరకే జరిగివున్నవి.

"నీరు తీసుకురా లోచన్!" అన్నాడు అనాది.

లోచనుడనే పేరుగల వడ్డె పిల్లవాడు నీళ్ళగ్లాసు తీసుకువచ్చి అనాదికి యిచ్చాడు. అనాది ఒక్కగుక్కను నీరంతా త్రాగి—"నాకు నీరిచ్చిన అబ్బాయి జాతికి వడ్డెరి. నేను దోవ చూపించాను. ఇక మీరందరూ నన్ను అనుసరించండి" అన్నాడు.

ఒక్క క్షణంలో సభ అంతా గందరగోళం అయిపోయింది. వెనక నుంచి భట్టాచార్యులవారు—"మ్లేచ్ఛుడు—కిరస్తానీ!" అని కేకవేశారు.

సభలో చాలామంది ఏకకంఠంతో కేకవేశారు—"మోసపుచ్చి జాతి పోగొట్టాలని చూస్తున్నాడు. కిరస్తానీ—బెహ్మజ్ఞానీ!"

అనాది వాళ్ళకు నచ్చచెప్పాలని చాలా ప్రయత్నించాడు. కాని అంతా వ్యర్థమైంది. ఇక విధిలేక సభ వదలి బయటకు వచ్చాడు. అతని బుర్రలో నిప్పుకణాలు భగభగ మండుతున్నాయి. సంకల్పం భంగం కావటంవల్ల హతాశుడై ఇంటికి వచ్చాడు. తరువాత సభలో ఏమి జరిగిందీ తెలుసుకోవాలనే కోరికకూడా అతనికి కలుగలేదు.

సాయంకాలం లోచనుడు నెత్తుటితో ముద్దఅయి కళ్ళవెంట నీరుకారుస్తూ అనాది ఎదుటకు వచ్చి నిలబడ్డాడు. అనాదికి నీరు ఇచ్చిన నేరానికి వాడు

చెప్పులతో పావుకోళ్లతో బెత్తాలతో అనుభవించిన శిక్షకు గుర్తులు చూపిస్తూ ఏడువసాగాడు. అనాది వాడికి అయిదురూపాయలు యిచ్చి పంపివేసి—పెట్టేబేడా సర్దుకో నారంభించాడు. ఇంత పరిశ్రమా, ఇంత ప్రియత్నమూ, ఇన్ని ఉదార సంకల్పాలూ వద్దరిలోచను ఒక లోటా నీటిలో కలిపి—మరుదినం అనాది గ్రామం వదిలిపెట్టాడు.

అనాది ఎక్కిన నావ గ్రామం తూర్పు ప్రక్కకు రాగానే, అకస్మాత్తుగా ఎవరో కేకలు వేయటం విని—నావపైకి వచ్చి అనాది చూచాడు చేతిలో మూటలు పట్టుకొని క్షేమంకరీ, క్షేమంకరి తల్లీ నిలబడివున్నారు.

క్షేమంకరి—తల్లి "మమ్మలను ముంచి మీరొక్కరే ఎక్కడికి వెళ్ళుతున్నారు బాబూ?" అని అడిగింది.—"ఊతపా వచ్చినప్పుడు తీసుకు వెళ్లతాను" అన్నాడు అనాది. "మీ మాటలు నమ్మే మేము మాకున్నది కాస్తా అయినకాడికి తెగనమ్మి..." తల్లిమాటకు అడ్డువచ్చి క్షేమంకరి—"అమ్మా! నీకు తెలియదటే, భావిలోదించి తాడు తీయడం అంటే ఇదేకామా! ఇంత ప్రపంచంచూశావు. ఇంకా బుద్ధి రాకపోతే అన్నది.

ఈ కుత్సిత పరిహాసం విని అనాది స్తబ్ధుడయాడు వెంటనే నావలోకి పోయి నావికునితో—"నావ పోనీయి!" అన్నాడు.

కర్కశస్వరంతో ఒడ్డునుంచి వచ్చే మాటలను అతను చెవి దూరనీయలేదు. నావ కొంచెం దూరంపోయాక అనాది బయటుకు వచ్చి "ఈ అమ్మాయి ఎవరో ఎరుగుదువా?" అని నావికుని అడిగాడు.

నావికుడు మందహాసంచేస్తూ—"తమరు ఎరుగరూ బాబుగారూ! భట్టాచార్యులవారి అమ్మాయి!" అన్నాడు. అనాది చకితుడై—"ఎట్లా?" అని అడిగాడు. "దాని అమ్మ భట్టాచార్యులవారి దగ్గరే పనిచేస్తూ వుండేది వడ్డది."

అనాది మాట్లాడకుండా అలానే కూలబడ్డాడు.

అనాది యిప్పుడు మాస్టరీ చేస్తున్నాడు. కాని సమాజ సంస్కారం చేయాలనే పిచ్చి ఇతనికి యింకా పోలేదు. అందువల్లనే ఇతను ప్రతి ఆదివారమూ కలకత్తాలో ఏదో ఒక పార్కులో ఉపన్యసిస్తూకనపడతాడు! ప్రచారకులు లేకపోవడంవల్ల వాళ్ల సమాజ సంస్కారసమితే అంతరించిపోయింది.

# ఆఖరు పేజీ

సరిగ్గా జ్ఞాపకం రావటంలేదు కాని, ఆ రోజున ఉదయం లేవగానే మా ప్రక్క ఇంటి నౌకరు గోపీవల్లభుని ముఖం చూచినట్టుగా గుర్తు. గోపీవల్లభుడు ప్రేమజీవి అని నాకు తెలుసు. వాడు ప్రతిరోజూ రాత్రి పన్నెండు ఘంటలకు తన ఆఖరు డ్యూటీ— అంటే ప్రభువు పాదాలు వత్తి నిద్రపుచ్చే పని తీర్చుకొని—మా గల్లీకి చివరనున్న పాడుబడ్డ ఇంటి అరుగుమీద కూర్చుని భైరవిలో ఎత్తుకుంటాడు—

'ప్రణయమున మతిచెడిన బైరాగినైతి—'

బహుశ ఈ కారణంవల్లనే కావచ్చు—లేక దీనికి తత్సమమైన ఇంకో కారణమైనా వుండాలి—ఏదీ లేకపోతే ఆ రోజున నేను నాల్గు ఝాములూ ప్రేమ సంబంధమైన విషయాల్లో చిక్కుపడవలసి వచ్చేదికాదు.

మొదటి ఝామున మా మిత్రుడు యామినీకాంతుని దగ్గరనుంచి వుత్తరం వచ్చింది—ఆతని భార్యను రెండు మూడు రోజులలోపలే తీసుకు రావాలట. ఎందుకంటే—పుష్యమాసం మంచిది కాదు, మాఘంవరకూ ఆగలేడు. అంతవరకూ హోటలు తిండితింటే శరీరంకూడా చెడుతుంది. ఇంతేకాక— పోనీండి ఆ సంగతి అనవసరం — అసలుసంగతి పైసా కావాలి.

యామినీకాంతుని భార్యను తీసుకురావటానికి ఖర్చులు కనీసం యాభై రూపాయలన్నా తంతిద్వారా పంపాలి. చాలా జరూరుపని కాబట్టి నేనే స్వయంగా పోస్టాఫీసుకు బయలుదేరాను. మూలతిరగంగానే రిక్షావానితో ఢీకొని—మారు మాటలేకుండా నేలమీద బోర్లగా పడ్డాను. కాలి చర్మమూ, బూటుతాడూ, కొద్దిగా తెగిపోయింది.

రెండోఝామున టెలిఫోనుద్వారా 'దీపశిఖ' సంపాదకుడు వారి పత్రికకు ఒక ప్రేమకవిత్వంపంపమని ఆదేశించాడు. దక్షిణపువైపు కిటికీ తెరచి, కొన్ని కొన్ని పుష్పించిన పూలతొట్లూ వరండాలో అలంకరించుకొని, కలం కొరుకుతూ అటువైపు చూస్తున్నాను. మనస్సులో ఏమాత్రమూ రససంచారమూ కలగలేదు. చాలాసేపు వ్యర్థప్రయత్నంచేసి ఆఖరుకు కోపంవచ్చి వ్రాశాను—

"పిన్ననాటినుండి ప్రేమతో నెవనికి
ఎలుకపిల్ల స్నేహ మరసిచూడ,
అట్టివానినుండి ప్రణయకవిత్వంబు
గోరువారుమూఢ—"

గీతం పూర్తిచేయటానికి మంచి శబ్దంకోసం ఆలోచిస్తూవుండగా, వాకిట్లో టక టక బూట్ల చప్పుడూ తర్వాత పిలుపూ వినబడింది. వరండాలోకి వెళ్లి చూచాను — మా పేటలోవున్న 'యంగ్ మెన్స్ క్లాజికో రొమేంటిక్ డిబేటింగ్ క్లబ్' జంట శక్రటరీలు, కన్నాయీ శశధరుడూ! కూర్చోమంటే వాళ్ళ ఉపన్యాసం వినవలసి వస్తుందనే భయంతో వరండాలోనుంచే— "ఇంత హఠాత్తుగానా?" అని అన్నాను.

"క్లిష్టసమస్య. మీ మాంసకోసం వచ్చాము." అన్నాడు కన్నాయి.

వారానికి రెండు మూడుసార్లు వీరికి క్లిష్టసమస్యలు రావటం, దానికి ఫలితంగా నేను ప్రతివారమూ హోంలైబ్రరీ పుస్తకాలు తిరగవేయటం జరుగుతూ వుంటుంది. అందువల్ల సమస్యసంగతి వినగానే నేను కొంచెం ఉద్విగ్నుడనై, భయపడుతూ "ఏరకం సమస్య, రాజనైతికమా?" అన్నాడు.

కన్నాయి అన్నాడు—"ఉహుఁ, ప్రేమనైతికం!"

నా ప్రాణాలు కుదుటబడ్డాయి. ప్రేమసంబంధంలో నేను విశేషజ్ఞుడను కాను—దీనికి సంబంధించిన గ్రంథాలుకూడా నాదగ్గరలేవు. అందుకని సాహసించి—"భేష్! సమస్య ఏమిటో కానీయండి." అన్నాను.

'ప్రేమఉన్నదా లేదా? ఉంటే దానికి పాత్రా పాత్రలు ఉన్నవా లేవా? ప్రేమకు గడువెంతకాలం? అంటే—"కన్నాయి చెప్పుకుపోతున్నాడు.

ప్రశ్న ఇలా రబ్బరుమాదిరిగా సాగిపోతుందని గ్రహించి మధ్యనే అడ్డుతూ—"ఇందులో సమస్య ఎక్కడ? తిన్నగా భవకాంతదాదా దగ్గరకు వెళ్ళి అడగండి" అన్నాను.

కన్నాయి—"చూడండి, రేపే మా డిబేట్—"

''నిజమే; ప్రేమసంబంధంలో భవకాంతదా మాదిరి[illegible]రటి ఈ పేటలో ఎవ్వరూ లేరు!''—అన్నాను.

"ఆసంగతి తెలుసు. వారు మాకు సమాధానమే చెప్పిస్తా!" అన్నాడు కన్నాయి.

"సమాధానం చెప్పించటం కూడా నేర్చుకోవాలి. మీరిక పొండి. సాయంత్రం అందరమూ కలసి వారింటికి వెళదాము. ప్రశ్నలుకూడా రాసుకు రండి." అన్నాను.

కన్నాయీ శశధరుడూ వెళ్ళిపోయారు.

* * *

సాయంకాలం శశధరునీ కన్నాయినీ వెంటబెట్టుకొని భవకాంతదా ఇంటికి వెళ్లి తలుపుతట్టాను. లోనికిరమ్మని ఆహ్వానం వచ్చింది.

ఇంట్లో ప్రవేశించాము. భవకాంతదా పడకకుర్చీలో వెల్లకిలాపండుకొని కునికిపాట్లు పడుతున్నాడు. కళ్లు తెరచి మా వంక చూచి—"హఠాత్తుగా"? అన్నాడు.

"అవసరంకూడా హఠాత్తుగానే కలిగింది." అని నేను జవాబిచ్చాను. భవకాంతదా ఈజీచెయిరులో తిన్నగా కూర్చుని—"అంత జరూరీపని కాక పోతే చెప్పండి—దాసీది నాలుగు కప్పులు టీ తీసుకొస్తుంది." అన్నాడు.

కన్నాయీ శశధరుడూ ఏకగ్రీవంగా—"అంతహంగామా అవసరంలేదు, మేము కొన్ని ప్రశ్నలు రాసుకొచ్చాము, వాటికి జవాబులు చెప్పించుకొని వెళ్ళాలి." అన్నారు.

భవకాంతదా తిరిగి ఈజీ చెయిరులో వెల్లకిలాపండుకొని నావైపుచూస్తో— ''ఇది ప్రశ్నలకు జవాబిచ్చే సమయంకాదు—స్వప్నాలుచూచేది!" అన్నాడు.

"వేళగానివేళను వచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టుతున్నందుకు నాకూ చాలా కష్టంగానేవుంది. కాని ఏమి చేయను? రేపే యీ పిల్లలసభ— అందులో ప్రేమకు సంబంధించిన చాలా గూఢ విషయాలమీద చర్చజరుగుతుంది. అనేక విషయాల్లో మీ అభిప్రాయం తెలుసుకోవడం అవసరం. కారణం—" అని నేను నచ్చుకొట్టాను.

భవకాంతదా అంటున్నాడు— "కారణం, ప్రేమ సంబంధంలో నేనొక స్పెషలిస్టుననే నమ్మకం మీకు వున్నది. మీకేకాదు అనుకూల తాత య్యకుకూడా యిదే నమ్మకం! ఆ రోజున అవ్వతో పోట్లాడి—పోనీండి, అగోలంఎందుకు—ముందుప్రశ్న లేమిటో చెప్పండి, విందాము."

శశధరుడు కాగితంతీసి చేతికిచ్చాడు. భవకాంతదా చదివి అన్నాడు— "ప్రశ్నలు ఏమాత్రమూ క్లిష్టమైనవి కావు! కాని నేనొకమాట అడుగుతాను అబ్బాయీ! మీవంటి పనికాయలు ఇటువంటి గూఢవిషయాలు తీసుకొని బుర్రలు చెడగొట్టుకోవడం ఎందుకు?"

శశధరుడు అన్నాడు—"ఏదో ఒక సబ్జెక్టువుండాలిగా? ఏదీ లేకపోతే డిబేటింగ్ క్లబ్బే ఎగిరిపోతుంది! పాలిటిక్స్ చర్చిద్దామా—అర్డినెన్సు! లాఠీ, కుస్తీ, కత్తీ, సాములనుగురించి వాదిద్దామా—సి. ఐ. డి! అస్పృశ్యతను గురించి గానీ, శాస్త్రిలను గురించిగానీ తర్కిద్దామా సంస్కృతం తెలిసి వుండాలి! అందుకనే—"

ముఖంమీద కాగితం పెట్టుకొని భవకాంతదా అరశయనావస్థలో వున్నాడు. శశధరుని మాటలువిని తిన్నగా లేచికూర్చుని గద్దిస్తూ—"ఇక ఏమీ చర్చించటానికి వీలులేకపోతే ప్రేమను తీసుకొని లాగులాడతారా? ప్రేమ మీరనుకొన్నంత చౌకరకం వస్తువుగాదు! ఇదొగొప్ప సార్వజనిక విషయం—" అన్నాడు.

శశధరుడు అడ్డుతూ:— "కొంచెం ఆగండి, మేము నోటు చేసు కుంటున్నాము. కన్నాయీ—" అన్నాడు.

కన్నాయి నోటుబుక్ తీశాడు.—"భవకాంతదాగారి అభిప్రాయం—" అని వ్రాసాను.

భవకాంతదా చెప్పసాగాడు— "ప్రేమఉన్నది. కాని అదొకనిషా! గంజాయీ, నల్లమందూ, మదకులవలె యిది కాస్త తేలిక రకపు మత్తుద్రవ్యం. పై వస్తువుల మాదిరిగా ప్రేమనుకూడా సేవించినట్లయితే మత్తు కలుగుతుంది. గాడిద గుర్రం లాగానూ, పెంకుటిల్లొంప తాజ్‌మహల్ మాదిరిగానూ, మురుగుకాలువ భాగీరథివలెనూ కనిపిస్తుంది."

ఇంతవరకూ చెప్పి భవకాంతదా మళ్ళీ వాలుడు కుర్చీలో పండుకున్నాడు. ఇక వీరు చెప్పే ధోరణిలో లేరని గ్రహించాను. శశధరుడు హతాశుడై నా వంక చూచాడు. భవకాంతదాగారి మాటకు ఎదురు చెప్పంది వారినుంచి ఏమాటా మనం లాగలేమని నాకు తెలుసు. అందువల్లనే శశధరుని అభిప్రాయ సిద్ధికోసం—“ భవకాంతదా చెప్పాడు—మనం విన్నాము. కాని నమ్మకమే కలగటం లేదు!” అన్నాను.

“ నిజంగా ?”— అంటూ భవకాంతదా మరల కుర్చీలో తిన్నగాలేచి కూర్చున్నాడు— “అలాగయితే మీకు ప్రేమతో పరిచయమే కలుగలేదు. ఆ పదార్థము మొదటిసారి మనమీద ఎంత భయంకరంగా విరుచుకొని పడు తుందో, దాని అనివార్యఫలితం—మత్తు— ఎంతవరకు ప్రాణాంతకమైందో, తెలిసి వున్నట్లయితే పిల్లల మాదిరిగా నా మాటలు అవిశ్వసించరు!—అయితే వింటారా ?” అన్నాడు.

మా కోరిక నెరవేరింది. కన్నాయీ శశధరుడూ—“ చెప్పండి.” అని బ్రతిమాలారు.

భవకాంతదా—“ పనికాయలు ! మీ బోటివాళ్లు వినటం మంచిదికాదు. ఇది వొక థియరీకి భాష్యం అనుకొని వినండి.” అని తర్వాత నావైపుచూచి అన్నాడు—“ మా ఏడోనంబరు ఇల్లు చూచావుకదూ ? పిట్టగోడ వున్న మేడో. ఈ గల్లీకి చివరవున్నదే—”

అందరమూ ఎరుగుదుము అన్నట్లుగా తలలు ఊపాము. భవకాంతదా మరల చెప్పసాగాడు—“ సరే! వినండి. ఇరవై సంవత్సరాల క్రిందట సంగతి. మా అమ్మా నాయనా, ఈసంసారిక ఝంఝాటాలకు రాజీనామా యిచ్చి కాశీవాసం చేస్తున్నారు. నేను ఒంటరిగా నౌకరునూ వంటబ్రాహ్మణ్ణీ పెట్టు కొని కలకత్తాలో సంసారం సాగించాను. మా మొదటి వదినె అప్పుడు ‘వస్తాను, వస్తాను’ అంటోవుంది. పరీక్ష తప్పుతాననే భయంతో శాస్త్ర రీత్యా క్రతువు జరిపి తీసుకురాలేదు. వైశాఖమాసం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాను.—సరిగ్గా ఎదురు చూస్తున్నా నంటానికికూడా వీలు లేదు—అప్పుడు పెళ్ళి చేసుకోవాలనే కోరికకూడా అంతగాలేదు నాకు!

మూడో అంతస్తులో కూర్చుని అభిజ్ఞాన శాకుంతలమూ, మేక్ బెత్తూ, పేర డైజ్ లాస్టులతోనే కాలం గడుపుతున్నాను. ఈరకం జీవితానికే నేను అల వాటుపడిపోయాను. ఇంకో క్రొత్తప్రాణివచ్చి నామీద కొంచెం జాగ్రత్త తీసు కుంటుందని ఊహి స్తేనే—సహించలేకుండా వుండేవాడిని.

ఒకరోజున నౌకరువచ్చి నన్ను క్రిందకు రమ్మని పిలిచాడు. ఎవరో ఇల్లు అద్దెకు కావాలని వచ్చారట. ఇల్లు ఖాళీగానేవుంది. క్రిందకుదిగి చూచాను —హాల్లోవున్న చైరులో ఒక పెద్దమనిషి కూర్చుని వున్నాడు. వీరికే ఇల్లు కావాలట.

"పరివారంతోనే వుంటారా ?" అని నేను ప్రశ్నించాను.

ఆ పెద్దమనిషి చాలా వినయంగా జవాబిచ్చాడు—"పరివారం ఎక్కువ లేదు. నేనూ, నా చెల్లెలూ, నా—"

నేను మధ్యలోనే—"ఎన్నాళ్ళుంటారు ?" అని అడిగాను—"ఇందులోనే వుండిపోవాలని మా ఉద్దేశం."

"అద్దె ముఫ్ఫై !" అన్నాను నేను.

పెద్దమనిషి జేబులోనుంచి పదిరూపాయల కాగితాలు మూడుతీసి మేజా బల్లమీద పెట్టి—"మణిమోహన్ చౌధరి పేరుతో జమకట్టుకోండి. ఎల్లుండి వస్తాము" అన్నాడు.

* * * *

అద్దెవాళ్ళు ఏడో నంబరు ఇంటికి ఎల్లుండి వచ్చారో ఏడు రోజులున్నాక వచ్చారో నేను గమనించలేదు. ఒక రోజున నేను మిద్దెమీద పచారు చేస్తూవుండగా హఠాత్తుగా గానం వినపడింది. ఏడో నంబరు మిద్దె వైపుకు చూచాను—మూడడుగుల ఎత్తు పిట్టగోడ—నాకేమీ కనిపించలేదు. కాని నేను ఆ పాడేది స్త్రీ అనీ, చాలా అందంగా వుండవచ్చునీ ఊహించాను.

నాకు సంశయం కలిగి—"మీ రిలా ఆధారంలేకుండా ఊహించటానికి కారణం ఏమిటి భవకాంతదా ?" అని అడిగాను.

భవకాంతదా ఉత్తేజితుడైనాడు:—"వ్యుత్పత్తికి కూడా కారణం ఏమీ వుండదు! మీకెందుకు వినండి.—అంత చక్కని స్వరము నా జీవిత

ములో ఎప్పుడూ వినలేదు. నేను అనలానే స్తంభించిపోయాను. కానేపటికి గానము ఆగిపోయింది. నేను మాత్రం అక్కడ నుంచి కదలలేక పోయాను. నోరు తెరచుకొని అలాగే ఏడో నంబరు మిద్దె వైపుకు చూస్తున్నాను. అయిదారు నిముషాలు గడిచాక ఒక మాదూ, పిమ్మట నొక్కుల నొక్కుల వెంట్రుకలూ, ఆతర్వాత తలతో సహా ముఖమూ కనపడింది.—స్వరంమాదిరిగా రూపంకూడా అద్భుతమైనది. దాన్ని నేను వర్ణించను! ఆ రూపసి ముని వేళ్ళమీద భారంవేసి పిట్టగోడ మీదకు వంగి మా మిద్దె వంక చూచింది —మా మిద్దెల మధ్య ఎక్కువదూరంకూడా లేదు, చాకలి మాధాయి పెంకుటి కొంపమాత్రం వుంది అడ్డు.—ఇద్దరి దృష్టులూ కలిసినవి.

నేను లజ్జచే ముఖము త్రిప్పుకొని క్రీగంటితో ఒకసారి చూచాను. అవతల మిద్దెమీద లజ్జ నామమాత్రానికి కూడాలేదు.—

"క్రొత్తగా వచ్చారా?—పేరేమిటి?" అని నేనడిగాను.

అతి మధురస్వరంతో జవాబు వచ్చింది—"నళిని," అని.

నాకు ఇక ఎక్కువ వివరాలు అడగటానికి ధైర్యం లేకపోయింది. రెండు మూడు మాటలు అయినట్టూ పోయినట్టూ మాట్లాడి గదిలోకివచ్చి మాక్ బెత్ తెరిచాను. ఒక్క పేజీకూడా చదవటానికి మనసు పోలేదు. గొగ్గుల గొగ్గుల వెండ్రుకలూ, నోరు వూరించేముఖమూ కళ్ళముందు నృత్యంచేయ సాగాయి.

ఈ సమయంలో కన్నాయి కిసుక్కున నవ్వి శశిధరుని గిల్లాడు. నేనిది కనిపెట్టి కన్నాయివంక కోపంతోచూచాను. వాడు మరల గంభీరంగా కూర్చున్నాడు. ఈ మధ్యలో భవకాంతదా సిగిరెట్టుకు అగ్నిసంస్కారం చేశాడు. బాగాపీల్చి ముక్కుగుండా పొగవదులుతూ మరల చెప్పటం సాగించాడు—"పరిచయం కావటానికి ఎక్కువరోజులు పట్టలేదు. మరుదినం మధ్యాహ్నం నేను క్రిందిహాల్లో కూర్చొని వుండగా, పదహారేళ్ల కుర్రవాడొకడు షెల్లర్ సూటువేసి, చంక పుస్తకాలు పెట్టుకొని—బడినుంచి తిరిగి వస్తున్నాడు కాబోలు—రోడ్డుమీదుగా వెళ్లుతున్నాడు. కిటికీగుండా అతనిని చూచి చకితుడ నయాను. నెత్తిమీద స్ట్రాహేట్ వుండటంవల్ల జుట్టు కనబడటంలేదు. కాని ముఖంమాత్రం అచ్చంగా నళినికివలే వుంది!

పిలిచాను. అతడు ఇంట్లోకి రాగానే చేయిపట్టుకొని దగ్గరకులాగి—"నీవు మా ఏడో నంబరు ఇంట్లోకాదూ వుండేది ?" అని అడిగాను.

కుర్రవాడేమీ తొణకకుండా—"ఔను. ఎందుకో చెప్పండి" అన్నాడు.

నేను కాస్త నవ్వి—"మేడమీద పాడే ఆవిడ—" ప్రశ్న పూర్తిచేయ టానికి సిగ్గు అడ్డు వచ్చింది.

కుర్రవానిముఖం కందగడ్డ అయింది.—"అక్కయ్య. మేము కవలలం."

నేను కొంచెం సాహసించి—"మీ అక్కయ్యతో చెప్పూ—ఆమె గానం నాకు చాలా బాగుంటుందని" అన్నాను.

కుర్రవాడు తలవంచుకొని నవ్వుతూ "అలాగే" అన్నాడు.

* * *

గానం విన్నతరువాతసంభాషణా, అటుతరువాత నాప్రేమనివేదమూ, నళిని కౌతుక హాస్యంతో నాప్రేమను గ్రహించడమూ, ఇత్యాది చారవ గలిగించే విషయాలు ఒకవారంలో జరిగిపోయాయి. మధ్యాహ్నం నళిని కనపడేది కాదు.—నళినికి పిన్ని ఎవరో వున్నారట, ఆమె వుదయంవచ్చి వంటా గింటా వండి మధ్యాహ్నంఅంతా ఇంట్లోనేవుండి సాయంత్రం వెళ్లుతుందట. అందు వల్లనే మధ్యాహ్నం మిద్దెమీదకు రావటానికి వీలుకావటంలేదని నళిని చెప్పింది. ఒక్క సాయంకాలం తప్ప, మా యిద్దరకూ, కలుసుకోవటానికి వీలు చిక్కేదికాదు. నేను ఉదయంమొదలుకొని సాయంకాలం వరకూ— దీర్ఘరోగి పథ్యంకోసం ఎదురుచూస్తున్నట్టుగా—చూచేవాణ్ణి. ఆప్రతీక్షలో ఎంత తీవ్రతవుందో చెప్పి . నేను ఇప్పుడు మిమ్మలను నమ్మించలేను ! పగలంతా మేడమీద పండుకొని, ఇంకోమేడమీది పదధ్వని వింటంకోసం చెవులు రిక్కించి వుంటం, చాకలి మాధాయి మాకేడు వృక్షంనుంచి కాయ క్రిందపడితే ఎగిరిపడిలేవటం, అదీ ఒకటీ రెండూ రోజులు కావు—నిండు అయిదుమాసాలు ! ఇటువంటి సంగతులన్నీ అనుభవంమీద తెలుసుకోవల సిందే కాని, చెప్పితే అర్థంకావు.

ఈ సమయంలోనే శశధరుడు దీర్ఘనిశ్వాసం ఒకటి విడిచాడు. పిళ్ళ పక్కిఇంట్లో అద్దెకున్న ఒకావిడ కృపవలన, వీడు మూడుసారులు బి. ఏ.

తప్పాడని విన్నాను. శశధరునికి మళ్ళీ రోగం తిరగబెట్టిందని గ్రహించాను. భవకాంతదా తన ప్రథమ ప్రేమానుభూతిని ఇలా రసవత్తరంగా చెప్పుకు పోతే, పాపం, శశధరుడు విపత్తులో పడతాడని యోచించి—"సమావేశానికి ఇంకా ఎంత వ్యవధివుంది, భవకాంతదా ?" అన్నాను.

భవకాంతదా సిగరెట్టును మండించ ప్రయత్నిస్తున్నట్టుగా పీల్చి అన్నాడు —"దగ్గరకు వచ్చేసింది, వినండి !— నేను మాటలతో ప్రేమను నివేదించటం, ఆమె గ్రహించటంతో నాకు తృప్తికలగలేదు. మంచి మంచి తినుబండారాలూ, ఫలాలూ, మిఠాయీలూ నేనెప్పుడూ ఒంటరిగా తినేవాడిని కాను. నా వంతులో పన్నెండణాల భాగంతీసి రుమాలులో కట్టి యథాస్థానానికి విసిరివేసేవాడిని. నళిని అన్న ఒకరోజున అద్దె పైకం యిచ్చాడు. నాకు బొత్తుగా యిష్టంలేకపోయినా—అతను సందేహిస్తాడన్న భయంతో— తీసుకున్నాను. కాని ఆ సాయంత్రమే చక్కని జేబురుమాలులో కట్టి నళిని మీదవైపుకు విసిరి "మీఅన్న అద్దెపైకం యిచ్చిపోయాడు. ఇవి తీసుకొని నీదగ్గర అట్టేపెట్టుకో !" అన్నాను.

నళిని కొంచెంసేపు అక్కడే స్తంభించిపోయి—ఏమి ఆలోచించుకొన్నదో—తర్వాత డబ్బు తీసుకొన్నది. ఈవిధంగా నాలుగుమాసాలు గడిచాయి. ఆఖరుకు ఒకరోజున—ఇప్పుడెందుకు ఆగోల—పోనివ్వండి.

కన్నాయీ శశధరుడూ ఆఁ, ఆఁ, అంటూ లేచారు.—"మిగతాది కూడా పూర్తిచేయి భవకాంతదా !" అని నేనడిగాను.

భవకాంతదా అత్యంత కరుణస్వరంతో చెప్పసాగాడు: "సరే !—ఒక రోజున ఉదయం గోలగా మాట్లాడటం విని హఠాత్తుగా నిద్రనుంచి లేచాను. గల్లీనిండా ఎర్రబుట్టలు ! నళిని ఇంటికి సరిగ్గా ముందు అరడజను సార్జెంట్లు. క్రిందకు దిగివచ్చాను. నళినివుండే ఇంటి తలుపుకు తాళంవేసివుంది. ఇన్‌స్పెక్టరు అడిగాడు—"ఇది మీసొంత ఇల్లేకదూ ?"

"ఆఁ, ఎందుకూ ?"

"సర్చి చేయాలి."

సంగతేమిటో నాకు అర్థంకాలేదు. అప్పుడు నాకు పంధొమ్మిదోయేడు

—పోలీసులను చూస్తే కొంచెం భయంకూడా వుండేది. ఇక విధిలేక—
"చేయండి" అన్నాను.

ఇటు నళిని ఇంట్లో వుండి పోతుందేమోనని భగవంతుని ప్రార్థించసాగాను. తాళం పగలగొట్టి ఇన్స్పెక్టరు లోన ప్రవేశించాడు. ఇల్లు కాళీ—ఎవ్వరూ లేరు! వైపుదగ్గర మాత్రం నాలుగైదు పగిలిపోయిన కుండలూ పిడతలూ పడివున్నై. ఇన్స్పెక్టరు నావైపు తిరిగి—"వీళ్ళు ఎక్కడికి వెళ్ళారు?" అని అడిగాడు. నాముఖం వాడిపోయింది.—"ఎవరూ?" అన్నాను.

"నీరద ఖా స్తగీర్, వినోద చౌధరీ?"

"వారిని ఎరగనే!" అని ఆశ్చర్యంతో అన్నాను.

ఇన్స్పెక్టరు తీవ్రంగా నావంక చూశాడు—"ఇల్లు మీదీ—"

"మా ఇంట్లో అద్దెకు వున్నాయన పేరు మణిమోహన చౌదరి."

"ఇంట్లో ఎంతమంది వుండేవారు?"

అనాయాసంగా అబద్ధం చెప్పాను—"ఒక్కరే!" అని.

తర్వాత సి. ఐ. డి. ఆఫీసుకు వెళ్ళవలసి వచ్చింది. దొర నన్ను యెంత క్రాసుచేసినా నా నోటినుంచి నళిని పేరు బయటికి లాగలేక పోయాడు.

"ఆ నీరద ఖా స్తగీర్ ఏ మయ్యాడు?" అని అడిగాడు కన్నాయి.

శశధరుడు వాణ్ణి బెదరిస్తూ—"నోరుముయ్యి! నీ కుంటిప్రశ్న లెందుకూ మధ్యని?—మీరు చెప్పండి, భవకాంతదా!" అన్నాడు.

భవకాంతదా మరల చెప్పనారంభించాడు.—"ఆ పగలు నేను పడ్డబాధ చెప్పతరం కాదు! నళిని ఏమయిపోయిందోనని చింతతో ఆలోచిస్తూ ఆలోచిస్తూ అలానే నిద్రపోయాను. దీపాలు పెట్టేవేళకు మెలకువవచ్చింది. కళ్లుతెరవగానే టేబిలుమీద పెద్ద కవరు ఒకటి పడివుండటం చూచాను. తెరిచి చూడగానే—నళిని వ్రాసింది! ఉత్తరం చదవకుండానే హృదయానికి హత్తుకొని నిట్టూర్చి—రక్షించావు భగవంతుడా అనుకున్నాను.

తర్వాత దీపంవెలిగించి వుత్తరంచదువ మొదలెట్టాను. పెద్దపెద్ద అయిదు చాపు కాగితాలమీద వ్రాసివుంది. ముందటి నాలుగు కాగితాలు చదువుతూ వుండగా అయిదారుసార్లయినా కళ్లు తుడుచుకోవలసివచ్చింది. నళినికి నేను

చూపిన ప్రేమను వర్ణిస్తూ పది పన్నెండుచోట్ల నాకు ధన్యవాదాలు అర్పించింది. వుత్తరాన్ని రెండు మూడు సార్లు—పోనీండి! ఆఖరుపుటమీద దృష్టిపడగానే చకితుడ నయాను. ఇది సంభవమేనా—? నళిని—? ఇక ఆలోచించలేక పోయాను.—తలతిరిగి అచేతనుడనై పడిపోయాను. కన్నాయీ శశిధరుడూ ఏకకంఠంతో—"ఆఖరుపేజీలో ఏముంది?" అని చీత్కారం చేశారు.

నోటితో చెప్పలేను. జీవితంలో ఎప్పుడైనా అక్కరకు వస్తుందని ఆ పేజీని అట్టేపెట్టాను. మీరే చదువుకోండి!" అని భవకాంతదా డ్రాయరు సొరుగుతీసి ప్రేములో కట్టివున్న కాగితాన్ని యిచ్చాడు.

శశధరుడు చదవసాగాడు...'కాని ఒక్కసంగతి చెప్పలేక పోయాను. మీ అగాధమైన ప్రేమ మీ చూపుల్లోనే గ్రహించాను. అందుచేతనే తమను కొంచెం మేల్కొలపాలని ఇలా చేశాను. మీరు చాలా అమాయకులు. మనిషిని మీరు బొత్తుగా గుర్తించలేరు!—నేను అలీపూరు దోపిడి కేసులో పరారు ముద్దాయిని. నా వెనక సి. ఐ. డీ. లు ఎల్లప్పుడూ తిరుగుతూ వుంటారు.—లేకపోతే స్వయంగా వచ్చి నా నోటితోనే చెప్పేవాడిని. నేను పురుషుణ్ణి—మీరు పుస్తకాలు చంకను పెట్టుకొని పోతూన్న కుర్రవాడిని చూసిరే, అతను నా సోదరుడు కాడు—నేనే! పోలీసుల కళ్లు కప్పటానికి ఆడవేషం వేసుకొని ఇంట్లో వుండేవాడిని. ఉదయం ఆంగ్లో ఇండియనుల వేషంవేసుకొని కాన్వెంటుస్కూలు వైపుకు వెళ్ళేవాణ్ణి—అందువల్లనే మీరు నన్నెప్పుడూ మధ్యాహ్నం చూడలేక పోయారు. ఇప్పటికీ చింతించవలసిన విషయ మేమీలేదు! బ్రతికివుంటే ఎప్పుడో ఒకమాటు మిమ్ము తప్పకుండా చూస్తాను. అయినా ఒకమాట—నిజమైన మాట—చెప్పుతున్నాను. మిమ్మల్ని చూచినతర్వాత నేను స్త్రీనైపుట్టినా నాకే ఆటంకమూ లేదని అనిపించింది.'

శశధరుడు ఉత్తరం చదివి ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి—"ట్రాజెడీ!" అన్నాడు. కన్నాయి చిరునవ్వు నవ్వి "చాలాగమ్మత్తుగాఉందే!" అన్నాడు.

"తర్వాత ఏంచేశారు?" అని నే నడిగాను.

"ఏది చేయడం ఉచితమో, అంటే ఏది చేసుకోకపోతే జరగదో అదే—వివాహం! నళినిని మర్చిపోవటంకోసం బాగ్ బజారులో వుండే ముఖర్జీల కన్య

విధుముఖిని శరణుజొచ్చాను! పాపం ఆవిడె మరుసటి సంవత్సరమే అనంత శయనంఎక్కింది. ఈ సంగతి మీకుకూడా తెలుసుగా. తర్వాత విధుముఖిని మరచిపోటానికి భవానీపూర్ లో వుండే మాలతిని" అన్నాడు భవకాంతదా.

నీవేమన్నా చెప్పు భవకాంతదా! మాలతి వదినె చనిపోయాక మూడో పెళ్ళి చేసుకోవడం బాగుండలేదు" అని నేను అన్నాను.

"మరో ఉపాయం లేదు భాయీ! ప్రేమ ఒక నిషా అని ఇదివరకే చెప్పాను కదూ! ఇక వివాహముకూడా ఒక ద్రవ్యదోషము—ఒకసారి గనుక అభ్యాసం అయేటట్లయితే, దాన్ని వదిలించుకునేటందుకు ఉపాయం లేదు!—ఉపాయంలేదు!!—లేదు!!!"

తర్వాత వెనకవైపున తెరచివున్న దరవాజావంక చూచి భవకాంతదా తారస్వరంలో కేకవేశారు—"ఇదిగో! నాలుగు కప్పులు టీ పంపించూ!"

# పొట్లకాయ

షష్ఠీ ఠాకురాణి హఠాత్తుగా ఒకదుష్కర్మ చేసి కూర్చున్నది.

పొరుగింటి వదన్ ఘోష్ మేకపిల్లను పచ్చడిబండతో బాదింది. ఆదెబ్బతో అది మళ్ళీ వదన్ ఘోషు ఇంటికి పోలేదు. ఠాకురాణి ఇంటివెనక గోతిదాకా ఈడ్చుకుంటూపోయి అక్కడ 'మే' అని అరిచి చచ్చింది. ఇక ఆ ఊళ్లో ఈ విషయమై ఆందోళన బయలుదేరింది.

షష్ఠీఠాకురాణీ ఇంటిముందు పంచలో చాప పరిచి జపమాల తీసుకు కూర్చున్నదో లేదో వదనఘోషు తనకు అనుకూలురైన ఇద్దరు పొరుగువాళ్లను వెంటపెట్టుకుని ఆమె ఇంటిమీదికి వచ్చి మేకపిల్లసంగతి ఎత్తగానే ఆమె పేలగింజలాగా ఎగిరిపడింది: "చంపాను! మంచిపని చేశాను! గింజలు తింటుంది, అరటికాయలు తింటుంది, నేనేమీ అనలేదు. కాని నాపొట్లపాదు—రోజూ వచ్చి ఆకు వెయ్యకుండానే తినిపోతుందా? దానికంతే కావాలి!"

వదనఘోషు పంచాయితీలో ఠాకురాణీమీద ఫిర్యాదుచేస్తానని బెదిరించి తన అనుచరులను వెంటపెట్టుకుని వెళ్లాడు. షష్ఠీఠాకురాణి జపమాల అరతల

పెట్టి పొట్లపందిరి క్రిందికి వచ్చి పొట్లపాదును మళ్ళీ ఒక్కమాటు చూసి, మేక కరిచినచోట్ల పేడతెచ్చి మెత్తు పెట్టింది. ఆ తర్వాత చచ్చిపోయిన మేకపిల్ల నుద్దేశించి మళ్ళీ సరిగ్గా త్రాగా శాపనార్థాలు పెట్టింది.

* * *

ఠాకురాణీ చెప్పింది నిజమే. ఆమె ఇంటిముంగిలిలోకి ఆ ఊళ్లో ఉన్న చతుష్పాద జీవాలన్నీ నిరభ్యంతరంగా వచ్చేవి. కొంచెం సందుచిక్కితే ఆమె ఇంట్లో చొరబడి ధాన్యమూ, మధ్యాహ్నానికి అట్టిపెట్టుకున్న అన్నమూ, కూరగాయలూ కూడా తినిపోయేవి. కాని ఠాకురాణీకి ఎప్పుడూ కోపం రాలేదు. కాని ఈ పొట్లపాదు! దాని పందిరికిందికి మేకపిల్లగానీ, బర్రెదూడగానీ ఏదీ రాకూడదు; వస్తే, ఠాకురాణీ కర్రతీసుకుని దానిమీదికి పరిగెత్తేది. ఒకవేళ అది చిక్కకపోతే దాని యజమానుల్ని వైనాలవారీగా తిట్టేది. ఆవాళ చక్రవర్తిగారి ఆవుదూడ పొట్లపాదువి రెండాకులు కొరికింది. ఠాకురాణీ దాని వెంటబడి చక్రవర్తిగారి ఇంటిదాకా తరుముకొచ్చింది. ఐనా అపరాధి చిక్కకపోవటంచేత చక్రవర్తిగారి భార్యను అరగంటసేపు సాధించి, చెమటలు కారుతూ ఇంటికి తిరిగివచ్చి మంచం ఎక్కింది. ఆవాళ ఆ బ్రాహ్మణ విధవ మధ్యాహ్నం అన్నంకూడా తినలేదు.

ఆ పొట్లపాదుమీద ఠాకురాణీకింత ప్రీతి ఉంటానికి ఒక కారణం ఉంది. రెండు సంవత్సరాలక్రిందటి సంగతి. ఒకనాడు వృద్ధఠాకురాణీ ముద్దుల మనమడు నితాయీ, పల్లెగూడెం చుట్టివస్తూ, దోవలో దత్తుగారి అబ్బాయి, నితాయీమిత్రుడు అయిన శ్రీ చరణుడు నూనెలో వేపిన పచ్చిమిరపకాయలూ, పొట్లకాయఇగురు వేసుకుని అన్నం తింటున్నాడు. అది చూసేవరకు దాని మీద నితాయీమనసు పోయింది. వాడు శ్రీ చరణుడివంక చూస్తూ అక్కడే నిలబడ్డాడు. శ్రీ చరణుడు నితాయీని చూసి చేతులో ముద్ద మూచూసి నేలమీద పారవేస్తూ — "నువ్వు దిష్టి పెడుతున్నావు కాదూ, నితాయీ!" అన్నాడు. నితాయికి చాలా కష్టమేసింది. "మా అవ్వకు పొట్లకాయ ఇగురు వండటం చాతకాదేం?" అని అక్కడినించి వచ్చేశాడు.

ఇంటికి రాగానే నితాయీ—"నాకు పొట్లకాయ ఇగురేసి అన్నంపెట్టు, అవ్వా!" అన్నాడు ఠాకురాణీతో.

అప్పటికి ఝామ్ముప్రొద్దెక్కింది. వృద్ధఠాకురాణీ పొట్లకాయలకోసం వాళ్ళ వీధి అంతా తిరిగి ఉత్తచేతులతో తిరిగివచ్చింది. నితాయీ అప్పుడు స్నానం చేయటానికి చెరువుకు వెళ్ళాడు. వాడు వస్తూనే "నాకు ఆకలేస్తోంది. అన్నంపెట్టూ!" అంటూ పీటమీద కూచున్నాడు. అన్నంపళ్లెం వచ్చిన మీదట చూస్తే దాంట్లో పొట్లకాయ ఇగురులేదు. వాడు అప్పుడు ఏడ్చి గోలచేసి, పళ్లెం అవతల పారేసి లేచాడు. ఠాకురాణీ వాడిచెయ్యి పట్టుకుని బ్రతిమాలింది: "ఇంకా పొట్లకాయలు రావటంలేదు, నాయనా! ఈపేట అంతా వెతికి వచ్చాను."

"అయితే శ్రీ చరణుడు ఎట్లా తింటున్నాడూ?" అన్నాడు నితాయీ.

ఠాకురాణీకి ఆసంగతి తెలుసు—"దత్తుగారు కోర్టుకు వెళ్ళి వస్తూ బస్తిలో తెచ్చారు" అన్నది. "అయితే నాక్కూడా అక్కడినించే తీసుకురా!" అని నితాయీ చెయ్యి కడుక్కోటం మొదలుపెట్టాడు. ఠాకురాణీ నితాయీని ఎన్నోవిధాల లాలించి, బెల్లించి ఆ పూటకు బెల్లంపెట్టి వాడికి అన్నం తినిపించింది. ఆ సాయంకాలమే ఆమె గణేశుడనే పల్లె అబ్బాయిచేతికి నూరు జంధ్యాలు ఇచ్చి, బస్తీకి పోయి సంతలో అమ్మి పొట్లకాయలు తెచ్చిపెట్టమని బలవంతంచేసింది. గణేశుడు అణాడబ్బులకు ఆశపడి బస్తీకి వెళ్ళాడు.

మర్నాడు సాయంకాలం గణేశుడు జంధ్యాలు అమ్మి పెద్దపొట్లకాయ తెచ్చాడు. ఆరాత్రి అన్నంతింటూ నితాయీ—"ఇది ఇగురేనే! వేపుడు చేయలేదేం అమ్మమ్మా?" అన్నాడు.

"ఇంకా చెట్లు పెద్దవికాలేదు నాయనా! నిరుటి చెట్లవి. వచ్చేసంవత్సరం మన ఇంట్లోనే వేసి, నీకు వండిపెడతాను, తెలిసిందా?" అన్నది ఠాకురాణి.

నితాయీ ఉబ్బిపోయి అన్నంతిన్నాడు.

మరుసంవత్సరం తను స్వయంగా గుంజలు పాతి పందిరివేసి, మూడురకాల పొట్లవిత్తులు నాటింది. మొక్కలు మొలిచినై. మూడుతీగలూ పందిరిగుంజలు ఆధారంచేసుకుని పైకి ఎక్కినై. ఈ సమయంలో నితాయీ పై తల్లి మొగుడు

భూములు కవుళ్లు ఇవ్వటంకోసం ప్రక్కఊరు వచ్చి ఠాకురాణీని చూసిపోదా మనిఈ ఊరు వచ్చాడు. నితాయి అప్పుడు మామిడిచెట్టుక్రింద కాళ్లు బారచాపి కూచుని, ఊరిమీదికి పోయి తెచ్చుకున్న వడపప్పు ప్రసాదం తింటున్నాడు. తన మద్రకునివంశ ప్రదీపకుడు ఈస్థితిలో ఉండటం చూసి పెత్తండ్రి రోహిణీ బాబు నితాయిని గురించి ఠాకురాణీని అడిగి, వాడి కింకా అక్షరాలే రాలే దని తెలుసుకున్నాడు. అతనికి ఈ దరిద్ర బాలకునిమీద జాలి కలిగింది. కలకత్తా తీసుకుపోయి చదివిద్దామని సంకల్పించుకుని ఠాకురాణీని అడిగాడు. ఠాకురాణీకి ముందు మతిపోయింది. కాని, తర్వాత మనుమడు అధికారి అవు తాడని, ఈ ప్రస్తావనకు వొప్పుకుంది.

నితాయీ కలకత్తా వెళ్లాడు. ఆ సంవత్సరం పొట్లపాదు పచ్చటి ఆకులు వేసి తెల్లటిపూలు పూసింది. అది చూసి ఠాకురాణీ కళ్లల్లో నీరు తిరిగి—"త్రాష్టపుమొక్కలు. చావనన్నా చావలేదు!" అని తిట్టింది. కాని ఆ విధవ బ్రాహ్మణకన్య శాపంతగిలికూడా మొక్కలు చావలేదు. పైగా విరగకాచినై! ఆ తర్వాత ఒకనాడు ఠాకురాణీ ఆ కాయలన్నీ కోసి ఊరుమీద పంచిపెట్టి ఆ పాదులు నరికివేసి ముసుగుతన్ని పండుకుంది.

చదువుకు అడ్డమవుతుందని రోహిణీబాబు క్రిందటి సంవత్సరం నితాయీని ఇంటికి పంపలేదు—వచ్చే పుష్యమాసంలో క్రిస్మస్ సెలవుకు పంపుతానని ఠాకురాణీకి వ్రాశాడు.

ఈవార్త తెలియగానే వృద్ధ ఠాకురాణీ మళ్ళీ గడ్డపార తీసుకుని పాదు చేసి, ఊళ్ళోకిపోయి పొట్లగింజలు తెచ్చినాటి మళ్లీ పందిరి వేసింది. నిరుటి మాదిరిగానే సున్నమూ, మసీ పూసి దిష్టిపిడతకూడా ఒక గుంజకు తగిలించి ఆ మొక్కలు కనిపెట్టుకుని కూర్చోవటం మొదలుపెట్టింది. ఇదివరకు సాయంత్రంపూట ఆమె ఊరుచుట్టి రావటానికి పోయేది. కాని ఈపాదు పెట్టినప్పటినించీ పందిరికిందనే చాపవేసుకుని కూచుని, జంధ్యాలు వడుకుతూ కాలం వెళ్లబుచ్చేది. ఇలా కావలి కాస్తున్న సమయంలోనే వదనఘోషు మేకపిల్ల వెనకగా వచ్చి రెండు ఆకులు కొరికి ఠాకురాణీచేతులో పంచత్వం పొందింది.

ఠాకురాణీ వదనఘోషుమీద కేకలువేసి ఆవతలకు పంపిందే కాని ఆనాడంతా ఆ మేకపిల్ల అరుపు ఆమె చెవిలో గింగురుమంటూనే ఉంది. ఇక ఆమె ఉండలేక చీకటిపడుతూ ఉండగా శ్రీరామ్ మోదీ దుకాణానికి వెళ్ళి రెండు బిందెలు తాకట్టుపెట్టి మూడు రూపాయలు తెచ్చి వదనఘోషు కొడుకు చేతులో పెట్టి మేకను చంపిన పశ్చాత్తాపంనించి విముక్తి చెందింది. ఇకముందు ఆ మేకపిల్లవచ్చి, తన్ను ఇబ్బందిపెట్టదనే సంతోషం ఒకమూల లేకపోలేదు.

ఆఖరుకు నియమ ప్రకారంగానే పొట్లతీగ తెల్లటిపూలు పూసింది; కాయలు కూడా కాచింది. నితాయీ వస్తేముందు ఏ కాయకోయాలో దానికి సున్నపు చుక్క పెట్టి గుర్తుకూడా పెట్టుకున్నది.

సంవత్సరంనర అయినాక నితాయీ ఇంటికి వచ్చాడు.

అన్నంముందు కూచుని పళ్ళెంలో ఒకమూల ఉన్న పొట్లకాయ వేపుడు వేపు వేలు చూపుతూ—"ఇదెందుకు వండావు, అవ్వా ?" అన్నాడు.

ఠాకురాణీ పరమ ఉత్సాహంతో నవ్వుతూ "నీ పొట్లకాయ వేపుడుర. మన చెట్టున—" అన్నది.

నితాయిమధ్యనే అడ్డుతూ — "ఛీ సెయ్యి! ఈపిచ్చి కూరలన్నీ నేను కలకత్తాలో తినను. రెండుపూటలూ ఉరలగడ్డ వేపుడూ — కాబేజీ—" హఠాత్తుగా వృద్ధి ఠాకురాణి లేచిపోవడం చూసి నితాయీ ఆగాడు. అలిస్టు అంతా పూర్తిగా వినిపించలేదు.

భోంచేసి చేయి కడుక్కోటానికి నితాయి బయటికి వచ్చాడు. ఠాకురాణీ అప్పుడు కత్తిపీట తీసుకుని పొట్లపాదు నరుకుతున్నది. నితాయి జేబులోనించి జపానుసిల్కు జేబురుమాలు తీసి మూతి తుడుచుకుంటూ—"ఏమిటి నువ్వు చేసేది అవ్వా!" అన్నాడు బిగ్గరగా.

ఠాకురాణి తిరిగిచూడకుండానే నరుకుతూ—"జంఝాటంరా! ఇదంతా జంఝాటం! ఇల్లంతా కమ్ముతున్నది!" అన్నది.

"అందుకని మిట్టమధ్యాహ్నంపూట తలవాకిలి బాగుచేస్తువా!" అని నితాయీ పగలబడి నవ్వాడు.

వృద్ధి ఠాకురాణీ ఇప్పుడుకూడా తిరిగి చూడలేదు.

# సమాధానము

బ్రహ్మంపురం కాలేజీనుంచి బి. ఏ. ఫస్టుక్లాసు ఆనర్సుతో సహా ప్యాసయి నిత్యానందప్రభు వంశీకుడైన స్వర్గీయ శ్యామలాలు గోస్వామి సుపుత్రుడు మోతీలాలు రొమ్ము విరుచుకొని కలకత్తాలో ప్రవేశించాడు. అతనికి ఏవైపునా 'నా' అనేవారు లేరు ఇపుడు. ముసలి మేనమామ ఒకడు ఇంతవరకూ చదివిస్తూ ఉన్నాడు. అతనుకూడా ఈ పరీక్షలు కాగానే చనిపోయాడు. ఇక విశ్వవిద్యాలయపు విద్య ముందుకు పోవటం అసంభవము. కాబట్టి బతుకు తెరువు చూచుకోవాలి.

కలకత్తాలో అతనికి పరిచితు లెవ్వరూ లేరు. లేరని అతను భయపడలేదు. బి. ఏ., ఫస్టుక్లాసులో ఆనర్సుతో సహా ప్యాసయ్యాడు. కలకత్తా ఏమిటి? ప్రపంచమే అతనికోసం ఎదురు చూస్తున్న దనుకొన్నాడు. సియాల్దహా స్టేషనులోదిగి బైఠక్ ఖానా రోడ్డులోఉన్న విశుద్ధమైన ఒక బ్రాహ్మణహోటల్లో ఒక గది అద్దెకు తీసుకొని మోతీలాలు జీవనయుద్ధంలో ప్రవేశించాడు.

ఆనాడు విశ్రాంతి తీసుకొని మర్నాడు శ్యామ బజారునుంచి మొదలు పెట్టి భవానీపూరువరకు ఉన్న కాలేజీలన్నీ తిరుగాడు, ట్యూటరుపని ఏదైనా దొరుకుతుం దేమోనని. లాభం లేకపోయింది. అప్పు డతని రొమ్మువిరుపు కూడా కొంత తగ్గింది. మూడోనాడు క్లయివుస్ట్రీటులో ఉండే ఇంగ్లీషు ఫరంలన్నీ తిరిగాడు. అందరూ ముక్తసరిగా 'నో వేకన్సీ' అని గర్జించారు. ఒకరూ అరా, దయాపరవశులై ఒకటి రెండు ప్రశ్నలుకూడా వేశారు.

"మీరు హిందువులా?"

"అవును సార్!"

"నేషనలిస్టు?"

జీవితంలో మోతీ ఎప్పుడూ అబద్ధమాడి ఎరగడు. పొట్టకోసం అబద్ధమాడనని ప్రతిజ్ఞకూడా చేశాడు. "యస్ సార్," అన్నాడు.

ఆ ఫరము యజమానులు 'గుడ్ బై' చెప్పి పంపారు. తర్వాత కొన్నాళ్లు బడాబజారులో ఉండే మార్వాడీకొట్లు చుట్టూ తిరిగాడు. అసలే బేరాలు

మందగించినవి. పైగా ఇతను బెంగాలీ. లాభించలేదు. అప్పు డతని రొమ్మువిరుపంతా తగ్గి మామూలుకు వచ్చేశాడు. రానున్న విపత్తుకూడా గ్రహించాడు.

ఒకనాడు పత్రికలో ప్రకటన ఒకటి కనపడింది: గవర్న మెంటు రికార్డు డిపార్టుమెంటుకు ఒక గ్రాడ్యుయేటు కావాలట. యోగ్యతకు అతనివంటి గ్రాడ్యుయేట్లు ఎంతమంది ఉంటారు ? అతని ముఖం వికసించింది. ఈ ఉద్యోగాన్ని చేతినించి పోనివ్వకూడ దనుకున్నాడు. కాని, మర్నాడు గవర్న మెంటు హాసుకు పోయి చూచేవరకు అతని గుండెల్లో రాయిపడింది. దాదాపు ఓ పాతికమంది దరఖాస్తులు చేతపట్టుకొని అక్కడ తిరుగు తున్నారు. అందరూ కార్డులు అడిషరకే పంపారు; మోతీకూడా పంపాడు. రెండుఘంటలు గడిచాక అతన్ని 'ఇంటర్ వ్యూ'కు పిలిచారు.

"నువ్వు ముసల్మానువా ?" ఇదీ దొర మొదట వేసిన ప్రశ్న.

"కాదండి."

"నో ఛాన్సు. పోవచ్చును బాబూ!" అన్నాడు దొర, నడవమన్నట్టుగా పెన్సిలు ఊపుతూ.

మోతీకి మతిపోయింది. ఫస్టుక్లాసులో అనర్సుతోసహా ప్యాసయినా 'నో ఛాన్సు' ఎందుకని ? "సర్, నా క్వాలిఫికేషన్—"

"మతమే క్వాలిఫికేషన్ ! గుడ్ బై" అన్నాడు దొర మందహాసం చేస్తూ. అక్కడినుంచి బయటపడి పిచ్చి ఎక్కినవాడిలా పట్నమంతా తిరిగా డు మోతీ. సాయంత్రం బసకు వస్తూ ఉండగా అతని బాల్యమిత్రుడు హాఫీజ్ కనిపించాడు.

"నువ్వు కలకత్తాలో ఉన్నావేం హాఫీ ?"

"ఏదన్నా ఉద్యోగం దొరుకుతుందేమో నని వచ్చాను. ఏడుసార్లు బి.ఏ. తప్పానని నాన్న ఖర్చులుకూడా ఇవ్వటంలేదు. అల్లా కృపవల్ల దొరకను కూడా దొరికింది."

"ఏం పని ?"

"రికార్డు డిపార్టుమెంటులో గుమాస్తాపని. నెలకు నూరు రూపాయలు,

అలవెన్సు పాతిక. ఏదోవిధంగా గడుస్తుందిలే! ఏమంటావు?" అని హాఫీజు నవ్వాడు.

"నీకు దొరికిందా? సంతోషమే. నేనుకూడా దరఖాస్తు పెట్టాను" అన్నాడు మోతీ ఆశ్చర్యంతో.

"పొరపడ్డావు భాయీ! అది ముసల్మానులకు తప్ప యికఎవ్వరికీ ఇవ్వరు. చూడరాదూ, నిన్న టర్కీటోపీ లేదని నన్ను పలకరించనే లేదు. ఇవ్వాళ టర్కీటోపీ, కళ్ళ చొక్కా, లాగూ వేసుకుపోతే దొరికింది."

మోతీ కొంచెంసేపు ఏదో ఆలోచించి—"సరే వస్తాను. ఉద్యోగం దొరికిందని నన్ను మరిచిపోకు. నాక్కూడా ఏదన్నా చూడు" అన్నాడు.

"సరే"నని హాఫీజు ట్రాం ఎక్కాడు. బసకు చేరుకునేవరకు మోతీ రొమ్ముబిరుపు అంతా పోవటమే కాకుండా ముందుకు చాలా వంగబడినాడు.

* * *

ఆ రాత్రితోసహా ఫస్టుక్లాసులో బి. ఏ ప్యాసయిన మోతీలాలుగోస్వామి పక్కమీద చిత్తుగా పండుకొని పత్రికలో ప్రకటనలు చదువుతున్నాడు. హోటలుయజమాని గుణనిధిమిశ్ర అతని ఎదట నిలబడి డబ్బుకోసం తగాదా చేస్తున్నాడు. మోతీ సమాధానం ఇవ్వటం లేదు. అతను తెచ్చిన డబ్బంతా ఖర్చయి ఇప్పుడుపదణాలు మిగిలి ఉన్నవి. చాలాసేపు వాగివాగి ఆఖరికి గుణనిధిమిశ్ర "రెండురోజుల్లో పైకమంతా కట్టకపోతే పోలీసులకు పట్టిస్తాను!" అని బెదరించాడు.

మోతీకళ్ళు ప్రకటన చదువుతూ చదువుతూ పెద్దవైనవి. అతనికి నోరు ఊరించే ఉద్యోగం ఒకటి కనపడింది. అందుచేతనే గుణనిధిమిశ్ర బెదరింపు అతనిచెవి దూరలేదు. గుణనిధి రోషకషాయితనేత్రాలతో ఈ నిర్వికార నిరుద్యోగివంక చూసి వెళ్ళిపోయాడు. సాల్టు డిపార్టుమెంటుకు ముగ్గురు విద్యావంతులు కావాలట. మోతీ కొంచెంసేపు ఆలోచిస్తూ పండుకొని, తర్వాత లేచి అటు యిటూ తిరుగుతూ పది గంటలకు గవర్నమెంటు ఆఫీసుకు చేరుకున్నాడు. అక్కడ గుమాస్తాలను బ్రతిమాలుకుంటే వాళ్లు

అసలు రహస్యం బయటపెట్టారు. ఈ ఉద్యోగాలకోసం అందరూ దరఖాస్తులు పెట్టుకోవచ్చునట, కాని తగిన ముసల్మానులు దొరికితేమాత్రం వాళ్ళకే యివ్వమని సెక్రటరీగారి ఆజ్ఞ అట. మోతీముఖం వ్రేలాడబడిపోయింది. యూనివర్సిటీవాళ్లు యిచ్చిన సర్టిఫికెట్లన్నీ చించి గంగలో పారవెయ్యాలని అనుకున్నాడు. ఇలా కోపంతోనూ, విచారంతోనూ బసకు తిరిగి వస్తూ ఉండగా వెనకనుంచి ఎవ్వరో పిలిచారు.

"గోసాయీదాదా! ఆదాబ్."

మోతీ తిరిగి చూచాడు. రంజాన్ అలీ! ఇతని తండ్రి మోతీ మేనమామ దగ్గర గుమాస్తాపని చేస్తూ ఉండేవాడు. ఇతను కలకత్తాలో కనపడతాడని మోతీ స్వప్నంలోకూడా భావించలేదు. మనిషి అంతా మారిపోయాడు. కళ్ళకు సుర్మా, కళ్ళల చొక్కా, బిగుతు పరాయి, తలకు టర్కీ టోపీ, గుర్తుపట్టటానికే వీలు లేదు.

"నువ్విక్కడ—!" అన్నాడు మోతీ ఆశ్చర్యంతో.

గత మూడు సంవత్సరాలనుంచి ఇక్కడే ఉంటున్నానని రంజాను అలీ చెప్పాడు. స్వదేశీ ఉద్యమం పుణ్యమా అంటూ బీడీలు బాగా ఖర్చవుతున్నవట. నాలుగు డబ్బులుకూడా సంపాయించాడట. ఇప్పుడు సియాల్దహా చాకకు వెళ్ళుతున్నాడు. అక్కడ బ్రాంచి పెడతాడట. ఇంతలో ట్రాం వచ్చింది. "ఎక్కు గోసాయీభాయీ!" అన్నాడు రంజాన్.

"నువ్వు వెళ్ళు, నేను నడిచి వస్తాను. దగ్గర డబ్బులేదు."

"ఇంతచదువు చదివావు, డబ్బు లేదూ! సరే ఎక్కు" అన్నాడు రంజాను ఆశ్చర్యంతో.

ఇక తప్పక మోతీ ట్రాం ఎక్కాడు. ట్రామ్‌లో కూర్చున్నాక తన మేనమామ చనిపోయిననాటినుంచి కలకత్తాలో ఉద్యోగంకోసం పడ్డ తిప్పలన్నీ చెప్పాడు. ఏమీ దాచలేదు.

"ఈమాటలన్నీ నాకు చెప్పాలా? నీకు శాస్త్రకూడా తెలివిలేదు భాయీ!" అని రంజాన్ మోతీచెవిలో ఏదో చెప్పాడు.

"దాంట్లో చాలా చిక్కులున్నై! ఒకవేళ పట్టుపడితే?"

"ఏమీ ఫరవాలేదు. అదంతా నేను చేస్తానుగా! నాపేరు రంజాన్ ఆలీ అనుకో! సాయంత్రం నాదగ్గరకు రా" అని రంజాన్ తాను ఇన్నాళ్ళ నుంచీ కలకత్తాలో ఉండి, బుద్ధిని వినియోగించి చేసిన ఘనకార్యాలన్నీ ఏకరువు పెట్టాడు.

మోతీ ఇవన్నీ విన్నాక రంజాను యిష్టప్రకారం పోతే ఏమన్నా లాభించవచ్చుననీ, పట్టుపడతానన్న భయంకూడా ఉండదనీ గ్రహించాడు

* * *

మర్నాడు కళ్ళల చొక్కా, బిగుతు పరాయి, టర్కీ టోపీ ధరించి, పదిఘంటలు వేళప్పుడు భారతమాత మార్కు బీడీలు కనిపెట్టిన షేక్ రంజాన్ ఆలీతోపాటు బండి ఎక్కి సాల్టు ఆఫీసుకు వచ్చిన వ్యక్తి మోతీలాల్ గోస్వామి కాదు—మోతీయార్రహమాన్.

మామూలుగా కార్డు పంపి, మోతీయార్రహమాను ఎదురు చూస్తున్నాడు. కొంచెంసేపట్లోనే పిలుపు వచ్చిపిది. కాని మోతీ భయపడ్డాడు. వెళ్దామా వద్దా అని సందేహిస్తూ ఉండగా, 'ఏం ఫరవా లేదు—వెళ్ళిరా! గడ్డం మీసాలు లేకపోతే ఏం? అడిగితే మాకు రివాజు లేదని చెప్పు' అని రంజాను మోతీ చెవిలో చెప్పాడు.

ఇక విధిలేక మోతీయార్రహమాను రామనామం జపిస్తూ సాల్టు సూపరింటెండెంట్ గదిలో ప్రవేశించాడు.

* * *

సెంట్రల్ అసెంబ్లీలో అప్పుడు ఇండియన్ సాల్టుబిల్లు దూదిపింజలాగా ఎగిరిపోతున్నది. వార్తాపత్రికలకు కొన్నాళ్ళనుంచి ఉప్పే ఆహారము. మోతీకి వార్తాపత్రికలు చదివే అలవాటున్నది. లవణసంబంధమైన చర్చలు, ప్రభుత్వానికి అనుకూల ప్రతికూలంగా జరిగిన ఉపన్యాసాలు అన్నీ జ్ఞాపకం పెట్టుకున్నాడు. అందుచేత గవర్నమెంటు సాల్టుపాలసీని గురించి సెక్రటరీ గారు ప్రశ్నించగానే మోతీ గడగడ దొరల ఉచ్చారణతో కామర్సుమెంబ రిచ్చిన ఉపన్యాసంలోని కొంత భాగం వప్పగించాడు. దొర కనుబొమలు

ముడివేచి సిగరెట్లు పీలుస్తూ వింటున్నాడు. కొంచెం ఎడంగా కుర్చీలో కూర్చున్న సాల్టు సూపరింటెండెంట్ ఖాన్ బహద్దర్ మొనుద్దీన్ ప్రశంసా పూరితదృక్కులతో మోతీవంక చూస్తూ నెరసిన గడ్డం వేళ్ళతో సవరించు కుంటున్నాడు. ఇంటర్వ్యూ అయింది. తిరిగి వచ్చేటప్పుడు ఖాన్ బహద్దరు మోతీని దగ్గరకు పిలిచి "నీకోసం ప్రయత్నిస్తాను" అని చెప్పాడు. మోతీ సలాంపెట్టి బయటికి వచ్చాడు.

"ఏమిటి సంగతులు ?" అన్నాడు రంజాన్.

"దొరికేటట్టుగానే ఉన్నది !"

"దొరకక ! రంజాన్ అలీ యుక్తి అనుకో" అన్నాడు రంజాన్ నవ్వుతూ.

"దొరికితే నీ మహిమే. పద, ఇక హైకోర్టు ట్రాం ఎక్కుదాం, గంగలో స్నానంచేసి వస్తాను."

మూడురోజులు గడిచాక ఉత్తరం వచ్చింది. మోతీ యూర్రహిమానుకు ఉద్యోగం లభించింది. మేదినీపూరు జిల్లా సాల్టుడిపార్టుమెంటులో పెన్షను పుచ్చుకోబోతున్న ఒక ఉన్నతోద్యోగి ఖాన్‌సాహెబు మంజూర్ అలీ మిరాకు ఇతన్ని అసిస్టెంటుగా వేశారు. ఆర్డరు అందినవెంటనే వెళ్ళమని ఉత్తరువు. మోతీ రంజానుదగ్గరనుంచి మహమ్మదీయ దుస్తులూ, ఒక సీసా సుర్మా అడిగి తీసుకుని తక్షణం బండి ఎక్కాడు.

ఖాన్‌సాహెబ్ మంజూర్ అలీమియా వృద్ధుడు. గడ్డం పూర్తిగా నెరసింది. వీరిభార్య పదిహేను సంవత్సరాలక్రితం చనిపోయింది. అప్పుడు వీరే కోరి మేదినీపూరు జిల్లాలో ఉండే ఈ అరణ్యానికి మార్పించుకున్నారు. వీరి కున్న ప్రాపంచికబంధనమెల్లా కుమార్తె జహానారా. ఇపుడు డైసెసన్ కాలేజీలో బి. ఏ, చదువుతున్నది. ఎమ్.ఏ. ప్యాసుకాగానే పెళ్ళి చేసి వేసి పనినుంచి విరమించుకుందా మని వీరి కోరిక. మోతీకి ఖాన్‌సాహెబు అంటే చాలా ఇష్టము. వచ్చినరోజునే వారి సొంతపడవలో మోతీని ఒక చోటకు పనిమీద పంపారు. ఆవాళ వారికి కొంచెం సుస్తీగా ఉన్నది.

వారు 'ఉండేచోటుకూ సముద్రానికీ మూడుమైళ్ళున్నది. చుట్టూ అరణ్యం ఖాన్‌సాహెబుగారి బంగళాముందుమాత్రం పూలతోట ఉన్నది. అందులో

వివిధజాతుల పుష్పాలు ఉన్నవి. ఒకగుంపు కోళ్లు మొక్కల పాదులు చిమ్ముతూ మేస్తున్నవి. అప్పటి కింకా ప్రొద్దుకుంక లేదు. మోతీవచ్చి సలాం పెట్టాడు. 'పని ఎలాఉంది మోతీమియా?" అన్నాడు ఖాన్‌సాహెబ్.

"బాగానే ఉంది. మీబోంటి శుభచింతకు లుండగా ఎందుకు బావుండదు?" అన్నాడు మోతీ.

"సరే, రేపటినుంచి మీకు ఇంకోపని ఇస్తాను. ఇవ్వాళ మీరు అన్నం వండుకోబోకండి; చాలా అలిసిపోయినట్టున్నారు. ఈపూట ఇక్కడే—" అని నౌకర్ని కేకవేశాడు.

పిలుపువిని పొట్టిగా, లావుగావున్న మజీదుబక్షు భుజాన గళ్లరుమాలు వేసుకొని హాజరయ్యాడు.

"కోడిని కోశావా?" అని అడిగాడు ఖాన్‌సాహెబు.

మోతీముఖం వెలవెలబోయింది. మనసులో వాళ్ల మూలపురుషుడైన నిత్యానంద ప్రభువును స్మరించుకొని "ఆకల్లేదు. నాబసలో స్వామిద-"అన్నాడు.

ఖాన్‌సాహెబ్ వదిలే ఘటం కాదు. రెండు ముద్దలు పులావూ, నాలుగు కోడిముక్కలూ తప్పక తినాలని పట్టుపట్టాడు. మోతీ చాలా బ్రతిమాలి ఆఖరుకు తలనొప్పి వంక పెట్టి ఎలాగో ఆవేళకు తప్పించుకున్నాడు.

ఖాన్‌సాహెబు బంగళాలో కూర్చుంటే మోతీ ఉండే బస కనబడుతుంది. మర్నాడు ఉదయాన్నే ఒక నౌకర్ని వెంటపెట్టుకొని ఖాన్‌సాహెబు మోతీబసకు వచ్చాడు. మోతీ స్టౌ వెలిగించి టీ తయారు చేసుకుంటున్నాడు. ఖాన్‌సాహెబును చూడగానే అతని నోటినుంచి అస్ఫుటంగా "మహాప్రభూ!" అనే కాతరోక్తి వెలువడింది.

"మీకు తేనీరు అలవాటున్నదని చెప్పనేలేదే! మాదగ్గర రెండువేళలా తయారవుతూ ఉంటుంది" అన్నాడు ఖాన్‌సాహెబు కుర్చీలో కూర్చుని.

"రోజూ త్రాగను. ఎప్పుడన్నా బద్ధకంగా—"

"ఇక్కడనుంచి మాదగ్గరికి రండి. చేతులు కాల్చుకోవాల్సిన పనిలేదు. గ్రహించారా?" అన్నాడు నవ్వుతూ.

మోతీ గ్రహించాడు! ఖాన్‌సాహెబుగారు ఇలా శీత కన్ను వేస్తే తన

వంశ గౌరవం ఎక్కువరోజులు నిలవదనికూడా గ్రహించాడు! వంటయిల్లూ అదీ ఒకమాటు తిరిగిచూచి, వెంట తీసుకువచ్చిన నౌకరును మోతీకి వంట వానిగా నియమించి, ఆవాళ కూరకు ఒక కోడినీ, ఒక అర్ధడజను గుడ్లనూ తన ఇంట్లోనించి తెమ్మనిచెప్పి ఖాన్‌సాహెబు వెళ్లిపోయాడు.

విపత్తును గుర్తించాడు మోతీ. కాని ఎదురు చెప్పలేదు. మసులుతూ ఉన్న నీళ్లలో రెండు ఎండు తులసి ఆకులువేసుకొని ఆపూట టీ త్రాగాడు.

* * *

వైష్ణవధర్మాన్ని రక్షించుకొంటూనే మోతీ ఒకటి రెండు మాసాలు గడి పాడు. వంటవానిని మోసపుచ్చటం అంత కష్టమైనపనికాదు. భోజనసామగ్రి వంటయింట్లో కప్పిపెట్టమని చెప్పి, మోతీ పుస్తకాలు ముందువేసుకు కూర్చునేవాడు. ఇలాహీబక్షు ఆఫీసుకుపోగానే వంటకాలను తీసుకువెళ్లి ఇంటివెనక అరణ్యంలో నక్కలకు నైవేద్యంపెట్టి, స్నానంచేసి స్టౌమీద పులగం వండుకు తినేవాడు.

ఇంతకూ ఆపద తప్పిపోనేలేదు. క్రమంగా ముంచుకువస్తూ ఉన్నది. దసరా సెలవలకు ఖాన్‌సాహెబుగారి కుమార్తె జహానారా బార్నెస్, బైరన్, షెల్లీ, కీట్సు, లాంగ్‌ఫెలో, వర్డ్స్‌వర్తు, షేక్స్పియర్ మొదలగు కవికులాన్ని మూడు సూటుకేసుల్లో నింపి, ఒకనాటి ఉదయాన మూర్తీభ వించిన ఉషాదేవివలె ఖాన్‌సాహెబుగారి గృహంలో ఉదయించింది.

ప్రతి రోజూ ఉదయం మోతీమాటలు వింటూవుండటం ఖాన్‌సాహెబు గారికి నల్లమందు వేసుకోటంలాగా అలవాటయింది! ఖాన్‌సాహెబుగారి కుమార్తె వచ్చిందని తెలిసి ఆనాడు మోతీ వారింటికి వెళ్లలేదు. ఎనిమిది ఘంటలకు పిలుపు వచ్చింది.

వరండాలో పేముకుర్చీమీద ఖాన్‌సాహెబుగారు కూర్చుని ఉన్నారు. వారికి ఎదురుగా టేబిలుమీద ఒక అష్టాదశ గౌరాంగిని కూర్చుని నవ్వుతూ ఏదో మాట్లాడుతూ ఉంది. మోతీ మెట్లదగ్గరకువచ్చి ఈమెనుచూచి ఆగి పోయాడు.

"బిడియమెందుకు? మా అమ్మాయే, జహానారా! ఎక్కరాండి!" అని పైకి వచ్చినతర్వాత ఖుమారైను మోతీకి పరిచయం చేశాడు. మోతీ చాలా బిడియంగానే కూర్చున్నాడు. జహానారా అతనివంక నిస్సంకోచంగానూ, చాలా పరీక్షగానూ చూస్తూ ఉన్నది. కొంచెంసేపు సంభాషణ జరిగాక మోతీ జహానారాకు అభివాదంచేసి సెలవు తీసుకున్నాడు.

"మీరు ఇంగ్లీషు బాగా చదివారని నాన్నగారు చెప్పారు. మధ్యాహ్నం రండి. కలిసి చదువుకుందాం" అన్నది జహానారా.

మోతీకి భయంవేసింది. కాని "తీరిక ఉంటే తప్పక వస్తా"నని మాట ఇచ్చాడు. కావలసినంత తీరిక ఉన్నదికాని మోతీ రాలేదు. సాయంత్రం మోతీ ఆఫీసుగ్రౌండులో తిరుగుతూఉండగా వెనకనుంచి ఎవరో ప్రశ్నించారు: "మీకు తీరిక చిక్కనేలేదా?"

మోతీ తిరిగి చూశాడు. పుస్తకం ముందు వేసుకొని జహానారా కూర్చుని ఉన్నది: "ఇవ్వాళ పని, చాలా వత్తిడిగా ఉంది!—ఆపుస్తక మేమిటి?" అని మోతీ తొట్రుపడుతూ అడిగాడు.

"చదవండి కొంచెం!" అని జహానారా పుస్తకం చేతికిచ్చింది.

అది బార్న్సు కావ్యం. చదవాలని మోతీమనస్సు చాలా పీకులాడింది. కాని కోరికను చంపుకొని "ఎప్పుడూ చదవలేదు. నావల్లకాదు" అన్నాడు.

జహానారా మందహాసం చేసింది. మోతీ గమనించలేదు. తర్వాత హైలాండ్ మేరీస్వరంతో జహానారా పుస్తకం చదివింది. మోతీ ముగ్ధుడయాడు. ఈఅమ్మాయి చీరా, జాకెట్టూ మొదలగు బాహ్యాలంకారాలతో మాత్రం కూడుకున్నది కాదని గ్రహించాడు. ఆరోజున మోతీ ఏలానో బయటపడకుండా తప్పించుకున్నాడు. కాని ఎక్కువదినాలు ఈ కౌతుకమయి, తీక్ష్ణబుద్ధిగల తరుణి కళ్లు కప్పటం అసాధ్యమని అతను తెలుసుకున్నాడు.

ఖాన్‌సాహెబూ, మోతీ, జహానారా ఒక టేబిలుచుట్టూ కూర్చుని ఉన్నారు. జహానారా రోమియో జూలియట్ చదువుతున్నది. చదివే భంగిమా, ఉచ్చారణ కౌశలమూ చూసి మోతీ పరవశుడైనాడు. జహానారా చదువుతూ చదువుతూ ఒకచోట ఆగి "ఇక్కడ మూడర్థాలు ఉన్నవి!"

అని రెండుమూడుపుటల వ్యాఖ్య చదివింది. మోతీ ఒక్కక్షణంలో తాను మోతీలాలు గోస్వామినికాను, మెట్రిక్యులేషను ప్యాసయిన మోతియాగ్రహమాను నన్నమాట మరిచిపోయి "ఉహుఁ! ఆ అర్థం సరైందికాదు" అన్నాడు. తర్వాత రోమియో జూలియట్ మీద ప్రసిద్ధ సమాలోచకులు ఇచ్చిన అభిప్రాయాలను క్రోడీకరించబోయి చకితుడైనాడు—తాను ఏమిచేయబోతున్నాడు! జహానారా ఎదురుగా కూర్చుని నవ్వుతూ ఉన్నది. ఆమె నవ్వు చూచి మోతీ చాలా తత్తరపోయాడు. కాని ఆమె వదలిపెట్టలేదు. "మీకివన్నీ ఎలా తెలుసు?" అని ప్రశ్నించింది.

"హెడ్‌మాస్టరు చెప్పాడు" అన్నాడు మోతీ నచ్చుగా.

"మెట్రిక్యులేషన్ క్లాసులో ఈవిధంగా షేక్స్పియరు చదివిస్తారని నాకు తెలియదే!" అని జహానారా తిరిగి నవ్వింది.

మోతీ ఖాన్ సాహెబువంక చూశాడు. వారు కుర్చీలో నిద్రపోతున్నారు. తత్తరబిత్తరగా లేచి జహానారాకు అర్థంలేనిమాట లేవో రెండు చెప్పి మోతీ మెట్లు దిగాడు, జహానారా మరల నవ్వింది.

* * *

జహానారా కౌతుకహాసం మోతీని పీడించినా, ఆమె దయాపూరితమగు ఆచరణ చూచి అతనికి ఆమెమీద ప్రేమకలిగింది. దాదాపు ఇద్దరూ సమవయస్కులు. ఈ జనవిరళమగు కుగ్రామములో స్నేహం కలవటం చాలా సహజం. పదిహేను రోజులలోనే వీరిద్దరిమధ్య స్నేహబంధం దృఢమైనది. ఏమాత్రంతీరిక ఉన్నా మోతీఖాన్ సాహెబుగారింట్లోనే గడిపేవాడు. జహానారా కావ్యాలు చదువుతూఉండేది; ఖాన్‌సాహెబు కునికిపాట్లు పడుతూ ఉండేవాడు; మోతీ వింటూఉండేవాడు. "పొరపాటు పడలేదుగదా?" అని మధ్యమధ్య జహానారా నవ్వుతూ ప్రశ్నిస్తుండేది. "నా కెలా తెలుసు!" అని మోతీ జవాబిస్తూఉండేవాడు. జహానారా నవ్వి మరల చదువుతూ ఉండేది.

ఈవిధంగా దాదాపు ఇరవై దినాలు గడచిపోయాయి. కాని ఎప్పుడు ఆపత్తు వచ్చి పడుతుందో నని మోతీకి భయంగానే ఉన్నది. తాను ఉద్యోగం

ఎలా సంపాయించిందీ వివరంగా ఒకవుత్తరంలో వ్రాసి అట్టే పెట్టాడు. అవసరం అయితే ఖాన్‌సాహెబుగారికి ఆ ఉత్తరం ఇస్తాడు.

ఆనాడు ఉదయం జహానారా కొన్ని కొన్ని పుస్తకాలు చేతపట్టుకొని మోతీయింటికి వచ్చింది. మోతీ స్టవ్వుమీద నీళ్లు కాస్తూన్నాడు. జహానారా మాట్లాడకుండా స్టవ్వుదగ్గిరకువచ్చి నీళ్లుదించి, టీ పొడి వేసి మళ్ళీ స్టవ్వు మీద పెట్టింది.

"ఏమిటి మీరుచేసేది ? స్టవ్వు బ్రస్టు అవుతుంది!" అన్నాడు మోతీ అదుర్దాగా.

జహానారా అక్కడనుంచి కదలలేదు. "బేబ్లర్ విల్ బ్రస్టు!" అన్నది నవ్వుతూ.

ఆమెనవ్వుచూచి మోతీ విసుపోయి కుర్చీలో కూలపడ్డాడు.

జహానారా రెండుకప్పులు టీ తయారుచేసుకొని వచ్చి "తీసుకోండి, ఒక కప్పు హెల్ప్ చేయండి!" అన్నది.

"నువ్వు త్రాగు జహాన్ ! నేను కొంచెంసేపు ఉండి—"

"ఇవ్వాళ మీరు తప్పక త్రాగాలి!" అంది జహాన్ నవ్వుతూ.

మోతీ శరీరమంతా సూదులతో పొడిచినట్లయింది. తన సంగతంతా జహానారాకు చెప్పి ఖాన్‌సాహెబుగారి దగ్గరనుండి సెలవు తీసుకు వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు. ఈవిధంగా ఛద్మవేషంతో జీవితం గడపటం అతనికి అసహ్యమేసిపోయింది. ఈ సంగతి చెప్పాలనే అభిప్రాయంతో— "చూడు జహాన్, నీవు నాకు చెల్లి వంటిదానవు" అన్నాడు.

"ఆసంగతి తెలుసు! మరి నాచేతి టీ త్రాగటానికి మీకేం ఆటంకం ? అన్నది నవ్వుతూ. మోతీముఖం వాడిపోయింది. జవాబివ్వలేకపోయాడు.

"కీట్సు చదివారా మీరు ?" అని జహానారా ప్రశ్నించింది.

ఈ నాటి జహానారా మాటలు వింటూఉంటే మోతీకి కాళ్ళూ, చేతులూ చల్లబడ్డవి. తాను కొండశిఖరానికి ఎక్కాడనీ, అక్కడ కాలు జారితే ఇక తన అస్తిత్వ ముండదనీ మోతీ గ్రహించాడు. కాని అతనికి జహానారా ప్రశ్నలకు జవాబిచ్చే ధైర్యం లేకపోయింది.

"మోతీమియా! నిజంగా మీ ముఖానికీ ఈ పెద్దమనిషి ముఖానికీ ఎంత పోలిక ఉందీ!" అని జహానారా అట్టహాసంచేస్తూ ఒక కాలేజి అన్యువల్ తెరచింది.

మోతీ విస్మయవిస్ఫారిత నేత్రాలతో చూశాడు—తాను క్రొన్ని మాసాల పూర్వం 'కీట్సు కావ్యాదర్శం' అని వ్రాసిన సమాలోచన తన ఫోటోతో సహా ఆ పత్రికలో పడింది.

"నీకేక్కడ దొరికింది?"

"వెంట తీసుకొచ్చాను. కీట్సునుగురించి ఈమధ్య యింత చక్కని సమాలోచన ఎవ్వరూ రాయలేదని మా ప్రొఫెసర్లు చెప్పారు. నేను వచ్చిన రోజునే నిన్ను కనిపెట్టాను. కాని వెల్లడించలేదు!"

"జహాన్! నీవు నా చెల్లెలివి. ఒకపని చేసిపెడతావా?" అని అడిగాడు మోతీ కానేపు ఉండి. మోతీ ముఖంగిమ చూచేవరకు జహానారా నవ్వు మాయమైంది. "చెప్పండి" అన్నది.

"ఈ ఉత్తరం ఖాన్‌సాహెబుగారికి ఇవ్వు" అని, తాను అదివరకు రాసి వుంచిన ఉత్తరం జహానారాకు ఇచ్చి, మళ్ళీ టీ తయారుచేసుకోటానికి నీళ్ల కోసం వెళ్ళాడు. అతను తిరిగి వచ్చేవరకు జహానారా ఉత్తరం చేతపట్టు కొని పెద్దగా నవ్వుతున్నది. "ఎందుకు నవ్వు!" అన్నాడు మోతీ.

"మీ తెలివితేటలు చూసి. అసలీ తెలివితేటలకే మీకు ఉద్యోగం ఇవ్వ వలసింది—చదువు సంధ్యలు లేకపోయినా! సరే, నేను ఒక ఉపాయం చెప్తాను, చేయండి. ఇక మీరు పోవలసిన అవుసరం ఉండదు. ఇది మోసంతో తీసుకున్న నౌకరీ కాదు! వాస్తవంగా మీరు ఎవరికంటెనూ యోగ్యతలో తక్కువ కారు" అన్నది జహానారా.

"ఖాన్‌సాహెబుగారంటే నాకు చాలా గౌరవం. వారిని మోసగించటం నాకు చాలా కష్టంగా ఉన్నది."

"ఇంకా పదిరోజులు ఆగండి. నేనే నాన్నగారికి చెప్తాను" అని జహా నారా లేచింది. "ఇక ఈ దాగుడుమూతలతో లాభంలేదు. ఈ పదిరో జులూ నాకు ఇంగ్లీషు చెప్పండి. అప్పుడూ మీరు నాకు నిజమైన సోద రులు" అన్నది. "ఒప్పాను" అన్నాడు మోతీ నవ్వుతూ.

ఈమధ్య జహనారా, మోతీ ఏమాలోచించుకొన్నారో ఎవ్వరికీ తెలియదు. సెలవులుపూర్తికాగానే జహనారా కలకత్తా వెళ్ళిపోయింది. తర్వాత రెండురోజులకు మోతీకూడా, ఒకవారం సెలవుపెట్టి కలకత్తా వెళ్లాడు.

పిమ్మట మూడురోజులకు కలకత్తా దినపత్రికల్లో ఈక్రింది వార్త పడింది:

"మౌల్వీ మోతీయార్రహమాను సాల్టుడిపార్టుమెంటులో గొప్పఉద్యోగి. వారు గత శుక్రవారము గోల్‌తల్లాశుద్ధిసంఘము వారివద్ద ఇచ్ఛాపూర్వకముగా హిందూమతము స్వీకరించిరి. వారి ప్రస్తుతనామము మోతీలాల్‌గోస్వామి. భగవంతుడు యీ నవదీక్షితసోదరుని జీవితము మధుమయము సేయుంగాత!"

ఎర్రపెన్సిలుతో గుర్తుపెట్టి, ఈ వార్త గుమాస్తాలు సాల్టు సూపరింటెండెంటుగారికి పంపారు. ఖాన్ బహద్దరు మొనుద్దీన్ గారు ఈ వార్త చదివి చకితులయారు. తక్షణం మేదినీపూరులో ఉండే ఖాన్‌సాహెబు మంజూర్ ఆలీమియాగారి వద్దకు ఒక సెమీసర్క్యూలరీ ఉత్తరం రవాణా అయింది.

* * *

మోతీ చేరకముందే ఖాన్‌సాహెబుగారికి జహనారా రాసిన ఉత్తరం అందింది. తర్వాత మోతీ గంధంబొట్టూ, బిళ్ళగోచీతో చేరుకున్నాడు.

"నువ్వు మొనగాడివి. నా కళ్లల్లో తాల్చి దుమ్ముకొట్టావు!" అన్నాడు మోతీని చూడగానే ఖాన్‌సాహెబు.

"మీకు కోపంగా లేదా?" అన్నాడు మోతీ తలవంచుకొని.

"కోపమా! జహనారా రాసిన ఉత్తరం చదువుతుంటే నాకు కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వువచ్చింది. సెబాష్! నువ్వు మొనగాడివి" అని మహా ఉల్లాసంతో ఖాన్‌సాహెబు మోతీవీపు చరిచాడు.

* * *

మోతీ ఉద్యోగం చేస్తున్నాడు. అతను మతము వదలిపెట్టినందువల్ల ఉద్యోగంకూడా వదలిపెట్టాలా, లేదా అనే విషయం స్పష్టంగా తేల్చటానికి ఖాన్‌బహద్దరు మొనుద్దీనూ, చీఫ్‌సెక్రటరీ గార్లమధ్య ఎడతెగకుండా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూన్నవి.

# నవల ప్లాటు

నిన్న ఉదయం ఉత్తరంద్వారానూ, సాయంత్రం మనిషిచేతనూ సంపాదక మహాశయుడు కబురుచేశారు. ఇవ్వాళ మధ్యాహ్నం లేఖ తీసుకోవటానికి వస్తానని. అందుకని ఉత్తరాలు వ్రాయటం ఉదయమే పూర్తిచేసుకొని పది ఘంటలు కాకముందే ఇల్లువదలి సాయంత్రందాకా గంగవొడ్డున షికారుకొట్టి రావాలని సంకల్పించుకొని ఒక డజను పోస్టుకార్డులు ముందు వేసుకొన్నాను. తొమ్మిదిఘంటలు అయేటప్పటికే వాకిట్లో శాలువా కప్పుకున్న మూర్తి ఒకటి ప్రత్యక్షమయింది. ఆకుపచ్చని శాలువా చూడగానే సంపాదకుఁడని గ్రహించి అడిగాను—

"మీరు యీవేళకి వస్తానన్న మాట కాదే?"—"అందుకనే వచ్చాను. తమ సంగతి తెలుసునుగా, మేము వస్తామన్న వేళకే సరిగ్గా మీకు బజారులో చాలా అవసరమైనపనులు వచ్చి కూర్చుంటై!" అన్నాడు సంపాదకుడు.

సంపాదకుని బుద్ధి ముందు వోడిపోయి ఖిన్నుడనయాను. కోపంకూడా రాలేదనటానికి వీల్లేదు. కొంచెం కటువుగా—"లేఖ యివ్వటానికి వీల్లేదు మహాశయా! కిందటి లేఖకు దక్షిణగా వొక బుడ్డి ఫౌంటెనుపెను సిరా పంపుతా మన్నారు—పంపనేలేదు! మీ సతీశవత్తు వారపత్రిక దీపావళి సంచికకు ఒక కథ యిచ్చాను! బీడీలు పెట్టుకోవటానికి డబ్బా యిస్తానని వడంబడిక. ఇవ్వనేలేదు! నే నిక రాయను మహాశయా!" అని అన్నాను.

సంపాదకమహాశయుడు శాలువా చంకను పెట్టుతూ—"మీకు నష్టమేమిటి యిందులో? మీ పేరందరికి తెలుస్తున్నదిగా!" అన్నాడు.

"రాసి పేరు తెచ్చుకునేకంటే జేబులు కొట్టి పోలీసుస్టేషనుకు పోతే ఎక్కువ పేరు వస్తుంది" అన్నిపత్రికలలో రిపోర్టు ఒకేమారు పడుతుంది అని ఒక పోస్టుకార్డు తీసుకున్నాను.

"దాంట్లో చాల చిక్కులున్నై. పోలీసుస్టేషనుకు పోకుండా లోకులచేత నాలుగు తన్నులు తిని ఇంటికికూడా తిరిగి రావచ్చు. అప్పుడు జాతీ

పోతుంది—కడుపూ నిండదు !" అన్నాడు సంపాదక మహాశయుడు.

సంపాదకుని యుక్తిలోని సారాన్ని గ్రహించి మాట్లాడకుండా వూరుకున్నాను.

సంపాదక మహాశయుడు మరల అన్నాడు—"మీ క్రిందటి లేఖ మహా అద్భుతంగా వుంది. మావదినె సుధారాణి అన్నది, లేఖ చదివి—"

"ఆపేసేయండి! ఇంతటితో" అని గద్దించాను.

"అలాగే! పొరపాటున స్త్రీల ప్రసంగం ఎత్తాను, క్షమించండి!" అని సంపాదక మహాశయుడు నా దగ్గరికివచ్చి ప్రారంభించాడు—"వుత్తరం రాయటం కట్టిపెట్టండి! ఈ దఫా మీరు నవలరాయాలని పాఠకులు-ఉహూ, పాఠకులు కోరుతున్నారు. ఈ మాసంలోనే మొదటి కిస్తీ యివ్వాలి. ముందు మొదటికిస్తీ రాసేయండి."

"చంపేసేటట్టున్నారే మహాశయా నన్ను? ఇప్పుడు లేఖలకి స్తీ, ఇంతవరకు లైఫ్ యిన్నూరు కిస్తీలే యివ్వలేదు రెండు !"

"చేతగాని పనులు నెత్తిన వేసుకొంటే మీరేచస్తారు! దమ్మిడీ చేయని వాళ్లకుకూడా యిన్నూరు! ఉత్తరాలు ఆపి ప్యాడ్ తీసుకోండి!"

"అయితే మీరు వదలరూ నన్ను ?" అని అడిగాను.

సంపాదకుని కళ్లలో నీరు తిరిగింది. నేను ఆశ్చర్యం వెల్లడించకముందే అన్నాడు—

"చాలా కష్టమైన మాటన్నాను, పొద్దున్నే! మిమ్మలనైనా వదులుతాను కాని మీ లేఖలను మాత్రం వదలలేను. కాళీకాగితాలు నింపటానికి మీ లేఖలు మాదిరి యింకెక్కడా దొరకవు. మీరు ఎంత కావాలంటే అంత రాయగలరు—ఎక్కువ తక్కువ వొక్క లయినకూడా వుండదు. పైగా మీకు డబ్బివ్వాల్సిన అవసరం లేదు. కాయితా లివ్వకుండా అచ్చువేస్తున్నారనే మీకు సంతోషం. మీ లేఖమాదిరి—పోనివ్వండి ఆ గోల ఎందుకు; నా సంగతి చెప్తాను ! నవల కిస్తీ—"

సంపాదకీయు అశ్రువులు చూసి నేను ద్రవించిపోయి అన్నాను—"దుఃఖించబోకండి. నేనిప్పుడు నవల యివ్వలేను, కాని నవలప్లాటు మాత్రం

రాసి యివ్వగలను. ఈసారికి వేసుకోండి, వచ్చే మాసంనుంచి కిస్తీలవారిగా నవల రాసి యిస్తాను— వేసుకోవచ్చు. ఏమంటారు?''

సంపాదకమహాశయుడు కొత్తపెళ్ళికూతురు మల్లే మెడ పక్కకు పెట్టి మందహాసం చేస్తూ—"అలాగే!'' అన్నారు.

"అయితే కాసేపు కూర్చోండి." అని, కాయితాల ప్యాడ్ తీసుకొని రాసుకునే గదిలోకి పోయి రాశాను.

## ప్రథమ పరిచ్ఛేదము

[నిమ్న లిఖితవాక్యములు సంక్షిప్త స్మారక మాత్రములు. వీనిని ఆధారము జేసికొని నవల రచించునపుడు ప్రకృతివర్ణన, ఘటనలు మొదలగునవి విశదీకరించి వ్రాయవలసియుండును]

గభీరరాత్రి— అమవసనిశ. ఆకాశమున తారలు— పురందర నగరరాజ ప్రాసాదాళిందమున నిలంబడియున్న రాజపుత్రిషోడశి, శతదళ వాసిని. శతదళ సన్నిభ ముఖపద్మము— దానిపై శిశిరబిందువులకరణి యశ్రుకణములు. పాతాళ పురిభంగి దశదిశలు నిశ్శబ్దము. అనతిదూరమున— శత్రుశిబిరమున మాత్రము యుద్ధాశ్వముల హేషాధ్వని. రాజపుత్రి శతదళవాసిని చింతన జేయుచున్నది.

## ద్వితీయ పరిచ్ఛేదము

ఏమి చింతన చేయుచున్నది? ఏల చింతన చేయుచున్నది? చింతనం జేయుచునే అశ్రువులు కార్చుచున్న దేల? ఈ ప్రశ్నల కన్నిటికి సమాధాన మెవరిచ్చెదరు? అగాధ ఐశ్వర్యము. అనుపమ రూపము, పరిపూర్ణ యౌవనము. ఇన్ని యున్నను, రాజకుమారికి చింత ఎందులకు? ఎవరి వ్రేలుచూపు మాత్రమున యశోనగరము, సముద్రదేశము, రాష్ట్రకూట రాజన్యవర్గము— ప్రభునియాదేశము బొందిన సారమేయము మాడ్కి— పురందరనగర రాజతోరణము దాపున ఉపస్థితులవుదురో— అట్టి రాజకుమారికి చింత ఏల?

## తృతీయ పరిచ్ఛేదము

అయినను చింతయున్నది. ఆచింతకు మూలకారణ మరయవలయునన్న చదువరులు పదిసంవత్సరములకు పూర్వము—హిమాద్రిపురమున శివాలయము

నకు సన్నిహితమైయున్న పాంథశాలయొద్దకు జేరవలసియుండును. ఆ పాంథశాల—ఒకప్పుడు శత్రుదుర్గవిజయి వీరకేసరి—ఇత్యాదులు.

ఆ పాంథశాలలో వాపీసోపానముపై షష్ఠవర్ష రాజకుమారి శతదళవాసిని ఆకస్మికముగ స్ఖలితచరణయై, వాపీజలస్థ ప్రస్ఫుటిత శతదళసహస్రమధ్యమున నిమజ్జితురాలయ్యెను. హంసకులము భయ—వ్యాకులము జెంది చీత్కారము చేయ నారంభించెను. మీనగణ మెగురుచు పుచ్ఛప్రదర్శనము జేయ మొదలిడెను. కొన్నింటి పుచ్ఛములులోహితవర్ణము, కొన్నింటివి నీలము, కొన్నింటివి హరితము-ఇత్యాదులు. పాంథశాలలోని రాజకుమారిసహచరులు, ఆత్మీయులు, పరిచారక పరిచారికావర్గము, ఈ దుస్సంవాదము శ్రవణము జేసినంతనే పెద్దపెట్టున విలపించుచు వాపీతీరమునకు జేరినవారయిరి. కాని, నిమజ్జిత రాజకుమారిని జలతలమధ్యమునుండి ఎవ్వరు ఉత్తోలన జేయజాలరయిరి. ఇటువంటి సమయమున 'తప్పుకొనుడు, తప్పుకొనుడ'ని చీత్కారముజేయుచు, దశవర్షముల గోపాలబాలకు డొకడు వాపీతటమునకువచ్చి, జలమునలంఘించి రాజకుమారిని ఉద్ధరించిన వాడయ్యెను. రాజకుమారి కించిత్తు స్వస్థత జెందినదై, ఇందీవరాక్షులను ఉన్మీలించి తన ఉద్ధారకునిపై దృష్టినిక్షేపముజేసెను. దృష్టి వినిమయమాయెను. ఒక్కక్షణమాత్రమే! మరుక్షణము గోపాలబాలకుడు ప్రస్థానముచేసెను. ప్రథమదృష్టి పాతముననే రాజకుమారి హృదయమున ప్రణయము జనించెను. ఆమె క్రమముగ దీర్ఘనిశ్వాసములు విడువ నారంభించెను. కాని గోపాలబాలకుని సంధానము చిక్కలేదు. తుట్టతుదకు పల్లీయుల ముఖమున—ఆ గోపబాలకునిపేరు ప్రశాంతకుమారుడని మాత్రము రాజకుమారి తండ్రి తెలిసికొనెను. గాంధారము, కోసలము, ఘూర్జరము, పల్లవము మొదలుగాగల దేశములకన్నింటికి, గోపబాలకుని యనుసంధానార్థము దూతలను పంపినవాడయ్యెను. కాని, ఫలము శూన్యము. అనంతరము రాజులోకాంతరగతుడయ్యెను. తదుపరి శతదళవాసిని రాజసింహాసనమున సమారూఢయై ప్రబలప్రతాపముతో రాజ్యమును శాసించుట మాత్రము సత్యము—కాని ప్రశాంత కుమారుని విస్మరింప జాలనిదయ్యెను. అనేక విధముల అనుసంధానము చేసిన మీదట నేడు—

## చతుర్థ పరిచ్ఛేదము

నేడు సంధానము చిక్కినది. కాని చదువరులారా! ప్రశాంతకుమారు డెచ్చటనున్నాడో చెప్పగలరా? అదిగో, ఆశత్రు శిబిరమున—అదే శత్రు శిబిరమున యోధునివేషమున సజ్జితుడై సేనాపతి ప్రశాంత కుమారుడు అశాంత భావముతో పచారుచేయుచున్నాడు. అతనిహృదయమున రెండు భావములు అహి-నకులముల పగిది క్రీడించుచున్నవి. మొదటిభావము శతదళ వాసిని యందున్న యనురాగము; రెండవది దిగ్విజయ స్పృహ. ప్రశాంత కుమారుడు శతదళవాసినిని విస్మరింపలేదు. కేవలము క్షాత్రధర్మపాలనార్థము పురందర నగరమును ముట్టడించెను. చింతన యధికమగుటచే ప్రశాంతకుమా రుని హృదయాంతరాళమునుండి శతదళవాసినీ సంక్రాంత ప్రేమ దూర మయ్యెను. క్షాత్రధర్మపాలన స్పృహయే బలవత్తరమయ్యెను.

అంతట ప్రశాంత కుమారుడు తూర్యధ్వనిచేసెను. సేనాపతి తూర్యరవము శ్రవణముచేసినంతనే జలప్రపాతము కరణి సైన్యదళము పురందర నగర మాక్రమించెను. అళిందమున నిలంబడియున్న శతదళవాసిని చక్షువులు ప్రదీప్తి జెందెను. ఆమెగూడ పురందర నగరసైన్యదళమును, శత్రుసైన్యముపై బడు నట్లా దేశించెను. ఘోరతర యుద్ధమారంభమయ్యెను. కరవాలమునకు కర వాలము; బల్లెమునకు బల్లెము ఇత్యాదులు—

ఆ దారుణ ఘన ఘటాచ్ఛన్న నిశయంతరించి ప్రభాతమయినంతనే తన సైన్యదళము రూపుమాయుటయు, పురందరనగర సైన్యముగూడ నిశ్శేష మగుటయు, ప్రశాంతకుమారుడు గాంచెను. అంతట యతడు వ్యథితుడై అశ్వము నారోహించి రణస్థలినివీడి ప్రస్థానముజేసెను. పురందర నగరతోరణ ద్వార మతిక్రమించగనే తన వెనుక చీత్కారధ్వనివిని ప్రశాంతకుమారుడు తిరిగిచూచెను — అలులాయితకుంతల స్త్రీయొకతె భైరవ గర్జనచేయుచు యతని ననుసరించుచుండెను. ప్రశాంతకుమారుడు అశ్వమును మడిమతో తాడించి వీరవిక్రమముతో పలాయనముజేయ నారంభించెను. చదువరులారా! ఆ ఉన్మత్తభైరవి, ముక్త కరవాలపాణి యెవ్వరో చెప్పగలరా?—రాజ కుమారి శతదళవాసిని!

ఇంతవరకు వ్రాసేవరకు సంపాదక మహాశయుడు వచ్చి లేఖ చూస్తాను యివ్వమని అడిగాడు. కాయితాలు చేతికిచ్చి బీడి ముట్టించాను.

సంపాదక మహాశయుడు చదివి అన్నాడు. "అంతా పాడుచేశారు! పుత్తమిడీవల్ రోమాన్సుచేసి కూర్చున్నారు! ఇదెవ్వరు చదువుతారు? ఆఖరికి మీరే చంపేటట్టుగా వున్నారే నన్ను!"

బీడీబాగా దమ్ముకేసి అడిగాను—"చెప్పండి, ఏమి చేయమంటారో?" సంపాదక మహాశయుడు అన్నాడు—"మాడరన్ పద్ధతిని రాయండి. దీన్ని కాస్త సవరిచ్చి—" మధ్యనే అడ్డుతూ అన్నాను—కూర్చోండి కుర్చీలో, ప్రయత్నించి చూస్తాను" మళ్ళీ మొదలుపెట్టాను.

పంచమ పరిచ్ఛేదము

ముందు అశ్వపృష్టమున భయముచే పలాయనము చేయుచున్న ప్రశాంత కుమారుడు; వెనుక ధావమాన, భైరవ వేషధారిణి శతదళవాసిని. అనేక మరు ప్రాంతరములు, దేశములు, ఉపత్యకలు, గిరిమాలలు యిరువురు దాటిరి. ఒకరి నొకరు సమీపింపజాలక పోయిరి. తుదకు ధావనముచే కాతరము చెందిన యశ్వద్వయము ఇంద్రప్రస్థమున కనతిదూరమున పంచత్వనొందెను. అయ్యారే! ఏమి యీ పంచత్వ ప్రాప్తిదృశ్యము? స్ఫురిత నాశికా రంధ్రములు, నిర్గత జిహ్వా, ఘర్మప్లుత దేహము ఇత్యాదులు — ప్రశాంతకుమార శతదళవాసిను లిరువురు మూర్ఛ జెందినవారైరి.

సంపాదక మహాశయుడు తొంగిచూచి అడిగాడు—"మళ్ళీ ఆ ఇంద్రప్రస్థమే? చూస్తేమీరే నన్ను వదిలేటట్టుగాలేరు!"

"కాస్త ఓపికపట్టండి! ఇంకా వాళ్ళకి మూర్ఛ తెలియలేదు" అని మళ్లీ ప్రారంభించాను.

షష్ఠ పరిచ్ఛేదము

మూర్ఛాభంగమయేవరకు తూర్పు తెల్లవారింది. శతదళవాసిని కళ్లు తెరచి చూసింది—ప్రశాంతకుమారుడు పడివున్నచోట ఎవ్వరూలేరు. శతదళ మరల మూర్ఛపోయింది. వాస్తవానికి అక్కడ ఎవ్వరూలేరు. ప్రశాంతకుమారుడు తెల్లవారు ఝామునలేచి చలికి కంపిస్తూ పట్టణంవైపుకు నడిచాడు. శతదళ

బ్రతికిందో చచ్చిందో కూడా చూట్టానికి వీలులేనంతగా అతను కంపించి పోయాడు. చాందినీచౌకుచేరి ఒక కాఫీహోటల్లో రెండుకప్పులు టీ త్రాగి ప్రశాంతుడు కొంచెం తెప్పరిల్లుకున్నాడు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది అతనికి శతదళ సంగతి. కాస్త గగుర్పాటు చెంది, నెమ్మదిగా అతనుపడ్డ మైదానం లోకి వచ్చి చూశాడు—అక్కడ ఎవ్వరూలేరు!

ఈ మధ్యలో జరిగిన సంగతియిది. ఒక సినిమా కంపెనీవాళ్ళు షూటింగు కోసం ఆ మైదానంలోకి వచ్చారు. అసహాయస్థితిలో పడివున్న శతదళను చూచి వాళ్లు తీసుకెళ్లారు. మేనేజరు రెండు పెగ్గులు నోటికి అందించగానే శతదళ కళ్లు తెరచింది. తర్వాత మందహాసంచేస్తూ అడిగింది — "నువు ప్రశాంతుడవా ?"

మేనేజరుకూడా నవ్వుతూనే జవాబిచ్చాడు. "కాదు, అవినాశుణ్ణి."

పిమ్మట మేనేజరు శతదళ జీవితచరిత్రంతా విని—అదే ప్లాటుతో రెండు మాసాల్లో ఫిల్ముతీసి వేశాడు.

సప్తమ పరిచ్ఛేదము

ప్రశాంతుడు యిప్పుడు కారు నడుపుతున్నాడు. ఆవాళ కాస్త తీరిక చేసుకొని వాణీవిపణి షోసాలెస్‌కు వచ్చాడు. ఎలాగో తంటాలుపడి నాలు గణాల టిక్కెట్టు ఒకటి సంపాయించాడు. చిత్రంపేరు 'పిరికిపంద!' రెండు రీల్సు చూచేసరికే ప్రశాంతుడు చకితు డయాడు. అదిగో, అళిందములో నిలబడి రాజకుమారి—ఆమె శతదళ కాదూ? ఆమే! ప్రశాంతుని శ్వాస రుద్ధమయింది. అతని జీవితచరిత్రనే ఈ చిత్రంలో తీశారు. చిత్రం చూస్తూ చూస్తూ అతను అన్నీ మరిచిపోయాడు — తాను ముప్పైయిదు రూపాయల కారుడ్రైవరు నన్నమాటా, ఇంటి ఆవిడకు అద్దెతాలూకు పదిహేను రూపా యలు యివ్వాలన్న సంగతీ, అంతా—

తాను రుద్రపుర సేనాపతి ప్రశాంతుడననే మనస్సులో భావించుకున్నాడు. చిత్రం చూస్తూ తన్ను తాను మర్చిపోయి కత్తికోసం మాటిమాటికీ జేబులో చేయిపెట్టాడు. చిత్రం ఆఖరున ప్రశాంతుడు గుర్రమెక్కి పారిపోతున్నాడు. వెనుకనే శతదళకత్తి చేతపట్టి గుర్రంమీద అతన్ని అనుసరిస్తున్నది. ఇది

చూడగానే ప్రశాంతుడు రోమాంచితుడయాడు. చిత్రంలోని శతదళ ప్రశాంతునికి చాలాదగ్గరకు వచ్చేవరకు 'బాబో' అని కేకపెట్టి, గేట్లో వుండే టిక్కెట్టుకలెక్టరును పడసెట్టి, తలుపు తీసుకొని రయ్యిన పరుగు!

పరుగు, పరుగు, ఒకటే పరుగు! హద్దు లేదు, ఆపులేదు! అమ్హర్స్టు స్ట్రీటు దాటి మాదిగ బజార్, మాదిగబజారునుంచి రాజాబజార్, నారికేళ డాంగా—పోతూనేవున్నాడు. నారికేళడాంగా దాటి రవ్వంతసేపు ఆగి వెనక్కి చూశాడు—నెత్తిన తట్టా చేతిలో కర్రతో ఎవరో వస్తున్నారు. శతదళ మారువేషంతో వస్తున్న దనుకొన్నాడు—మళ్ళీ పరుగు!

సంపాదకుడు కలంఆడటం పట్టే అక్షరాలు పోల్చి చదువుకొని వుండ వచ్చు—"ఏమిటి రాసేది, చెప్పండి?" అని అడిగాడు.

"ఎందుకు?"—అని అడిగాను.

"మీరు వూరక పరిగెత్తించుక పోతున్నట్టుగా—వుందే!" అని సంపాదకుడు అడిగాడు.

"మాడరన్ చేయమన్నారు కదూ? అందుకనే ప్రశాంతుణ్ణి పరుగెత్తించి కథకు కాస్త గమనం తెప్పిస్తున్నాను!" అన్నాను.

"చాలు, గమనం యిక ఆపేసెయ్యండి. మిమ్మల్ని లేఖ అడగటం నాదే పొరపాటు! త్వరగా పూర్తిచేయండి బుధవారం పత్రిక్కి యివ్వాలి" అని సంపాదకుడు బర్మా చుట్ట ముట్టించాడు.

"సరే"నని మళ్ళీ ఆరంభించాను.

### ఉపసంహారము

పరుగెత్తుతూ పరుగెత్తుతూ ప్రశాంతుడు యెడ్లబండి క్రిందపడిపోయాడు. పెద్ద దెబ్బతగిలింది. స్పృహ లేదు. అంబులెన్సుకారు, హాస్పిటలు—మొదలగునవి.

ఈ మధ్యలో మేనేజరు అవినాశునికీ మిస్ శతదళకూ తగువువచ్చింది. కారణం కూడా చిన్నది. ఒకనాటి షూటింగులో, కథానాయకుడైన జలధరుని మెడ కాస్త బిగించి పట్టుకొని, అవుసరంకంటే అధికంగా అతని వైపుకు అంగుళం వాలిక మొగ్గినదట శతదళ! ఆ మర్నాడే జలధరుడూ

శతదళ కంపెనీ వదిలేశారు. కేసు నడిచింది. శతదళను వదిలెట్టారు. కంట్రాక్టు భంగం చేసినందుకుగాను కంపెనీవారికి మూడువందల రూపాయలు నష్టపరిహారం క్రింద యివ్వమన్నారు కోర్టువారు జలధరుని. తీర్పువిన్న నాటిరాత్రే ముఖం వ్రేలాడివేసుకుని జలధరుడు గంగ దాటాడు—అక్కడ అతని మేనత్త వుంటూ వున్నది. శతదళ నర్సింగ్ నేర్చుకొని నర్సు అయింది.

ఆవాళ సాయంకాలం తలకు బ్యాండేజీ కట్టుకొని ప్రశాంతుడు శాంతంగా పండుకొని వుండగా పాలగ్లాసు చాతపట్టుకొని ఒక స్త్రీ వచ్చింది. ఆమె శతదళవాసినీ సింహా, సిక్ నర్స్! ప్రశాంతుడు ఆమెను చూడగానే భయంతో వణికిపోయి—"నీ విక్కడ—! నేను చావటానికి సిద్ధంగా—! ఇప్పుడు కత్తితో—" అన్నాడు.

పాలగ్లాసు క్రింద పెట్టి శతదళ "ముందునిన్ను బందీనిచేయనీ—శాస్తిమాట తర్వాత !" అని అన్నది.

తర్వాత రెండుచేతులతో ప్రశాంతుని మెడ వాటేసుకున్నది శతదళ-రాజపుత్రి శతదళ—అభినేత్రి శతదళ—నర్స్ శతదళ !

సంపాదకుడు ఆగ్రహంతో "తర్వాత?" అని అడిగాడు.

"తర్వాత యింకేముందీ ?—బర్మా చుట్టపళ్లతో బిగపట్టి మీసాలు మెలివేసుకొంటూ డాక్టరువచ్చి—'షాకింగ్' అన్నాడు. శతదళ ప్రశాంతుని తల టప్పున బాలీసుమీద పడవేసింది!"

"బాగా బుద్ధిచెప్పారు మహాశయా మాకు! ఇవ్వండి ఆకాయితాలిట్లా ! ఇకరానండి మిమ్మల్ని లేఖ అడగటానికి-" అని సంపాదకుడు చీత్కారం చేశాడు.

"ధన్యవాదాలు! భగవంతుడు మీకలాంటి సద్బుద్ధి యివ్వాలనేగా నాకోరిక !"

కోపకషాయిత నేత్రాలతో నావంక చూచి, కాయితాలు జేబులో పెట్టుకొంటూ, గజేంద్ర గమనంతో సంపాదక మహాశయుడు వెళ్ళిపోయినాడు.



# కథ కాని కథ

సంపాదక మహాశయుడు వచ్చి వినయంగా నమస్కరించి "తమ రచన ఒకటి కావాలి" అని అడిగాడు.

"ఎందుకూ ?"—నే నన్నాను.

"మా పత్రిక కోసం. ఆలస్యం చేయటానికి వీల్లేదు. రేపే అచ్చు కిచ్చెయ్యాలి. కథ అయితే మంచిది, లేకపోతే రసవంతమైన రచన ఏదైనా సరే. దాంతో పాటు వీలుంటే ఏదైనా గీతం. ఇవేవీ వీలుకాకపోతే మీరు వ్రాసే నవల యొక్క మొదటి రెండు ప్రకరణాలు—తరువాత ప్రతి మాసమూ రెండు మూడు ప్రకరణాల చొప్పున ప్రకటిస్తాం. కాపీ యివ్వండి" అని సంపాదక మహాశయుడు కుర్చీలో కూలబడి కాపీ చూడటానికి చొక్కా అంచుతో ముక్కద్దాలు తుడవసాగాడు.

"రేపటిదాకా ఆగటానికి వీల్లేదూ ?"—నేను సంకోచిస్తూ సంపాదకునితో అన్నాను.

"ఊహుఁ ! ఇప్పుడే కావాలి ! మీరు కొంచెం టీ, కాస్త చిరుతిండి తెప్పించి పెట్టండి. నేను అందాకా డ్రాయింగ్ రూమ్‌లో న్యూస్ పేపర్ చూస్తూ కూర్చుంటాను."

సంపాదక మహాశయుడు అవతలికి పోబోతూంటే పిలిచి "ఇంత తొందరలో ఏం వ్రాసేది ? బుర్రలోకి ఏమీ రావటం లేదు !" అన్నాను.

సంపాదకుడు ఆగి నిరసనగా చూస్తూ "మీ రేం లేఖకులండీ ! సుకుల్ బాబు మూడు గంటల్లో కథ వ్రాసేస్తాడు. మంతుబాబు నాలుగు కథలు ఒకేసారి మొదలుపెట్టి నాలుగు జాముల్లో పూర్తిచేస్తాడు. దాసుబోస్ సినిమా చూసి రాగానే—కథ వ్రాయటానికి ఎంతసేపు పడుతుంది? పూర్వపు పద్ధతిలో వ్రాయటానికి తప్పకుండా నాలుగయిదు రోజులు పట్టవచ్చు. కాని ఆధునిక కథ వ్రాయటానికి కప్పు, కప్పున్నర టీ, నాలుగైదు సిగిరెట్లూ తాగి తగలేసే టైము చాలు" అన్నాడు.

"ప్లాటు ?"—నగం చస్తూ అడిగాను.

"ప్లాటు దేనికి? ప్రపంచమంతా ప్లాటే. మీతో నేను మాట్లాడుతున్నాను—ప్లాట్! నౌకరు తినుబండారాలు తేవటానికిపోయి కమీషన్ కోసం హోటలువానితో పోట్లాడుతున్నాడు-ప్లాట్! మీబుర్రలో కథేమీ తోచటంలేదు—ప్లాట్! బుర్రలో కథేమి తోచటంలేదని ఒక కథవ్రాసి వెయ్యకూడదూ? ప్లాట్ ఆలోచించటానికే ఇంతకాలం వ్యర్థంచేస్తే మీరు ఇక కథెప్పుడు వ్రాస్తారూ?...బుర్రలో ప్లాటేమీ తట్టటంలేదు. తల తిరుగుతూంది. మనస్సు భారంగా ఉంది. కణతలు చిటపట లాడుతున్నాయి. కాగితంమీద కాకినీ గద్దనూ గీస్తున్నాను. అత్యంత వ్యాకుల చిత్తంతో భర్తకోసం స్టేషనువైపు చూచే విరహిణీపత్నివలె—"

"ఇక ఆపేసెయ్యండి!—నేను గద్దించాను.

"స్త్రీతో పోల్చాననేగదూ మీ ఆక్షేపణ! పొరపాటయింది! అయితే య్యిలా వ్రాయండి—కాలేజి స్టూడెంట్ ప్రతినెలా 8వ తారీకు తండ్రి పంపే మనియార్డరుకోసం ఎదురుచూస్తున్నట్టు—ఎంత కరుణాపూరితమయిన దృష్టి!" ఇంతలో సంపాదకునికోసం టీ, తినుబండారమూ వచ్చింది. ఆయన చెప్పసాగాడు "ఈ టీ తినుబండారమూ తీసుకొని ఒకఫారం కథ వ్రాసెయ్యవచ్చు. ఇవి మీ నౌకరు రామూ తీసుకురాకుండా ఒక చక్కని చుక్క—గౌరాంగిని—"

సంపాదకుని బుర్రలో మలయపవనుడు సుడి తిరుగుతున్నాడని గ్రహించి ఆయన మాటకు అడ్డం వచ్చి "ఇక అవన్నీ పోనివ్వండి, సార్! ఏదో ఒక ప్లాటుమాత్రం చెప్పి పొండి, వ్రాసేస్తాను!" అన్నాను.

"చెబుతుంటినిగా—ప్లాట్ వేసుకోండి. జరిగిందంతా ప్లాటూ, వ్రాసేస్తే కథా! మీరు ట్రాములోనూ బస్సులోనూ కాలం వెళ్లబుచ్చుతూ ఉంటారు. ఏదో ఒకనాటి ట్రిప్‌సంగతి వ్రాసెయ్యండి, ఎలాంటి కథ అయి కూర్చుంటుందో! అదే నాచురల్ కథ—స్వచ్ఛమైందీ, సహజమయిందీ."

"శేవ్! మీరు అవతలికి వెళ్లికూర్చోండి. ఏదో ఒకనాటి ట్రిప్ సంగతి స్వచ్ఛంగానూ, సహజంగానూ, సరళంగాను వ్రాసేస్తాను" అన్నాను.

సంపాదక మహాశయుడు ఇక మాట్లాడలేదు. పళ్ళలో ఇరుక్కున్న

బంగాళా దుంపముక్కలను నిప్పుపుల్లతో బయటికి తియ్యటానికి ప్రయత్నిస్తూ డ్రాయింగు రూములోకి వెళ్ళాడు.

నేను ఎప్పుడెప్పు డెక్కడికి వెళ్ళానో ఆలోచించసాగాను. నిన్న క్లయివ్ స్ట్రీటు, మొన్న ప్రవాసీ, ఆనందబజార్ పత్రికా – ప్లాటేమీ దొరకలేదు. బుధవారం పనేమీ లేకపోయినా శ్యాంబజారుకు వెళ్ళాను. నిరుద్దేశంగా చేసిన ప్రయాణం సంగతి వ్రాస్తేనే స్వచ్ఛంగా, సహజంగా—ఏదో బాగా కూడా వుండొచ్చు. కాగితాలూ ప్యాడూ తీసుకున్నాను. డ్రాయింగు రూం లోనించే సంపాదకుడు కేకేశాడు — "ఆధునికంగా ఉండాలి. ఘారం ఘారంనరకన్న ఎక్కువ వుండకూడదు. కొద్దిగా కరుణ, హాస్య—"

"సరే. మీరూరుకోండి. అవసరమయితే ఇంకొక కప్పు టీ తెప్పించు కోండి. లేకపోతే సినిమా బొమ్మలు చూస్తూ వుండండి."

నేను వ్రాయ మొదలెట్టాను, బుధవారం ట్రిప్ గురించి.

* * *

శ్యాంబజారు ఎండలో స్నానం చేస్తున్న ఇంద్రలోకంవలె మెరుస్తోంది. ఇంట్లో ఏమితోచక బయటకి వచ్చాను బయట ఏమీ తోచక బజారుకు వచ్చి బస్సు ఎక్కాను. ఎర్రరంగు బస్సు. లోపల ప్రయాణికులు భర్తీగా ఉన్నారు. అంతా పదముగురు — కాదు పద్నాలుగుమంది; ఒకాయన ప్రక్కన నిలబడివున్నాడు, నేను డ్రైవరుప్రక్కనే కూర్చున్నాను. ప్రయాణీ కుల సంభాషణను బట్టి వారు విచారంలో ఉన్నారని కనిపెట్టాను. ఒకాయన అంటున్నాడు—"కాని చాలా అకస్మాత్తు!"

రెండవ:— నేను చాలా మర్మాహతుణ్ణయాను. వారి ఆపుస్తకం ఉండే— కామశాస్త్రం—

మూడవ— కామశాస్త్రం కాదు, పాకశాస్త్రం. అది చదివే వితంతువు వినోదిని వాలుగ చేపవంక చూచి నిట్టూర్చింది.

నాలుగవ:— కాని కవిత్వం ఎటువంటి కవిత్వం!

అయిదవ— మరి గీతాలో ?

ఆరవ—కథలు? ఎంత కరుణాపూరితం—

ఏడవ—ఆ ఏకాంక నాటికలు రెండూ?

ఎనిమిదవ—మినీబోసును ఎంత అద్భుతంగా చిత్రించాడు!

తొమ్మిదవ—వాని తండ్రినో?

పదవ—బతికుంటే గజాననబాబు బెర్నార్డుషా మాదిరి—

పదకొండవ—బంగాలీల దురదృష్టం!

పన్నెండవ—ఆయన కాత్మీయులెవరైనా వున్నారా?

పదమూడవ—భార్యవుంది. ఆభార్యకూడా ఎటువంటిది? సరస్వతి! ఆమె స్వర్గతగిలిన తరవాతనే గజానన బాబు ప్రతిభ...

మొదటి—ఏవిధంగా?

రెండవ—మీరెరుగుదురా ఆయన్ని?

పదమూడవ—మీరెరగరా యేం? ఆయన పెళ్ళికి చుట్టాలెవరూ రాలేదు. అప్పుడాయన వచ్చి, "పంచుబాబూ, మీరన్నా తప్పకుండా దయచేయాలి!" అన్నాడు. ఆయన బలవంతం...

మూడవ—ఆయన అనురోధం నాకూ_డా అనుభవమే. ఆయన కుమారుడి అన్నప్రాశన. నాకు జ్వరంగావుంది. లంకణంవుండి యింట్లోనే పండుకున్నాను. సాయంకాలం వాకిట్లో మోటర్ హారన్ వినపడింది. లోపలి నించి వరండాలోకి వచ్చి చూస్తునుగదా గజానన బాబు ప్రత్యక్షం.

నాలుగు—ఆయనవంటి ఉదారులుండబోరు. చచ్చే క్రిందటిరోజుకూడా ఆయన మామగారి శ్రాద్ధానికి శాస్త్రుణ్ని తోడ్పడమని...

రెండవ—మామా గీమా సంగతి కట్టిపెట్టు మహాశయా! ఆయన భార్య సంగతి చెప్పండి, పాంచుబాబుగారూ, ఎలాటి సరస్వతో!

పదమూడవ—అది చాలావుంది. వింటారా? సరే, ఒక బీడీ యివ్వండి. థాంక్స్; నేను మా కంజీ లయల్ కంపెనీ షోరూమ్సులో...

రెండవ—దానికీ ఆమెకీ సంబంధం?

పదమూడవ—ఉన్నది. వినరాదూ?...ఒక రోజున నేను వేలంవేసే ఫర్నిచరుకు నంబర్లంటిస్తున్నాను. ఇంతలో ఒక పెద్ద మనిషివచ్చి, "మీదగ్గిర

బుక్ కేస్ వున్నదా ?" అన్నాడు. "ఆ, వున్నది" అన్నాను. ఆయన ధర చెప్పమన్నాడు "ఇప్పుడైతే వంద. వేలంలో అయితే ఎంత పాట వస్తుందో తెలియదు" అన్నాను. పెద్దమనిషి బుక్ కేస్ చూచాడు. అయిదారు నిమిషాలు దాన్ని చెయ్యివేసి నిమిరి, దీర్ఘనిశ్వాసం విడిచి అన్నాడు "బాగా నచ్చింది. డబ్బే పోగుకాలేదు."

నాకు చాలా విచారం కలిగింది. "సరే మీరు డబ్బు పోగుచెయ్యండి. అందాకా నేను దీనిపాట 'స్టే' చేస్తాను" అన్నాను. ఆ పెద్దమనిషి నా రెండు చేతులుపట్టుకుని "ఆపు, దాదా! అది లేకపోతే నాకు జరగదు." అన్నాడు.

రెండవ—బుక్ కేస్‌తో భార్యకు సంబంధమేమిటి ?.

పదమూడవ—ఉన్నదంతా దాంతోనే వుంది, మంతు బాబూ... పైకథ వినండి. మరసటిరోజు ఆయన మళ్లావచ్చాడు. నిద్రపోయే నవవధువు వొంటి మీద కొత్త పెళ్ళికొడుకు చెయ్యివేసి నిమిరినట్టు నిమిరి దీర్ఘశ్వాసం విడిచి వెళ్ళిపోయాడు. ఈ విధంగా మూడురోజులు గడిచాయి. ఒకరోజున నేనడిగాను—"ఈవిధంగా రోజూ మీరెందుకు చేస్తున్నారు ? తమ నామధేయం ఏమిటి ?"

"గజాననచటర్జీ. ఈ మాదిరిగా ఎందుకుచేస్తున్నానో తెలుసుకుంటారా? నావెంట రాగలరూ ?" అన్నాడు.

ఆరోజున నాచేతిలో పనేమీలేదు. బయలుదేరాను. గరాణ్ హాట్‌కు తీసుకు వెళ్ళాడు. ఇల్లు గౌరవకుటుంబీకు లుండేదికాదు. పైకి వెళ్ళాను. అబ్బ ! ఎంత చక్కదనం ! పదహారు పదిహేడేళ్ళ అమ్మాయి ఒకతె పుస్తకం చదువుకొంటూంది. గజాననబాబును చూడగానే పుస్తకం అవతల పారేసి ఆదుర్దాతో నా ఎదుటనే ఆయన మెడకు చేతులు పెనవేసి "ఇవాళ న్నా తెచ్చారా ?" అని అడిగింది—గజాననబాబు తలవంచుకుని లేదన్నాడు. ఇక ఆ అమ్మాయి గజాననుని దగ్గరనించి విచారంతో వెళ్ళి పక్కమీద బోర్లా పండుకుని ఏడవసాగింది.

గజాననుడు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ—"చూచారా ?"అని అన్నాడు.

నేనంతా విన్నాను. ఆ అమ్మాయి విధుముఖి నాట్యకత్తెకూతురు, ఇందుముఖి. గజాననుడు ఆమె మేష్టరు. జీతంలేకుండా చదువు చెబుతున్నాడు. ఇద్దరికీ అపారమయిన ప్రేమ. ఆపిల్ల మనస్సంతా విరుగుడుచేవ బుక్ కేస్ మీద వుంది. గజాననుడు అందుకోసమే ఇంతవ్యాకులంగా ఉన్నాడు. అబ్బ! ఏమి వ్యాకులత—

రెండవ—వ్యాకులత అలా అట్టేపెట్టి తరవాత సంగతి చెప్పండి.

పదమూడవ—“మీరు భయపడకబోకండి. రేపురండి నేనంతా యేర్పాటు చేస్తానని” నేనన్నాను—మరుసటిదినం వచ్చాడు గజాననబాబు. ముఖం సంతోషంతో కలకలలాడుతూంది! అబ్బ! ఏమి—

రెండవ—ఇక అది ఆపు, మిస్టర్! అసలు సంగతికిరా.

పదమూడవ—వస్తున్నా...టేబిల్ మార్చి ఎనభైయేడున్నరకు బుక్ కేస్ యిచ్చేశాను. గజాననబాబు నా కాళ్లుపట్టుకుని—

రెండవ—బ్రాహ్మణ్ణి కాళ్ళుపట్టుకోనిచ్చారా?

పదమూడవ—కృతజ్ఞత! కేవలం కృతజ్ఞత! దానికి జాతీనీతీ అడ్డురాదు. పోనీ ఆ వెధవగోల...బుక్ కేస్ తీసుకుని గజాననబాబు వెళ్ళాడు. సాయంకాలం నేను ఊరకనే గరాణ్ హాట్ కు వెళ్ళి ఏమీతోచక వారింటికెళ్ళాను. పైకెళ్ళి చూస్తునుగదా ఆ అమ్మాయీ గజాననుడూ బుక్ కేసుకు అటూఇటూ కూర్చుని, దానిమీద తలలు ఆనించి ప్రగాఢ-ప్రణయ-నిగూఢనిద్రలో వున్నారు—

రెండవ—జరిగిందేమిటో చప్పున తేల్చేయిని, పంచుబాబూ!

పదమూడవ—ఇంకేముందీ తేలేపోయిందిగా! గజాననబాబుకీ ఇందుముఖికీ వివాహం. నేనే వరకర్తను. ఇంకెవ్వరూ రాలేదు.

రెండవ—ఇందుముఖిని పెళ్ళిచేసుకొంటే హారూబాబు మామ శ్రాద్ధం సంగతి చెబుతా డెందుకూ?

నాలుగవ—మీకు శాస్త్రకూడా ఆలోచనలేదు. కుంటిప్రశ్నలు వెయ్యటంమాత్రం తెలుసు...కుమార్తె పెళ్ళి అయింతర్వాత విధుముఖి పార్సీ థియేటరు అక్టరు గోవిందమహంతును కట్టుకుంది. ఆ గోవిందమహంతే

చచ్చిపోయాడు, ఇవాళ్లికి యేభై రోజుల్నాడు.

రెండవ—తర్వాత ఏం జరిగింది, పాంచు బాబూ గారూ?

పదమూడవ—తర్వాతనుంచే గజాననబాబు రచనలు బయల్దేరసాగినై. అబ్బ! ఏమిరచనలు! కథలూ, గీతాలూ, నవలలూ! గీతాలూ, కథలూ! మరి యింకు ముఖ్యో? రాత్రీ పగలూ ప్రూఫులు చూడటం—ఆహారం లేదు. నిద్రాలేదు. ఆ విరుగుడుచేవ బుక్ కేస్ ముందు కూర్చుని—

మొదటి—ఆ వరండాలో మూలనున్న బుక్ కేసు కాదూ?

రెండవ—కాదు, మధ్యని.

మూడవ—సరిగా మధ్య ననటానికి వీల్లేదు. కొద్దిగా ఒక పక్కకు.

పదమూడవ—ఏమయినా కానీండి. బుక్ కేస్ మూలంగానే ఇదంతా జరిగింది—ఈ బుక్ కేసువల్లనే మిలనం, లేఖలూ, అన్నీ—

ఈ సమయంలో ఒక గంభీర కంఠధ్వనివిని ముఖం అటుతిప్పాను. బస్సులో నిలబడి ఉన్నాయన చెబుతున్నాడు. "అంతా చెప్పారు కాని ఆఖరుని ముగించటంమాత్రం మీకు చేత కాలేదు. బుక్ కేసులో ఒక దొంగ అరవుంది. దానిలో మాన్యుస్క్రిప్ట్స్ వున్నాయి. గజాననబాబు వాటినే తన పేరుతో ప్రకటించుకో సాగాడు."

పదముగ్గురు యాత్రికులూ సమస్వరంతో చీత్కారంచేసి "అబద్ధం! గజాననబాబును అవమానం చేస్తున్నాడు. లయర్!" అన్నారు—

"కాదు నేను చెప్పేదంతా సత్యం—గజాననబాబు స్వయంగా ఇవాళ—" ఆయన తొట్రుపడకుండా చెప్పబోతున్నాడు.

ప్రయాణీకులు—స్టుపిడ్! అయన నిన్ననేగా చనిపోయింది?

పెద్దమనిషి—నిన్న చచ్చిపోయింది గజానన గంగూలీ! అటర్నీ. అయుర్వేదంలో గోచికిత్స వ్రాశాడు.

ప్రయా—అయితే మీకు కొద్దిగా తెలుసు నన్నమాట!

పెద్దమనిషి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు—"తెలుసును" వితంతువు వినోదిని ఏ పుస్తకం చదివి నిట్టూర్చిందో మాత్రం నాకు తెలియదు. గజానన బాబు వ్రాసింది కామశాస్త్రంకాదు, పాకశాస్త్రమూకాదు. జటామునుటం.

ఆయన విరుగుడుచేత బుక్ కేసు ఏనాడూ కళ్లతో చూడలేదు. గరాజ్ హాట్ లో విధుముఖి పేరుకూడా ఎరగడు. ఆయన పెళ్ళాడింది పాల్ పాడాలోవుండే నరహరి శిరోమణి ప్రథమకన్య దాక్షాయణిని. ఆయన పియూదహా గొడౌన్సులో పనిచేస్తూ వుంటాడు. ఇప్పుడే ఈ బస్సునించి దిగి పోతోతున్నాడు. నాపేరే గజానన చటర్జీ, నేను మీలో ఎవ్వర్నీ ఎరగను. నమస్కారాలు! శెలవు!" ఆయన దిగిపోయాడు.

యాత్రికులందరూ ఏకకంఠంతో అన్నారు. బ్లఫర్! మనందర్నీ—"

ఇక నేనేమీ వినలేదు. బస్సుదిగి గజాననబాబు వెంటపడ్డాను. నాకొత్త పుస్తకం ఆయనకు చూపించాలిసిన అవసరంవుంది. ఆగుంపులో యెంత వెతికినా ఆయన కనిపించలేదు.

సమాప్తం

* * *

"అయిందా?" సంపాదక మహాశయుడు వచ్చి అడిగాడు. లేఖ చేతికిచ్చాను. చదివి "చాలా పెద్దది చేశారు. ఆధునికంగా ఉండలేదు" అన్నాడు.

నేను సంకుచితుడనై— "అట్లా అయితే ఇంకేవిధంగా ఉండాలి?" అని అడిగాను.

సంపాదకమహాశయుడన్నాడు—"బుక్ కేసు కొన్నతర్వాత—బుక్ కేసు మీద తలలు ఆనించి గజాననుడూ ఇందుముఖీ దగ్గర దగ్గరగా కూర్చుని బుక్ కేసుకొన్న ఆనందంలో హార్ట్ ఫెయిలయి చనిపోయారు. ఆ బుక్ కేసే వాళ్ళ కాఫిన్...ఆ రోజునుంచి నేను మాకంటేలయర్ కంపెనీలో పని వదిలేశాను" అని పూర్తిచెయ్యండి."